విజయ చిత్ర జన్మ దిన ప్రత్యేక సంచిక
200 పేజీలు 10 రూపాయలు
జూన్ నెలాఖరు విడుదలవుతుంది

విజయ సాధనకు మార్గదర్శి 999 అనే తారక మంత్రమే!






ఓవర్‌లాక్ మిషన్లు



ఎరువుల మూటలు
కుట్టు మిషన్లు




ఇవేగాక
"గురు"
ఓవర్‌లాక్ మిషన్లు
శివా కుట్టుమిషన్లు
మోటార్లు

వివరాలకు:
ఫోన్ {22698 27876
సంప్రదించండి

పంపిణీదారులు
# జయగజలక్ష్మి మెషినరీస్
2/156, (పై మేడమీద) బ్రాడ్వే, మద్రాసు-600001.
* అన్నిచోట్లా డీలర్లు కావలెను *










ముఖచిత్రం : **చంపక గంధి**

చిత్రకారుడు : **వడ్డాది పాపయ్య**

**యువ సాలుచందా రూ. 36-00**

**దీపావళి సంచికతో రూ. 42-00**

**యువ, హైదరాబాదు-500001**

విజయవంతంగా ప్రదర్శింపబడుతున్న






డైరక్షన్ : రాఘవేంద్రరావు     నిర్మాత : క్రాంతికుమార్

## దీపక్
హైదరాబాద్

## రాజేశ్వర్
సికింద్రాబాద్

ప్రతిరోజూ మూడు ఆటలు

3–15     6–30     &     9–30

— ఎస్. ఎన్. ఏ. పి రిలీజ్



సర్వాంగ సుందరంగా వెలువడిన 'మే' సంచిక నాకెంతో నచ్చింది. 'స్వగతం' 'గౌతమి చెప్పిన కథ' —ఈ రెండూ ఉత్తమంగా, హృద్యంగా, ఆలోచనలను రేకెత్తించేవిగా ఉన్నాయి. కొడవటిగంటి కుటుంబరావుగారి గల్పికలు 'మెదడుకు మేతను కల్పిస్తున్నాయి. 'జీవనరాగం' నవల ఎంతో ఆహ్లాదంగా, ఆసక్తికరంగా ఉంది. వెలువడుతూన్న రెండు సీరియళ్ళు ఉత్కంఠను రేకెత్తిస్తూ, వచ్చే సంచిక ఎప్పుడు వెలువడుతూందో అనే కుతూహలాన్ని కలిగిస్తున్నాయి.

—యస్వీ. సుబ్బరామ దీక్షితులు
శ్రీకాకుళం

'గౌతమి చెప్పిన కథ,' ఈ నెల 'యువ' ఆణిముత్యాలలో మేలిముత్యమై విలసిల్లింది.

'జీవనరాగం' ఉత్తమ నవలగా చెప్పవచ్చు. 'స్నేహమయి' 'ప్రేమ పూజారి' పోటీపడుతూ సాగుతున్నాయి. కుటుంబరావుగారి 'గల్పికలు' బాగున్నాయి

—పి. పార్వతీశం
బొబ్బిలి.

## మే నెల క్విజ్ సమాధానాలు

1. సి. 2. బి. 3. డి. 4. సి 5. బి
6. విశాఖపట్నం 7. 10 సంవత్సరాలు 8 21-7-1969
9. షెర్ ఫాసూరి 10. హార్స్ రేస్ లేక గుర్రప్పందాలు

## మే నెల క్విజ్ ఫలితాలు

ఆల్ కరెక్ట్ ఎంట్రీలు ఏమీ లేవుగనుక మే నెల బహుమానాన్ని జూన్ నెలకు కలపడమయింది.

జూన్ నెల క్విజ్ బహుమతి మొత్తం రూ. 232-00 అని గమనించవల్సిందిగా కోరుతున్నాము.

ఎడిటర్, యువ.




RSP రవిశంకర్ పిక్చర్స్....

# బంగారక్క

నిర్మాత
వై సునీల్ చౌదరి
సంగీతం
కె వి మహదేవన్





కోస్తా జిల్లాలు: నవయుగ
రాయలసీమ: శ్రీరమణ మూవీస్
తెలంగాణా: శ్రీ తారకరాము

VEEKAY

'మే' యువతో సమాప్తమయిన "మగువ-మాంగల్యము" సీరియల్ నాకు బాగా నచ్చింది. చివరిభాగంలో గల 'యీ కొండనాలిక్కి మందు పెడితే ఉన్న నాలిక ఊడిందట' అనే డైలాగ్సు మరింత ఆకర్షణ కలిగించాయి. రచించిన శ్రీ జొన్నలగడ్డ లలితాదేవిగార్కి నా ధన్యవాదాలు. యద్దనపూడి సులోచన రాణీగారి సీరియల్ "స్నేహమయి" సస్పెన్సుగావుంది.

—ఆర్. రఘుబీర్ సింగ్
ఏలూరు.

'మే' నెల 'యువ' ముఖచిత్రం వింత అద్భుత కల్పనగ చిత్రీకరించారు. 'మగువ-మాంగల్యం' సీరియల్ నవల రచయిత్రి బ్రహ్మాండంగా ముగింపు చేశారు. 'స్వంతం,' 'గౌతమిచెప్పిన కథలు' 'ఎక్సలెంట్' 'జీవనరాగం' నవల రచన శైలి అమోఘం. 'స్నేహమయి' సీరియల్ పాఠకుల హృదయాలను ఆకట్టుకొంటుందని తెలుపుటకు సంతోషించుచున్నాను. 'క్విజ్' పజిల్స్ పోటీ 'యువ'కు హైలైట్.

—యం. ఏ. సలీమ్ అక్తర్, బి కాం.
మంచిర్యాల.

# అజంతా, ఎల్లోరాల అందాల లోకంలో...



## హరివిల్లు విరిసింది, కావ్యం కళ్లు తెరచింది

అజంతా ఎల్లోరాల అద్భుత శిల్పాల దగ్గరకు-పెదవి మీద చిన్న ప్రార్థనతో.
మా రాతికోసం ప్రణాళికలతో, గుండెలు ఆశతో వెళ్లాం—ఒకనాడు వారు సృష్టించిన శిల్పాల
అందాలను తిరిగి సృష్టించడానికి, వాటి అందాలను అందరితో పంచుకోవడానికి, వాటిని
చేసుకొన్న వారి మనసులను, వాటిని చూసిన వారి హృదయాలను ఆనందంతో నింపడానికి.
దాంతో ఈనాడు మైమరపించే వస్త్రాలు సాధ్యపడ్డాయి...మీడియం, ఫైన్, సూపర్ ఫైన్
కాటన్లు, మల్ మల్, చీరలు, షర్టింగులు, వాయిల్స్, దుప్పట్లు, సూటింగులు...టెక్స్‌కాం
సృష్టి చేసే ప్రతి వస్త్రంలో—మన పురాతన అందాల వైభవం తొంగిచూస్తుంది.

## వస్త్రాలలో కొత్త అందాలకు టెక్స్‌కాం

# యువ జులై సంచికలో

కొన్ని ఆకర్షణలు

**పూర్తి నవల**

**రూపం - శాపం - 'శ్రీధర'**

**కథలు :**

**దడి — పి. శ్రీనివాసశాస్త్రి.**

కథకానిది — కథలాంటిది — జీడిగుంట రామచంద్రమూర్తి.

నేను — ఎలక్ట్రాన్

టు లెట్ — యస్. పురుషోత్తమాచార్య

చేదు — అదృష్టదీపక్

ఇంకా ఇతర కథలు, కొడవటిగంటి గల్పికలు,

ప్రేమపూజారి సీరియల్, డా॥ జయదేవ్ కార్టూనులు

**యద్దనపూడి సులోచనారాణి**

స్నేహమయి — (సీరియల్)

జూన్ పదవతేదీకే వెలువడుతుంది.

# యువ

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 35 జూన్, 1977 సంచిక 6


త్వరితి త్వరలోనే, దేశంలోని అన్ని రాష్ట్రాల శాసనసభలకూ ఎన్నికలు జరిగే సూచనలు కనబడుతున్నవి. మార్చిలో జరిగిన పార్లమెంటు ఎన్నికలలో, ఉత్తరదేశంలో కాంగ్రెసుపార్టీ తుడిచిపెట్టుకుపోగా, దక్షిణదేశంలో కాంగ్రెసుపార్టీ పరిగణనీయమైన విజయాన్ని సాధించింది. ముఖ్యంగా, ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెసుపార్టీ సంపూర్ణ విజయాన్ని సాధించింది. అయితే, రాబోయే రాష్ట్రశాసనసభ ఎన్నికలలో కూడా ఇదే విధమైన ఫలితాలు వుంటాయని అనుకోవడానికి ఏమాత్రం వీలులేదు.

ఉత్తరదేశంలోని రాష్ట్రాలలో కాంగ్రెసుపార్టీ తుడిచిపెట్టుకుపోవడానికి ముఖ్యకారణాలు ఏమిటో యిప్పుడు స్పష్టంగా తెలుస్తున్నవి. రాష్ట్ర పరిపాలనా వ్యవహారాలలో కేంద్రప్రభుత్వమూ, కేంద్రప్రభుత్వ నాయకులూ, వారి బంధువులూ ఎక్కువగా జోక్యంకలిగించుకొని రాష్ట్రప్రభుత్వాల చేత ప్రజలకు బాధకలిగించే పనులు అనేకం చేయించడము; రాష్ట్రప్రభుత్వోద్యోగులు తమ తమ శాహతుకుమించిన ధోరణిలో ప్రవర్తించి, అధికారాన్ని దుర్వినియోగంచేసి ప్రజలను అనేక విధాలుగా కష్టపెట్టడము; ప్రజలలో ఏదో ఒక వర్గపు అభిమానాన్ని సంపాదించడానికిగాను, తక్కిన అన్నివర్గాలను అనేక కష్ట, నష్టాలకు గురిచేసే శాసనాలను కేంద్రప్రభుత్వ మద్దతుతో రాష్ట్రప్రభుత్వాలు అమలుజరపడము; ఇలాటి పనులవల్ల, ఆ రాష్ట్రాలలోని ప్రజలు కాంగ్రెసుపార్టీని ఓడించడం జరిగింది.

కాంగ్రెసుపార్టీ విజయాలను సాధించిన రాష్ట్రాలలోని కాంగ్రెసు

ప్రభుత్వాలు, వచ్చే ఎన్నికలలో తాము మళ్ళీ మంచి ఫలితాలను సాధించగలమని అనుకోవడం పొరపాటు అవుతుంది. రాష్ట్రశాసనసభకు ఎన్నికలు జరిగేటప్పుడు, నియోజకవర్గాలపరిమితి చాలా చిన్నదిగా వుంటుంది. ప్రతి నియోజకవర్గంలోని ప్రజలు, తమకు రాష్ట్రప్రభుత్వంచేసిన సదుపాయాలను గురించీ, చెయ్యగల సౌకర్యాలను గురించీ ఆలోచిస్తారు. అంతకన్న ఎక్కువగా, గత కాలంలో తమకు రాష్ట్రప్రభుత్వం ఏమిచేసిందనే విషయాన్ని ఎక్కువగా పరిశీలిస్తారు. అందుచేత, రాబోయే ఎన్నికలను దృష్టిలో వుంచుకొని, తదనుగుణంగా ప్రజాహిత కార్యాలను ఎక్కువగా చెయ్యడం ప్రస్తుతం పరిపాలన సాగిస్తున్న మంత్రివర్గాలకు కొంత మేలు కలిగిస్తుంది. ప్రజాహిత కార్యాలంటే; ఏ ఒక్కవర్గానికో ప్రత్యేక సౌకర్యాలను కలిగించడంకాదు; ఏ ఒక్క కులానికో అదనపు లాభాలను చేకూర్చడంకాదు. ఇలాటి పనులను, ఇదివరకు ఎన్నికలలో కొన్ని రాష్ట్రప్రభుత్వాలు చేశాయి. అంతమాత్రంచేత, ఆ వర్గాల అభిమానాన్నిగాని, ఆ కులాల ఆదరణనుగాని ఆ ప్రభుత్వాలు పొందలేదు. కుల, వర్గ వివక్షత లేకుండా, ప్రజలందరికీ సమానమైన మేలును చేసినప్పుడే అందరు ప్రజలూ అనుభవించడానికి వీలైన సదుపాయాలను కలిగించినప్పుడే, ఏ కులానికీ, ఏ వర్గానికీ బాధకలుగని విధంగా శాసనాలనూ, కార్యక్రమాలనూ అమలు జరిపినప్పుడే ప్రభుత్వం ప్రజాదరణను విశేషంగా పొందగలుగుతుంది. ఈ సంగతులు మంత్రులకు తెలియనివికావు; ఉపన్యాసాలలో మంత్రులు చెప్పనివికావు. అయినా, కార్యాచరణకు వచ్చేటప్పటికి, స్వార్థబుద్ధితోనేమి, స్వవర్గాభిమానంతోనేమి, స్వకులపక్షపాతంతోనేమి, మంత్రులు తాము చెప్పేదానికి విరుద్ధంగా చెయ్యడం ఒక పరిపాటి అయింది. దానివల్ల తమకూ, తమ పార్టీకి అపకారం చేసుకున్నవారవుతున్నారు.

కాబట్టి, ప్రస్తుతం ప్రజలకు పీడాకరములైన శాసనాలు ఏమిటో, కార్యక్రమాలు ఏమిటో క్షుణ్ణంగా పరిశీలించి, వాటిని వెంటనే రద్దుచేసి, ఏదో ఒక వర్గానికికాక ప్రజలందరికీ మేలు కలిగించే కార్యక్రమాలను అమలు జరిపి, పరిశుద్ధమైన పరిపాలన జరిగేటట్టు చూస్తే, రాష్ట్రాలలో నేడు పరిపాలన ~~సాగిస్తున్న పార్టీలే మళ్ళీ విజయాన్ని పొందగలవు లేకపోతే, నామరూపాలు~~ లేకుండా పోతాయి.

ఈ సందర్భంలో, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికీ, ముఖ్యమంత్రికీ మరొకసారి హెచ్చరిక చేస్తున్నాము. నగరనివేశనస్థలాల గరిష్ఠపరిమితి శాసనాన్ని రద్దు

చెయ్యండి. కావాలంటే, గరిష్ఠపరిమితిని నిర్ణయించి, అంతకుమించిన నివేశనస్థలాలు కలవారెవరూ ఇకముందు నగరాలలో నివేశనస్థలాలను సంపాదించకూడదని శాసనం చెయ్యండి. కుటుంబాలలో పంపకాలవల్లా, అవసరాలకు అమ్మకాలవల్లా, నాలుగైదేళ్ళలో యీ నగర నివేశనస్థలాల ఖామందులు తమ స్వాధీనంలోవున్న స్థలాన్ని గరిష్ఠపరిమితిలోకి తెచ్చుకుంటారు. అలాచేస్తే, ఎవరికీ బాధవుండదు - ఎవరికీ నష్టంవుండదు; ఎవరికీ ప్రభుత్వంపట్ల కక్ష ఏర్పడదు.

ఇక వ్యవసాయ భూమి సంగతి. గరిష్ఠపరిమితిని నిర్ణయించే చట్టం ఎప్పుడో అమలులోకి వచ్చింది. ఆ చట్టప్రకారం, గరిష్టపరిమితికిలోపు భూమి గలవారిని, అంతకుపూర్వం భూమిని వారు అమ్మివున్నట్లయితే, ఆ అమ్మకాలను శంకించి, వారిని నానా యాతనలు పెట్టకండి. చేసిన అమ్మకానికి అనేక కారణాలు వుంటాయి. ఆ కారణాన్ని శంకించడం, ఆ వ్యక్తిని అవమానించడం అవుతుంది. చట్టం అమలులోకి వచ్చిన తరువాత, ఎవరైనా తమ అదనపు భూమిని అమ్మినట్లయితే దానికి కారణాన్ని పరిశీలించడంలో అర్థంవుంది గాని, చట్టం అమలులోకి రాకపూర్వం ఒక కుటుంబీకుడు తన భూమిని అమ్ముకుంటే, ఆ అమ్మకాన్ని ఆమోదించకపోవడం సబబుకాదు. ఆ అమ్మకాన్ని నేరంగా పరిగణించడం న్యాయంకాదు. ఇలాటి నిబంధన, ఆంధ్రప్రదేశ్ శాసనంలోతప్ప మరే రాష్ట్రశాసనంలోనూ లేదు. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం, యీ విషయాన్ని మరొకసారి పరిశీలించి, యీ బాధాకరమైన నిబంధనలను తొలగించడం మంచిది. ఈ శాసనాన్ని అమలు జరపడంలో ప్రభుత్వోద్యోగులు ఎంత తీవ్రధోరణిలో తమ అధికారాన్ని చెలాయిస్తున్నారో ప్రభుత్వం పరిశీలించడం చాలా అవసరం.

సంతాన నిరోధక కార్యక్రమాన్ని అమలు జరపడంలో ప్రభుత్వోద్యోగులు అవలంబించిన తీవ్రధోరణివల్లనే, ఉత్తరదేశంలో కాంగ్రెసుపార్టీ ఓడిపోవడం జరిగిందనే విషయం ఈనాడు అందరికీ తెలిసిందే. ప్రభుత్వ విధానాలను అమలు జరుపవలసినవారు ప్రభుత్వోద్యోగులు. అలా చెయ్యడంలో ప్రజాకంటకులుగా ప్రవర్తించకూడదు. కొంతమంది ప్రభుత్వోద్యోగులు ఉత్సాహంతోకాక ఉద్రేకంతో ప్రవర్తించడం కలదు. అలాటి ఉద్యోగులను ఒక కంట కనిపెట్టి, వారిని దారికి తీసుకరాకపోతే మంత్రులు తమ పదవులకు గొయ్యి త్రవ్వుకున్నవారవుతారు.

ఈ విషయాలన్నిటినీ మరొకసారి పరిశీలించమని రాష్ట్ర మంత్రిమండలిని కోరుతున్నాము.

---

## జూన్ నెల యువ భావపరిచయ పోటీ

### బహుమతి పొందిన వ్యాఖ్య




స్వర్గానికి బెత్తెడు - నరకానికి మూరెడు

— కొండపర్తి కమల, హైదరాబాద్.

---

జూలై నెల యువ

## భావపరిచయ పోటీ

**బహుమానం రూ. 25-00**



ఈ కార్టూనుకు హాస్యయుత వాఖ్య (Caption) కావాలి

గమనిక . వ్యాఖ్యలు పోస్టుకార్డుమిదనే వ్రాయాలి.



# బుద్ధి పిలిచింది మనసు పలికింది

ఇల్లిందల సరస్వతీదేవి

"బాబుగారూ ! విధి అట్లా వక్రించినప్పుడు; నా జీవితం చుక్కానిలేని నావలా అయిపోగా, నే నట్లా చెయ్యక తప్పలేదు." ఆమె కళ్ళూ, ముక్కూ కొంగుతో తుడుచుకుని, గాలికి రేగుతున్న తలవెంట్రుకలను రెండు చేతులతో సర్దుకున్నది. ఆమెను పరీక్షగా చూస్తే నలభై సంవత్సరాలు దాటని మనిషిలాగే కనిపిస్తుంది. మనిషి దేహచ్ఛాయను బట్టి చూస్తే ఒకప్పుడు గోధుమ వన్నె ఛాయలో ఉండే దనిపిస్తుంది ! తీరైన ముక్కూ, గడ్డమూ, విశాల నేత్రాలూ తీర్చిదిద్దినట్లున్న కనుబొమలూ చూడ చక్కనిదాని లాగే కనబడుతుంది

ముకుందం ఆమెను పరిశీలనగా చూసి తలకు కట్టుకున్న మఫ్లరును సర్దుకుని కూర్చున్నాడు.

రైలు నడుస్తున్నది. కంపార్టుమెంటులో కూర్చున్న ప్రయాణీకులు చాలా మంది అస్తవ్యస్తంగా నిద్రలోకి జారారు. కొందరు కిటికీతలుపులు తెరచి బయటికి చూస్తున్నారు.

ఆమె కెదురుగా ఉన్న బల్లమీద – అదే మూలగా ఉన్న సీటు కావటంచేత బాగా అనుకుని సన్నటి ఉత్తరీయ మొకటి కప్పుకుని ముడుచుకున్నట్టుగా కూర్చున్నాడు ముకుందం.

ఆమె మాటలు వింటూ అలాగా అన్నట్టుగా తల పంకించాడు ముకుందం.

"ప్రొద్దున్నే రేడియో పెట్టి పిల్లలను కాఫీ తాగటానికి రమ్మని పిలుస్తున్నాను. అంతలో, 'రాత్రి హైద్రాబాదునుండి విజయవాడకు బయలుదేరిన రైలుబండి జనగామదగ్గర వాగు పొంగినందువల్ల, కొన్ని బోగీలు పట్టాలు తప్పి, నీళ్ళల్లో పడిపోయాయి. ఇంజనుతోకూడా ఒకబోగీ ముందుకు వెళ్ళింది...' ఇంకా వివరాలు వినే ఓపికలేక, 'ఒరే నాయనా! నాన్నగారు బయలుదేరిన రైలుకు ప్రమాదము జరిగిందిరా' అంటూ ఒక్క కేకపెట్టాను. రేఖ ఇంకా పక్కమీద పడుకుని కళ్ళు నులుపుకుంటోంది. పెద్దవాడు కాంతి పళ్ళు తోముకుంటూ అలాగే వచ్చాడు. చిన్నవాడు హరి పక్కమీదినుంచి దిగ్గున లేచి, ఒక్క అడుగులో నన్ను చేరుకుని ఏమిటేమిటని చేతులుపట్టుకుని ఊపేశాడు. విన్నదంతా ఇద్దరికీ ఒణుకుతూ చెప్పాను. ఏడుస్తూ రేఖ వచ్చింది.

అప్పుడు మా కెవరు దిక్కు?" ఏడుస్తూ రమణమూర్తిగారిని అడిగిరండి ఆయన కేమయినా తెలుసేమో" నని వాళ్ళిద్దరినీ పంపాను. వీళ్లు వెళ్లేటప్పటికి ఆయన కారులో కాంపౌండరునూ, ఒక నర్సునూ, ఒక నౌకరునూ తీసుకుని బయలుదేరుతున్నారట. వీళ్ళనుకూడా కారులో ఎక్కించుకుని – ఆ ప్రమాదం జరిగిన చోటికి వెళ్ళారు."

"అదా? అది చాలా ఘోరమైన రైలు ప్రమాదం. అయితే వాగు చాలా చిన్నది. ఆ ప్రమాదంకోసం పొంగింది. కాని అప్పుడే నీరు తీసిపోయిందని పేపర్లో వచ్చింది. చాలా జననష్టం జరిగింది కదూ?" అన్నాడు ముకుందం

"జన నష్టమూ జరిగింది. నా కొంపకూడా కూలిపోయిందండి బాబూ! వెళ్ళిన పిల్లలు మరునాటికిగాని రాలేదు. ఈ లోపల నేనూ, మా రేఖ చిత్తరువుల్లా గడపలో కూర్చున్నాము వాళ్లకోసం ఎదురుచూస్తూ – మంచినీళ్ళయినా ముట్టకుండా. పిల్లలు బిక్కముఖాలతో వచ్చి జరిగిందంతా చెప్పారు. శవాలు నీళ్ళల్లో కొట్టుకుపోయి తుప్పలకూ, చెట్లకూ పట్టుకుని ఆగిపోయాయట. శవాలు నీళ్ళల్లో నాని ముఖాలు ఉబ్బి గుర్తుపట్టలేకుండా ఉన్నాయట. ప్లాట్‌ఫారమ్ పొడుగునా శవాలను పడుకోబెట్టారట. ఒక్క శవానికయినా ఒంటిమీద బట్ట లేదుట. ఎలా గుర్తుపట్టటం? అవన్నీ పరీక్షగా చూసిన రమణమూర్తిగారు

ఒక దానిదగ్గర ఆగి, "మీ నాన్నగారే అనుకుంటాను. ఏమోయి కాంతీ ! బాగా చూడు" అన్నాడుట. కాంతి బావురుమని ఏడ్చేశాడట. చిన్నవాడు హరి బాగా పరికించి చూసి కన్నీళ్లు కారుస్తూ అవునేమో నన్నాడట ఆ రమణమూర్తిగారు శవాన్ని కారులో ఇంటికి తీసుకువచ్చారు ఇంక నా పరిస్థితి ఏం చెప్పను బాబు గారూ ! ఇంట్లో పట్టుమని పదిరూపాయలు లేవు. చేతికి రెండు జతల గాజులు - మెడలో పుస్తెలతాడు. బంధువులంతా కబురు విని వచ్చారు. ఆ వస్తువులు ఖర్చు పెట్టి కర్మకాండ ముగింపచేసి వెళ్లారు. నేను పోయిన మనిషికోసమే ఏడవనా ? అప్పుడు మెట్రిక్ చదువుతున్న కాంతి - ఆ కింది క్లాసు చదువుతున్న హరి - మూడవఫారం చదువుతున్న రేఖ - వీళ్ళకోసమే ఏడవనా ?" ఆమె మళ్ళీ కొంగుతో కళ్ళు ఒత్తుకుంది.

"సంసారం నిర్వహించేవాడు పోతే ఏడుపుగాక ఇంకేముంది ? ప్రభుత్వం వారు కొంత డబ్బు ఇచ్చి ఉంటారు. అవునా ?" ముకుందం ఆమె చెప్పినదంతా సావధానంగా వింటున్నాడు.

మాణిక్యం కూర్చున్న బెంచీపైన బెర్తుమీద ప్రయాణీకు డొకతను దుప్పటి కప్పుకుని పడుకున్నా నిద్రపట్టలేదు కాబోలు - వీళ్ల మాటలన్నీ అతడి చెవిన పడుతూనే ఉన్నాయి. ముకుందం కుతూహలంతో వినటాన్ని అతడు గమనించి నట్టే ఉన్నాడు. దిగ్గున లేచి కూర్చుని, "అయితే నేను చచ్చిపోయినా నన్న మాట !" నోట్లో గొణుక్కున్నాడు.

"మీ రన్నట్టుగా ప్రభుత్వం డబ్బు చనిపోయినవాళ్ల కుటుంబాలకు ఇచ్చింది బాబూ ! నాకు వచ్చింది రెండువేల అయిదువందలు. మనిషి పోయాడనగానే ఇవ్వవలసినవాళ్ళు ఊరుకోరుగా ! వారి స్నేహితులు చేబదుళ్ళు తీసుకున్నారని వచ్చారు. ఇంటి అద్దె నాలుగు నెలలది ఇవ్వాలని యజమాని వచ్చాడు.

"సామాను తీసుకున్న దుకాణదారుడు రెండునెలలనుంచి బాకీపెట్టారని వచ్చాడు. నిండా మునిగినవాడికి చలేమిటని తెగువతో అందరికీ ఇవ్వవలసింది ఇచ్చేశాను. తక్కువయింది వంటపాత్రలన్నీ అమ్మి ఇచ్చాను. చివరకు పిల్లలు కప్పుకునే బ్లాంకెట్లు కూడా అమ్మేశాను. ఇంకా నాకు దేముడేమిటని దేవుడి మందిరమూ, పూజాసామాగ్రి కూడా అమ్మి ఎనభై రూపాయలు చేతబట్టుకుని ఒక తల్లిని ఆశ్రయిద్దామని పిల్లలతో మూడు చిన్న సూట్‌కేసులు చేతబట్టుకుని బయలుదేరాను. ఆ తల్లి యిల్లు బేగంపేటలో ఉన్నది. కొంతదూరం బస్సులో- కొంతదూరం నడిచి వాళ్లయింటికి చేరుకునేసరికి సాయంకాలము ఆరుగంట

లయింది. ఇంట్లో ఆ తల్లి లేదు. ఇంటినిండా దీపాలు వెలుగుతున్నాయి. నౌకర్లు యజమానురాలు మరొక గంటలో వస్తుందన్నారు. వరండాలో కుర్చీలుఉన్నాయి. కాని వాటిమీద కూర్చోబుద్ధి పుట్టలేదు. మెట్లదగ్గర గోడకానుకుని కూర్చున్నాము. పిల్లలు కునికిపాట్లు పడుతున్నారు. జరిగినదానికి మనసంతా కరడుకట్టుకు పోయింది భవిష్యత్తు అగమ్యగోచరంగా ఉంది. అలా ఆమెకొరకు నిరీక్షిస్తూ-గేటు చప్పుడయినప్పుడల్లా ఆమే వస్తున్నదని ఆశపడి కళ్లు విప్పుకుని చూస్తూ నిమిషాలను గంటలుగా గడుపుతూ ఉండగా కారు వచ్చి మెట్లదగ్గర ఆగింది. ఆ యింటి యజమానురాలు కారు దిగి "ఎవరూ ఇక్కడ కూర్చుంది ?" అంటూ నా దగ్గరికి వచ్చింది. అప్పటికి నేను గజగజ వణుకుతూ లేచి, ముఖంమీద చేతులుంచుకుని నిలబడ్డాను.

"మాణిక్యం ! ఏమిటిది ? ఇలా వచ్చావు పిల్లలతో ? ఏ ఊరయినా వెళ్ళుతున్నావా ?" నా చేతులు పట్టుకుంటూ అడిగింది ఆదుర్దాగా.

కాళ్లు చాపుకుని కూర్చుందా మనుకున్న ముకుందం చివ్వున లేచి మళ్ళీ కూర్చున్నాడు. ముఖమ్మీద ఏమాత్రం ఆదుర్దాగానీ, కుతూహలాన్నిగానీ కనబడనీయకుండా "ఆమెను అంతకు పూర్వం మీ రెరుగుదురా? ఎవరామె ?" మామూలుగా అడిగాడు.

పై బెర్తుమీద ఉన్న ప్రయాణీకుడు తల వాళ్ళవైపుకు త్రిప్పుకుని కళ్లు అదోలా పెట్టుకుని వింటున్నాడు.

"ఆమె పేరు రాణి కామేశ్వరీదేవి. నాకు చాలా సంవత్సరాలనుండీ తెలుసు. నా బిడ్డల చదువులకు తోచిన సహాయం చేస్తూ ఉండేది. ఆమెతో నా సంగతంతా చెప్పుకుని బావురుమని ఏడ్చేశాను.

"మాణిక్యం ! ముందు పిల్లలూ నీవూ భోజనంచేసి ఆ గదిలో పడుకోండి. నేను రేపు మాట్లాడి నీ సంగతంతా సెటిల్‌చేస్తాను" అన్నదామె.

"ఆఁహా !" అన్నాడు ముకుందం.

ఆ రాత్రి ఆందోళనతో మనసు ఊగిపోతున్నా నీళ్లల్లో కొట్టుకుపోయేవాడికి కొయ్యదొరికినట్లుగా ఆశ—మళ్ళీ ఈ కాలంలో ఎంతటి మహారాణులయినా రాజ్యాలు, సంస్థానాలు లేనివాళ్ళేకదా ! వాళ్ళే మానసికంగా క్రుంగిపోయి ఉంటారు. మనకేం సహాయం చేస్తారన్న నిరాశ - ఈ రెంటిమధ్య వెలుగు చీకట్లను చూస్తూ - అనుభవిస్తూ - భయంతో బిగుసుకుపోతూ తెల్లవార్లూ జాగరణ చేశాను. పిల్లలు ఎంతటి దుఃఖాన్నీ, దైన్యాన్నీ కూడా నిద్రవల్ల

పోగొట్టుకుంటారు. ముగ్గురూ పెట్టెలోనుంచి తీసి పరచిన పాతచీరెలమీద సూటు కేసులు తల క్రింద పెట్టుకుని హాయిగా పడుకున్నారు. ఐదుగంటలకే లేచి ముఖం కడుక్కొని గోడకానుకుని కూర్చున్నారు. ఎనిమిది తొమ్మిదిగంటలకు కామేశ్వరీదేవి వచ్చి నన్ను తన గదిలోకి తీసుకువెళ్ళి తన కుర్చీ కెదురుగా ఉన్న కుర్చీలో నన్ను కూర్చోమంది.

నా కేమని సలహా యిస్తుందో—ఏం సహాయం చేస్తుందోనని దీనంగా ఆమె ముఖంలోకి చూశాను.

"మాణిక్యం! ముందు కాఫీ, టిఫిన్ తీసుకుందాము. తరువాత మన సంప్రదింపులు. తీసుకో కాఫీ." కప్పు చేతి కందించింది

నాకు కడుపులో పేగు కదిలినట్లయింది. కప్పు చేతబట్టుకుని అలాగే చూస్తున్నాను.

"నేనూ బిడ్డల తల్లినే. తల్లి మనసు తెలుసు. నీ పిల్లలు కాఫీ, టిఫిన్ ఆ గదిలో తీసుకుంటున్నారు. ముందు కాఫీ తాగు. పిచ్చి మాణిక్యం! నీ వెంతో ధైర్యంగలదాని వనుకున్నా. ముఖాన్ని అద్దంలో చూసుకో. ఎన్నేళ్ళనుంచో అన్నం, నీళ్ళూ ఎరుగని ముఖంలా ఉంది." తొందర పెట్టింది.

"నాకు కడుపులోకి ఏమీ ఎక్కటంలేదు. తింటేగాని ఆమె మాట్లాడదు. ఎట్లాగో అయిందనిపించాను."

కామేశ్వరీదేవికి కాఫీ, టిఫిన్ తీసుకోగానే జరదాతో తమలపాకు బీడా వేసుకునే అలవాటు. నౌకరు తీసుకురాగానే తానొకటి వేసుకుంటూ "నీకూ అలవాటుందిగా! ఒకటి తీసుకో" అంటూ పళ్ళెం అందించింది.

"నాకొద్దు తల్లీ!" చేతులు జోడించాను ఆవేదనతో. "చూడు మాణిక్యం! నీ సంగతంతా రాత్రి ఒంటిగంటవరకూ ఆలోచించాను. ఎంతసేపు ఆలోచించినా నాకు ఒకటే ఒక పరిష్కారం తోచింది. నీ కిష్టమయితే అలా చెయ్యి. కాని నేను బలవంతంచేశానని అనుకోకు," అన్నది నా ముఖంలోకి చూస్తూ.

"నా కేదో ఆశారేఖ పొడచూపింది. చెప్పండి కామేశ్వరీదేవి అదేమిటో?" అన్నాను ఆదుర్దాతో.

"మాకు ఒకప్పుడు సంస్థానాలుండేవి. వల్లమాలిన ఆస్తీ ఉండేది. కాని — ఒళ్లు తెలియకుండా ఖర్చులు చేసుకున్నప్పటికీ బయటపడలేదు కాని — మా సంస్థానాలన్నీ ప్రభుత్వం తీసుకున్న తర్వాత — వారిచ్చే భరణాలతో మేము

కూడా ఖర్చులన్నీ తగ్గించుకుని జాగ్రత్తగా మసలుకుంటున్నాము. నన్ను చూశావుగా ! రాజావారున్నప్పటికంటె చాలా ఖర్చులు తగ్గించాను. ఒక పెద్ద ఆఫీసరుకు పై భాగమంతా అద్దె కిచ్చాను. కుక్కల్ని తీసివేశాను. నా కిప్పుడు ఒక ఆయా, ఒక వంటమనిషి. కొత్తకారు అమ్మేశాను పాతదాన్ని అట్టే పెట్టుకుని. ఒక డ్రైవర్ను పెట్టుకున్నాను. కారుంది గదా అని ప్రతిరోజూ బయటికి వెళ్ళను. ఎందుకో తెలుసా ? పెట్రోలు ఖర్చని. అయితే – నా పరిస్థితులన్నీ ఏకరువుపెట్టి నీకు నేను ఏమీ సహాయం చేయలేనని అనబోతానేమోనని భయ పడకు. నీకోసం ఒక పథకం ఆలోచించాను. మీ నలుగురినీ భరించి – నీ బిడ్డలకు నే నొక్కదాన్నీ దారి చూపించలేను. బాగా విను మీ కాంతినీ, హరినీ బొంబాయిలో ఉన్న మా అక్కకు ఉత్తరం వ్రాసి ఆమె దగ్గరికి పంపిస్తాను. మా అక్క అదిలక్ష్మీదేవి నా మాట కాదనదు. నీ బిడ్డలకు చదువు చెప్పిస్తుంది. చదువు కాగానే వాళ్లే ఏదో ఉద్యోగాలు వెతుక్కుంటారు. మగపిల్లలు కదా ఒక గది ఇవ్వమనీ – చదువుకు సహాయం చేయమనీ వ్రాస్తాను. ఐదారేళ్లు భరిస్తే వాళ్లే ఒకదారికి వస్తారు. ఇకపోతే నీ కూతురు. నా చెల్లెలు మంజరీదేవికి ఒక్కడే కొడుకు. ఆమె దగ్గరికి మీ రేఖను పంపిస్తాను మనిషి నిచ్చి. ఒక ఉత్తరం కూడా వ్రాసి ఇస్తాననుకో. ఆమె ఒక పల్లెటూర్లో ఉంటుంది గాని బస్తీ సౌకర్యాలన్నీ కల్పించుకున్నది. కొంత చదువేదో చెప్పిస్తుంది. ఎవరినో చూసి పెళ్ళి చేస్తుంది తన పిల్లలా చూసుకుంటుంది. పిల్లల దిగులేమీ నీ కుండదు. నీవు నాకు మనసు కలిసిన మిత్రురాలివి. నీవు నా దగ్గరే ఉండు. నా కొక్క పిల్లవాడు. వాడు శతమొండి. కలకత్తాలో చదువుతున్నాడని తెలుసుగా ! ఏడాది కొకసారి వచ్చి చూస్తాడు నన్ను. రాజాగారు పోయినతరువాత వాడే నా ప్రపంచం – వాడే నా జీవిత సర్వస్వ మనుకున్నాను. న న్నేడిపిస్తున్నాడు. నాకు తోడుగా నా దగ్గరుండి మంచీచెడ్డ చూడు. ఇదంతా నీ కిష్టమైతేనేసుమా!" అన్నది కామేశ్వరీదేవి."

"నా బిడ్డలను గురించి నేను ఎన్నెన్నో కలలు కన్నాను. ఆయనది చిన్న ఉద్యోగమయినా – జీతం సగమయినా ఇంటికి తీసుకురాకపోయినా వాళ్ల భవిష్యత్తును గురించి మేడలుకట్టాను. కాని – నా యిప్పటి పరిస్థితి ! ఆమె పూనుకోకపోతే ఈ పిల్లల గతి ఏంకాను ? సహకరిస్తామంటూ ఎవరు ముందుకు వస్తారు ? కామేశ్వరీదేవి ఒక్కతే బాల్యస్నేహాన్ని మరచిపోకుండా నా బిడ్డల కొకదారి చూపిస్తానంటున్నది. ఒప్పుకోక నేను చేసే దేమున్నది ? అదిగాక

మరొకదారి ఏది ? కటిక చీకటిలో ఉన్న నాకు కాంతిపుంజంలా కనబడి చేయందించింది.

"దిగ్గునలేచి ఆమె చేతులను అందిపుచ్చుకుని కళ్ళకద్దుకొని వెక్కి వెక్కి ఏడ్చాను. బాబుగారూ, అప్పుడు నా మనసు కొంత కుదుటబడింది. పిల్లలను ఒప్పించటానికి రెండురోజులు పట్టింది. మగపిల్లలు త్వరగా సమాధానపడ్డారు. కాని రేఖ ! నన్నొదిలిపెట్టి వెళ్లనంటుంది. దానిని ఒప్పించటానికి కామేశ్వరీదేవి కూడా ప్రయత్నించింది. చివరకు పదిరోజులకు దాని ప్రయాణం సాగింది." మాణిక్యం ఇంతవరకూ చెప్పి బరువుగా నిట్టూర్చింది.

ఎటో ఆలోచిస్తున్నా ముకుందం ఆమె చెప్పినదానిలో అక్షరక్షరమూ విని, అట్లాగా అన్నట్టు తలూపుతూ, "ఇంకా చెప్పండి," అన్నట్టు కుతూహలంతో కళ్ళు వెడల్పుచేసుకుని, ముఖం ముందుకు వొంచి వింటున్నాడు.

పై బెర్తుమీద పడుకుని వింటున్న ప్రయాణీకుడు ఆవేదనతో ఇటూ అటూ మసలుతూ ఇంకేం చెబుతుందోనని చెవులు దోరగిలపెట్టుకుని తన ముఖం కనబడకుండా చాటుచేసుకుని వింటున్నాడు.

"ఇంకేమమ్మా ! పిల్లలు హాయిగా చదువుకుంటున్నారంటున్నావు. నీ లెక్క ప్రకారం మగపిల్లల చదువులయిపోయి ఉండాలి. వాళ్ళకు తగిన ఉద్యోగాల్లో ఈపాటికి చేరే ఉంటారు. అమ్మాయికూడా బాగా చదువుకుని పెళ్ళి చేసుకున్నదో చేసుకుంటుందో ? అంతేకదూ ? తల్లికి ఇంతకంటె కావలసినదేమున్నది ? మీరు పూర్వపు విషయాలన్నీ మరచిపోయి — పిల్లల భవిష్యత్తును చూసి సంతోషిస్తూ కాలం గడపాలి. ఏమంటారు ?" అన్నాడు ముకుందం తనకూ మనసు తేలికయిందన్నట్టుగా ముఖంపెట్టి.

"నిజమే బాబుగారూ ! మీ రన్నట్టు ఇంతకాలమూ వాళ్ళ భవిష్యత్తునే చూసుకుంటూ గతం మరచి బ్రతుకుతున్నా. పెద్దవాడు చదువు పూర్తిచేసుకుని బొంబాయిలోనే ఏదో కంపెనీలో ఉదోగ్యం చేసుకుని జీవనం చేస్తున్నాడు. చిన్నవాడు వ్యాపారదృష్టి కలవాడు. వాడిచేత ఆదిలక్ష్మీదేవి ప్లాస్టిక్ సామాన్ల దుకాణం పెట్టించింది. బాగానే నడుస్తున్నదని ఆమె ఉత్తరాలు వ్రాస్తున్నది. అమ్మాయి రేఖ బి. ఏ. ప్యాసయింది. మంజరీదేవిగారు సంగీతం నాట్యంకూడా చెప్పించారట. పెళ్ళికి ఎదిగింది." కళ్ళల్లో తడి మెరుస్తుండగా మాణిక్యం చెప్పింది.

"ఇంకేం ? సమస్యలన్నీ తీరినట్లే, నావ ఒడ్డుకు చేరుకున్నట్లే. పిల్లకు

మంజరీదేవిగారు ఎట్లాగయినా పెళ్ళిచేస్తారు. ఆదిలక్ష్మీదేవిగారు కూడా అంతో ఇంతో సహాయం చేస్తారు. ఇంకా మీ సమస్యలూ, సందేహాలూ ఏమిటి ?" అన్నాడు ముకుందం నవ్వు పెదవులమీదికి తెచ్చుకుంటూ.

"అయ్యో ! బాబుగారూ ! ఇప్పుడు నా మీదికి విరుచుకుపడ్డ సమస్య ఇది వరకటిది కాదు. ఇది నా బిడ్డ జీవిత సమస్య. నా బిడ్డ నిండుజీవితం మరో వారంలో ముగియబోతున్నది. నా తల్లి కులానికి పేదకాదు – గుణానికి అంతకంటె పేదకాదు. తిండికిపేదయై వారింట ఉంది – మంజరీదేవి కనుసన్నలలో మెలగుతూ చదువుల సరస్వతి అయింది. సౌందర్యరాసిగా రూపొందిందది. మంజరీదేవిగారికి ఒక్కడే ఒక్క మగబిడ్డడు. వారి కిచ్చి దానిని వివాహం చేయాలని ఆమె సంకల్పం. ఆ విషయంలో ఆమె అక్కగార్లు చెప్పినా వినటంలేదు." మాణిక్యం ముఖంలో దుఃఖంకంటె నిస్సహాయత వ్యక్తమయింది.

"ఇంకేమీ శ్రీమంతుల కోడలవుతుంది మీ కూతురు! దానికింత విచారమా ?" వెడద నవ్వొకటి నవ్వాడు ముకుందం.

"బాబుగారూ ! ఐశ్వర్య మెవరికి కావాలి ? అతడు – అతడు – మంజరీదేవిగారి కుమారుడు మరుగుజ్జు. వికృత స్వరూపుడని విన్నాను."

పై బెర్తుమీద పడుకున్న ప్రయాణీకుడు ఆవేదనతో దిగ్గున లేచి కూర్చున్నాడు.

ముకుందం పైకి ఆమెతో గంభీరంగా మాట్లాడాడేగాని కడుపులో దేవినట్లుగా ఉంది.

అంతలో రైలు ఆగింది.

"స్టేషను వచ్చింది కాబోలు," అన్నది మాణిక్యం.

"ఇది పెద్ద జంక్షనమ్మా. చాలా సేపాగుతుంది ఇక్కడ." ముకుందం ముఖం అదోలా పెట్టుకుని ముడుచుకుని కూర్చున్నాడు.

ప్రయాణీకులంతా గబాగబా రైలు దిగి కాఫీ, టీలు సేవించి సిగరెట్లు కొనుక్కొని ప్లాట్‌ఫారమ్‌మీద ఇటూ అటూ తిరుగుతున్నారు. స్టేషనులో రెండు మూడు రైలుబండ్లు బొగ్గూ, నీళ్ళూ నింపుకోవటంలో రైల్వే ఉద్యోగులు అటూ ఇటూ తిరుగుతున్నారు. మాణిక్యం ప్లాట్‌ఫారమ్‌మీద గరమ్‌ఛాయ్ అని అరిచిన వాడిదగ్గర రెండు కప్పుల టీ తాగింది.

"బాబుగారూ, ఇక్కడ దిగితే బస్సుకోసం రెండు గంటలసేపన్నా ఆ చెట్టు

కింద నిరీక్షించాలి. రెండు స్టేషన్ల తరువాత వచ్చే స్టేషన్‌లో దిగితే వెంటనే బస్సు అందుతుంది గాని ఇల్లు చేరుకునేసరికి పన్నెండు గంటలవుతుంది." ఆలోచిస్తున్నట్టుగా కళ్ళు మూసుకుంది.

"అయితే ఈ పెళ్ళి ఆపు చేయటానికే వెళుతున్నారన్నమాట !" అన్నాడు ముకుందం ఆమె నిశ్చయాన్ని తిరగతోడుతూ.

"ఆపుచేయటానికే వెళుతున్నాను. నా బిడ్డకు పెళ్ళి కాదా ? ఒకవేళ నా దగ్గర డబ్బులేదని పెళ్ళికాదేమో ! కాకపోనీయండి నలుగురు పిల్లలకు చదువులు చెప్పుకునయినా బ్రతకలేకపోదు." ముక్కుపుటా లెగురవేస్తూ అన్నది మాణిక్యం. అననయితే అన్నది గాని ఇంతకాలం తన కూతురిని సంరక్షణచేసి చదువు చెప్పించిన మంజరీదేవి అంతటితో వదలిపెడుతుందా ? అంత సులభంగా ఈ విషయం పరిష్కారమవుతుందా ? తన ఉద్దేశ్యము బయటపెట్టిన మరుక్షణము తనను ఇంట్లో ఉండ నిస్తుందా ? భయంకరమైన ఆలోచనలతో ఆమె దేహము జలదరించింది.

ముకుందం కప్పుకున్న దుప్పటిని తొలగించి, మడత చేసిపెట్టుకుని కాళ్ళకు చెప్పులు తగిలించుకుంటూ రైలుపెట్టె దిగి వెళ్ళాడు. కాఫీ, టిఫిన్ చేయటానికి అవతలి ప్లాట్‌ఫారమ్ చివరగా ఉన్న కాంటీనుకు వెళ్ళి ఉంటాడని మాణిక్యం ఊహించింది. తన కడుపులో ఉన్నదంతా చెప్పుకోవటంవల్ల మనసు కొంత తేలికపడినప్పటికీ రానున్న ఆపద ఆమెను నిప్పులసెగలోకి నెట్టుతున్నట్టుగా బాధపడుతున్నది. ఆమె మనసు స్థిరత్వాన్ని కోలుపోయినట్టుగా ఉంది ఆలోచనలు ఒకచోట నిలిచి ఒక నిశ్చయానికి రాలేకపోతున్నాయి.

పైనున్న ప్రయాణీకుడు బెర్తు క్రిందికి దిగి ప్లాట్‌ఫారమ్‌మీద అటూ ఇటూ పచారుచేయటం మొదలుపెట్టాడు.

కొంచెంసేపు తలగోక్కుంటూ కళ్ళుమూసుకుని ఆవలించిన మాణిక్యం ఏం తోచిందో తన సంచిలో దుప్పటి మడతచేసి పెట్టుకుని చెప్పులు వేసుకుని తల మీదుగా ముసుగు లాక్కుని రైలుబండి దిగిపోయింది.

* * *

"అమ్మా ! రేఖమ్మ చెప్పు తెగిపోయిందట. స్కూలుకు ఎట్లా వెళ్ళాలనుకుంటోంది." యాదమ్మ మంజరీదేవి ముందర పాందాన్ పెడుతూ సన్నగా అంటున్నది.

మంజరీదేవి ఉదయం ఎనిమిదిగంటలకు కాఫీతోపాటు టిఫిన్ తీసుకోగానే

వచ్చి హాల్లో కూర్చుంటుంది. ఇంట్లో ఉన్న దాసీజనంలో ముఖ్యురాలు యాదమ్మ ఆమెకు పొందాను పండు తమలపాకులు తీసుకువచ్చి, ముందుపెట్టి, సన్నటికాడతో సున్నం కాచు తమలపాకులకు రాసి, పచ్చివోకచెక్కలను సన్నగా అడక త్తెరతో కత్తిరించి, ఎండుకొబ్బరి తురుమువేసి చిన్నపళ్లెంలో పెట్టి ఆమె ముందుంచుతుంది. ఆమె మడిచి బీడాగా చేసుకుని లవంగం గుచ్చి నోట బెట్టుకుంటుంది. యాదమ్మ అందించిన ఏలక్కాయ ఒకటి వొలిచి చిటికెడు జరదాతోపాటు నోట వేసుకుంటుంది. తమలపాకు బీడాను జరదాతోపాటు నమిలితేగాని ఆమె దేనికీ సమాధాన మివ్వదు. ఎవరొచ్చినా పలకరించదు.

"ఆఁ ! ఏమిటి యాదమ్మా ! రేఖ స్కూలుకు పోదా ఇవాళ ?" అన్నది జరదా ఘాటుకు ముఖము ఎర్రబడి ముక్కుపుటా లదురుతున్నాయి.

"తెగిన చెప్పు ముందరపెట్టుకుని కూర్చున్నదమ్మా." యాదమ్మ దూరంగా నిలబడి తలమీదుగా కొంగు సవరించుకుంటూ అన్నది.

"కూటికి లేకపోయినా అన్ని హంగులూ కావాలన్నమాట ! అందరూ చెప్పులు వేసుకునే స్కూలుకు వెళ్లుతున్నారా ? వెళ్ళకపోతే ఊరుక్కోమను. పాపం — లేనివాళ్ళు కదా అని అక్క పంపితే సరే అన్నాను. కాని ఈ పిల్లకు ఇంత టెక్కా !" సోఫాకు ఆనుకుని కూర్చున్నది.

రేఖకు పద్నాలుగేళ్లు నడుస్తున్నాయి. తెలిసీ తెలియని వయసు. అమ్మ తనను ఎందుకు ఈమె దగ్గరికి పంపించిందో కొద్దిగా అర్థమయిం దానాడు.

"రేఖా ! చూడు తల్లీ ! మన సంసారం ఈ విధంగా నాశనమయి పోయింది. మనం నలుగురం ఒకచోట ఉంటే గడిచే విధానం లేదు. అందుకే అన్నలను ఆదిలక్ష్మిదేవిగారి దగ్గరికి బొంబాయి పంపిస్తున్నాను. నీవు మెట్రిక్ పాసవగానే కామేశ్వరీదేవిగారి సహాయంతో పెళ్ళి చేసేస్తాను. నా తల్లివి కదూ! కష్టకాలంలో కళ్ళు మూసుకుని రోజులు గడపాలమ్మా! " తల నిమురుతూ బ్రతిమిలాడింది మాణిక్యం.

"నాకు పెళ్లొద్దు. ఉద్యోగం చేసుకుంటాను. మనిద్దరం ఉందాము." మారాం చేసింది.

"పోనీ ఉద్యోగం చేద్దువుగానిలే. ముందుగా మెట్రిక్ ప్యాసుగా. చూడు తల్లీ మంజరీదేవిగారు చెప్పినట్టు విను.ఆమె ఏదయినా ఇస్తే తీసుకో.నా కిది కావాలని అడగకు. నీకు చదువు ముఖ్యం. బాగా చదువుకో, ఈ రాణుల ఇళ్ళల్లో దాసీ జనం పెత్తనం చలాయించాలని చూస్తారు. జరిగేది ఒకటి — వాళ్ల అమ్మగారికి

చెప్పేదొకటి. వాళ్ళ మంతనాలకు లోబడకు. వాళ్ళకు నీ విషయంలో ఎటువంటి అవకాశాన్ని ఇవ్వబోకమ్మా. మంజరీదేవిగారు పైకి ఏదన్నా దురుసుగా అన్నా ఆమె హృదయం మంచిది. వెంటనే సర్దుకుంటుంది. అక్కకు నిన్ను బాగా చూసుకుంటానని మాట యిచ్చింది. ఆ మాట తప్పదు. నీవు ధైర్యంగా ఉండు. ఆమెకు చెప్పి నాకు ఉత్తరాలు వ్రాస్తూఉండు. మాటిమాటికీ నన్ను చూడాలని ప్రయాణంకాకు. ఆమె పంపితే రా. లేకపోతే నేను కామేశ్వరీదేవిగారి నడిగి చూసిపోతూ ఉంటాను. సరేనా? నా తల్లి పరిస్థితులను అర్థముచేసుకుంటుంది." చుబుకం పట్టుకుని ముఖం పైకెత్తి ముద్దుపెట్టుకున్నది ఫాలభాగమ్మీద.

రేఖకు కొంత అర్థమయింది. నాన్న లేడు. అమ్మ బాధపడుతోంది. ఆమె కన్నీళ్ళు కారిస్తే తనకూ ఏడుపొస్తుంది. తన కన్నీళ్ళు అమ్మ చూడకుండా తలవంచుకుని రెండు పరికిణీలు - రెండు జాకెట్లు, రెండు ఓణీలు పెట్టుకున్న సంచితో బయలుదేరింది. మాణిక్యం స్వయంగా వెళ్ళి మంజరీదేవికి ఒప్ప గించింది కన్నీళ్ళతో.

"ఉంచి వెళ్ళండి. మా దేవిడీలో ఎందరులేరు? అందులో ఒకతి. మీరు ఉత్తరాలు అవీ వ్రాయకండి. వ్రాస్తే పిల్లకు తల్లిని చూడాలన్న ఆరాట మెక్కువవుతుంది. ఎప్పుడయినా పంపిస్తాలెండి" అన్నది మంజరీదేవి. మన సులో అంత ఇష్టములేనట్టుగా మాణిక్యం కనిపెట్టినా, చేసేది లేక కళ్ళనీళ్ళు కళ్ళల్లోనే ఇంకింపచేసుకుని, యాదమ్మ రెండుచేతులూ పట్టుకుని "నీ బిడ్డలా చూసుకో, అంతా నీదే భారము. ఇంకా పిల్ల పెద్దయినా కాలేదు. నా ఖర్మమిలా కాలింది" అంటూ వాపోయింది.

తల్లి వెళ్ళిన రెండురోజులవరకూ రేఖకు మాట్లాడితే కన్నీళ్ళు దూకేవి. యాదమ్మ నంటిపెట్టుకుని తిరిగింది. మూడోనాడు ఆ ఊరిలో ఉన్న స్కూల్లో యాదమ్మచేత మంజరీదేవి చేర్పించింది.

దేవిడీకి వెనుకగా నౌకర్లకు వరసగా గదులున్నాయి. దేవిడీలో పనులు కాగానే నౌకర్లంతా ఎవరిగదుల్లోకి వారు చేరుకుంటారు. దేవిడీనుంచి తెచ్చుకున్న భోజనాలు ఆ గదుల్లో చేస్తారు. యాదమ్మగదిలో రేఖఉండటానికి రేఖ తనకున్న బట్టలు స్నానం చేయగానే గదిముందర కట్టిన తాడుమీద ఉతికి ఎండవేసు కోవటం—అన్నంతిన్న పళ్ళెం గ్లాసు కడిగి బోర్లించుకోవటమూ—స్కూలునుంచి రాగానే యాదమ్మ తనకోసమని ఉంచినదేదో తిని చదువుకోవటమూ తప్ప ఎవరితోనూ మాటాపలుకూ ఎరగకుండా మౌనంగా ఉంటోంది. స్కూల్లో కూడా ఇంకా స్నేహితులేర్పడలేదు.

స్కూల్లో దమయంతీ కామాక్షీ తన క్లాసుపిల్లలే అయినా కొన్ని రోజులు రేఖను ఏగాదిగా చూడటం మొదలుపెట్టారు. పదిరోజులతరువాత "ఏ ఊరి నుంచి వచ్చావు?" అని అడిగారు.

ముక్తసరిగా జవాబిచ్చింది రేఖ.

"ఈ ఊర్లో చదువుకోవటానికి హైదరాబాదునుంచి వచ్చావా? ఇది చాలా గొప్పస్కూలని ఎవరయినా చెప్పారా?" పగలబడి నవ్వారు

ఏడుస్తూ క్లాసులోకి వెళ్ళి కూర్చుంది రేఖ.

ఒకనెల తనలో తానే పాఠాలు చదువుకుంటూ—ఒకరి జోలి లేకుండా గడిపేసింది రేఖ. తల్లిమీద అన్నలమీద బెంగ క్రుంగదీస్తోంది ఒకప్రక్క స్కూల్లో ఒక్కరయినా తనతోటివాళ్ళు స్నేహంగా ఉంటే బాగుండునని మనసు ఆరాట పడుతోంది. కాని తనంతటతాను ఎవరినీ కలుపుకొని మాట్లాడదలుచుకోలేదు

ఒకనాడు కామాక్షి రేఖ భుజమ్మీద చేత్తో తడుముతూ "రేఖా! నీ దస్తూరి చాలా బాగుంటుందోయ్. నీ ఇంగ్లీషుకూడా చాలా హైస్టాయితోఉందని టీచరు అన్నది." రేఖ ముఖంలోకి చూసింది.

కామాక్షి పలకరించినందుకు కాదుగాని ఆమె మాటలలో తన కాన్వెంటు స్కూలు చదువు జ్ఞాపకం వచ్చింది రేఖకు. తనను మదర్ ఎప్పుడూ మెచ్చుకునేది. క్లాసులో తను ప్రోక్టర్. తను ఎన్నో వార్షిక బహుమతులు తెచ్చుకునేది మదర్‌కూ టీచర్లకూ వాళ్ళు చెప్పిన పనులుచేస్తూ వాళ్ళకెంతోసహాయం చేసేది. కన్నీళ్ళు తుడుచుకుంటూ ముందుకు సాగిపోయింది రేఖ.

దమయంతికికూడా అనుకోకుండా రేఖ సహాయం కావలసి వచ్చింది. లెక్కలు క్లాసులో చెప్పినవి అర్థంకాలేదు. కామాక్షికికూడా వాటినిచేయటం తెలియలేదు. ఇద్దరూ కూడబలుక్కుని రేఖను బ్రతిమిలాడారు. ఆ మధ్యాహ్నం ఇంటరవల్‌లో ఆమెకు తమ యిళ్ళదగ్గరనుంచి తెచ్చుకున్న టిఫిన్లు పెట్టారు.

రేఖ ఫక్కున నవ్వింది.

"ఎందుకు నవ్వుతావు?" ఇద్దరూ తెల్లబోయారు.

మీరిద్దరూ నాకంటె బాగా మార్కులు తెచ్చుకునేవారు కదూ? ఈ లెక్కలు నేను చెబితే తప్పిపోతారని నా భయం. మీరంతగా కావాలంటే చెబుతాను. అందుకేనా మీరిద్దరూ నాకు టిఫిన్ పెట్టింది?" పెదవులు ముడిచింది రేఖ.

ఇద్దరూ కాదు కాదన్నారు. తమకు తెలియనివి రేఖదగ్గర నేర్చుకుంటామన్నారు టీచరే చెప్పిందట. "రేఖ నడగండి. ఏదయినా తెలియకపోతే" అంటూ.

రేఖ మనసు మెత్తబడింది. "నన్నింత బ్రతిమిలాడటం ఎందుకు? సరిగ్గా అడిగితే చెప్పేదాన్నేగా!" అన్నది.

"రేఖా! అది కాదోయ్! నిన్ను చూడగానే మాకెట్లాగో అనిపించింది. నీ మెడ బోసిది. నీ చెవులకేమీలేవు. చేతులకు రెండు మట్టిగాజులు. నీవు కట్టుకునే బట్టలా వెలిసిపోయినవి. నీ తలవెంట్రుకలకు సరిగా నూనె అయినా లేదు. నీ ముఖానికి పౌడరు స్నోలలాంటి పూతలు లేవు. కాని—నీవు క్లాసులోకల్లా ఒక జ్యోతిలా వెలిగిపోతున్నావు. మన టీచరు కంటె అనర్గళంగా ఇంగ్లీషు హిందీ మాట్లాడేస్తున్నావు. అందుకని—ఉన్నమాట చెప్పొద్దూ? మాకెట్లాగో అనిపించింది. మేమిద్దరం మా నైలాను డ్రెస్సులూ, మా అలంకారాలు—మా ఠీవి నీదగ్గర లేక పోతే ఎవరో పిల్ల—ఏ పనిమనిషి కూతురో అనుకున్నాము. అవన్నీ మర్చిపో రేఖా! ఇవాళ్టి నుంచీ నీవు మా అక్కవు. మా స్నేహితురాలివి. ఒప్పుకోవూ?" దమయంతి రేఖ రెండుచేతులూ పట్టుకుంది.

వాళ్ళ చేష్టలకు మొదట బాధపడినా స్నేహానికి తల ఒగ్గింది రేఖ. నవ్వు ముఖాలతో భుజాలమీద చేతులు వేసుకుని క్లాసురూములోకి నడిచారు. టీచరు రాకముందు తెలియని లెక్కలు చూసుకున్నారు. ముగ్గురూ ఒక వరసలో కూర్చున్నారు.

ఆనాడు రేఖ ముఖం విప్పారింది. అప్పటినుంచీ తల్లినీ, అన్నలను అంతగా తలుచుకుని ఏడవటం మానేసింది. బెంగ కొంతవరకూ తీరినట్లనిపించింది.

"చెప్పు తెగిపోయిందా రేఖా! ఈడుస్తున్నావు?". దమయంతి అడిగింది.

ఔనని తలూపింది రేఖ...

దమయంతికి చెప్పుతెగితే ఏంచెయ్యాలో తెలియదు. తండ్రి ఎప్పుడు హైదరాబాదు వెళ్ళినా ఐదారు జతలు తెచ్చి యిస్తాడు. కామాక్షికీ అంతే. వాళ్ళ చీరెలు జాకెట్లు, చెప్పులు అన్నీ హైదరాబాదునుంచే వస్తాయి. వాళ్ళా ఊరిలో ఏమీ కొనుక్కోరు. అసలు మంచి షాపులుకూడా ఉండవు.

"నాదగ్గర ఒక కొత్త చెప్పులజత ఉంది. రేపు తెచ్చి ఇస్తాను" అన్నది దమయంతి.

"నా దగ్గరా ఉంది, మా నాన్న ఈసారి మా అక్కకని తెచ్చినజత ఆమెకు నచ్చకపోతే నాకే ఇచ్చాడు. ఒక జత తీసుకో రేఖా!" అన్నది కామాక్షి.

రేఖ అదొకమాదిరిగా నవ్వింది. "మీకు ఉన్నాయనీ ఉంటాయనీ నాకు తెలుసు. నాకు లేవనీ తెలుసు అంతమాత్రంచేత మీదగ్గర తీసుకుంటానను

కున్నారా? తీసుకోను. చెప్పు లేకపోతే చదువుకు భంగమా చెప్పండి? అది లేక పోతే గబగబా నడుస్తాను" అంది అదొకమాదిరిగా వాళ్ళవంక చూస్తూ,

"కాళ్ళు కాలవూ? కాళ్ళకు మట్టి అంటదూ?" కామాక్షి వింతగా చూసింది.

"రేఖా! నీవు హైదరాబాదునుంచి వచ్చానంటున్నావు. అక్కడి రోడ్లలా ఉండవు ఇక్కడ. అంతా బురద" దమయంతి ఆ ఊరి రోడ్లను ముక్కువిరుస్తూ వర్ణించింది.

"బురద ఉంటే ఉంటుంది. క్లాసులోకి వెళ్లేటప్పుడు కాళ్ళు కడుక్కుని వెళ తాను." తేలిగ్గా అనేసింది రేఖ.

రేఖను బలవంతంచేసి ఏ పనీ చేయించలేమని వాళ్ళిద్దరూ తెలుసుకున్నారు. అప్పటినుంచీ ఆమెపట్ల స్నేహమే కాకుండా గౌరవం కూడా పెరిగింది వాళ్ళిద్దరికి.

ఇంటికి రాగానే యాదమ్మ ఇచ్చిన రొట్టె తిని గ్లాసెడు నీళ్ల తాగి పుస్తకాలు ముందరేసుకుని కూర్చున్నది రేఖ.

"నీ చెప్పు తెగిందని దొరసానితో చెప్పినాను రేఖమ్మా. ఆమె విని ఊరు కున్నది. స్కూలుకు ఒట్టి కాళ్ళతోనే వెళ్ళావా ?" యాదమ్మ తలవెంట్రుకలు దువ్వుకుని ముడివేసుకుంటూ అడిగింది.

"ఎందుకు చెప్పావు యాదమ్మా ! ఒట్టి కాళ్ళతో స్కూలుకు వెళ్ళితే తప్పా ?" పుస్తకంలో పేజీలు తిరగవేస్తూ.

రేఖ మాటల్లో ఇప్పుడు స్పష్టంగా కనబడుతున్న ధైర్యాన్ని గమనించి యాదమ్మ తెల్లబోయింది. మొదట్లో రేఖకు ఒక్కతే పడుకోటానికి భయంగా ఉండేది. ప్రొద్దుగూకితే గజగజలాడుతూ ఒక మూలకు ఒదిగిఒదిగి కూర్చునేది. యాదమ్మ భోజనంచేసి తమలపాకు వేసుకుని బయటికి బయలు దేరేది. నౌకర్లందరూ ఒక చెట్టుక్రింద ఉన్న బండమీదికి చేరేవారు. అక్కడ కబుర్లూ – హాస్యాలు – నవ్వులూ – సరదాలూ – శృంగారాలూ నడుస్తూ ఉండేది. యాదమ్మ గదిలోకి వచ్చేటప్పటికి పదకొండయినా అయేది. అంత వరకూ ప్రాణాలు బిగబట్టుకుని కూర్చున్న రేఖ ఆమెను చూడగానే పక్క పరచుకుని పడుకునేది. యాదమ్మ పడుకోగానే ఆమె చెయ్యి గట్టిగా పట్టుకుని నిద్రపోయేది. అప్పుడప్పుడు అమ్మా అంటూ కేకబెట్టి లేచి కూర్చునేది. గురక పెడుతూ నిద్రపోయే యాదమ్మ ఎప్పుడోగాని లేచేది కాదు. లేచిననాడు "పడుకో బిడ్డా ! కల వచ్చిందా ? అమ్మ కలలో కనబడ్డదా ?" అంటూ వీపు మీద చెయ్యివేసేది.

ఆ చెయ్యి ఆసరాతో కొండంత ధైర్యము తెచ్చుకుని నిద్రలోకి జారుకునేది రేఖ.

## 2

సంస్థానాన్ని ప్రభుత్వం తీసుకున్నప్పటికీ మంజరీదేవి భర్తకు డబ్బు చాలా కలిసి వచ్చింది. గుర్రపు పందేలలో అత డెప్పుడూ డబ్బు పోగొట్టుకోలేదు. కాగా దానిలో లాభాలు బాగా వస్తూ ఉండేవి. అతడి పెత్తల్లి లక్షలకు అధికారిణి. పెనిమిటి నడివయసులో చనిపోతూ అంతా భార్య చేతిలో పెట్టాడు. ఆమె దత్తతచేసుకోవా లనుకున్నది కాని పోటీలుపడుతూ వచ్చిన దాయాదుల మీద ఆమెకు మంచి అభిప్రాయం కలగలేదు. తన చెల్లెలి కొడుకు గోపాల కృష్ణరాయడిమీద మనసు ఉంది. కాని చెల్లెలికి ఒక్కడే కొడుకు. మరిది కృష్ణమరాజుకు ఆ ఊరిలో చాలా సంతాన మున్నది కాని భార్యకుమాత్రము ఒక్కడే కొడుకు. గోపాలకృష్ణరాయడి తండ్రి ఎప్పుడూ బయటనే తిరుగుతూ ఉండేవాడు. ఎప్పుడూ ఆయన చుట్టూ వందిమాగధులవంటి స్నేహితులు, పాట కరిచేలు, నాట్యాలు-వారితోనే కాలక్షేపంగా ఉండేది. ఆయన ఈ దుర్వ్యసనాలతో రోగపీడితుడై మంచానబడి రెండు సంవత్సరాలు తీసుకుని మరణించాడు. గోపాలకృష్ణరాయడి పెదతల్లి నరసాయమ్మ తన యావదాస్తిని తన చెల్లెలి కుమారుడికి ఇచ్చి అతడి చేతులమీదుగా దాటిపోయింది.

ధనం చూడగానే ఎవరికయినా వెర్రెత్తుతుంది. గోపాలకృష్ణరాయడి భవంతికి అక్కడ దేవిడీ అని పేరు. విశాలమయిన వరండాలు - పెద్దపెద్ద హాల్లు - నిలువుటద్దాలతో పడకగదులూ - పెద్ద భోజనశాల - ఆధునిక సౌకర్యాలు - డబ్బుతో కొని తీసుకురాగలిగినవన్నీ అమరిఉన్నాయి. క్రింది భాగమెంత ఉన్నదో మేడపైన అంత ఉన్నది. కాగా మేడపైన డాన్సింగ్ హాలు అద్దాల గోడలతో విశాలమైనది ఒకటి ఉన్నది. దానిలో విద్యుద్దీపాల అమరిక చాలా చిత్రంగా ఉంటుంది. అవి గోడల కమర్చిన అద్దాలతో ప్రతిబింబించి వింత వెలుగులను ప్రసరింపచేస్తూ ఉంటాయి. డ్యాన్సుల తరువాత విందు పార్టీకి తగిన పెద్ద హాలొకటి ఉంది. ఏభయిమంది సునాయాసంగా బల్లముందర కూర్చుని విందారగించే బల్లలూ, కుర్చీలు ఉన్నాయి. ఆ ప్రదేశాలన్నీ అపురూపమయిన ఖరీదుగల తైలవర్ణ చిత్రాలతో గోడలకు అలంకరింపబడి ఉన్నాయి.

గోపాలకృష్ణరాయడు సాయంత్రం కాగానే మేడమీద మిత్రులతో

సమావేశమవుతాడు. అక్కడ పాటకచేరీ, వేశ్యల నృత్యాలు - మధుపానీయాలు - విస్కీతో విందులు — గలగలలాడుతూ ఉంటుంది మేడ పైభాగము.

మంజరీదేవి ఒకతే ఉంటుంది క్రిందిభాగంలో. సాయంకాలము కాగానే గంజిపెట్టిన వెంకటగిరి జరీఅంచుల చీరెకట్టుకుని—తలనిండా పూలుపెట్టుకుని - తమలపాకు బీడా ఘుమాయింపుతో హాల్లో ఉన్న సోఫాలో కూర్చుని పైన జరుగుతున్న సందడినంతా వినటమే కాని కంటితో చూడలేదు. ఆమె ఉత్సాహమంతా నీరుగారిపోతుంది. ఉస్సురంటూ ఇటూ అటూ తిరుగుతుంది. వేడి నిట్టూర్పులు విడుస్తుంది.

గోపాలకృష్ణరాయడి స్నేహితులలో భుజంగం అందరితో నవ్వుతూ, తుళ్లుతూ, కబుర్లు చెబుతూ ఉంటాడు. అతడు అందగాడే కాని మెల్లకన్ను కనబడకుండా రంగు కళ్ళద్దాలు ధరించి పైన ఉన్నట్టే ఉండి, కిందికి దిగి వచ్చి "మంచి తమలపాకు బీడా అమ్మగారి నడిగి తీసుకురా," అని నౌకర్ని పిలుస్తూ ఉంటాడు. మంజరీదేవి దగ్గర ఆంతరంగికంగా మసలుకునే దాసిపేరు ముత్తి. అది వృద్ధురాలయినా - ముఖము ముడతలు పడినా రసికురాలు. ఎవరి నెలా పలకరించాలో - ఎవరి నెలా మర్యాదలు చేయాలో - ఎవరిలో ఎటువంటి బలహీనతలు ఉన్నాయో క్షణాలమీద గ్రహించగల చతుర. మాటలో గడసరి. ముత్తి భుజంగం ముఖం చూడగానే సంగతి పసికట్టింది. అతడు వచ్చిన వెంటనే పైకి వెళ్ళాడు. వెళ్ళిన తరువాత నాలుగుసార్లయినా క్రిందికి వస్తాడు. ముత్తితో కబుర్లకు దిగుతాడు. చూపులతో ఇల్లంతా కలయ తిరుగుతాడు.

భుజంగం దేవిడీలోకి రావటం మొదలుపెట్టిన నాలుగయిదు నెలలకు మంజరీదేవి దర్శనము లభించింది. తమలపాకుల బీడాతో ఆరంభమయిన పరిచయము పరాచికాలకు వారం తిరక్కముందే దిగింది. మంజరీదేవికి ఇప్పుడు మేడపైన జరుగుతున్న కార్యకలాపాలను వినటానికి తీరికలేకుండా పోయింది. ఆమె మనసులో పేరుకుపోయిన చీకటి పటాపంచలయింది. వెలుగురేఖలు పొడచూపాయి. ఎండిపోయిన ఆశలు మోసులెత్తుతున్నాయి ఆమె ఎదలో చికాకులూ, చింతలూ లేవు. ఉల్లాసం—ఉత్సాహం-ఉబికి ఉబికి వస్తున్నాయి.

ఆ నాడు మేడమీద పార్టీ జోరుగా జరుగుతున్నది. ప్రఖ్యాత నర్తకిని బొంబాయినుంచి పిలిపించారు. మిత్రులంతా పైన చేరారు మధ్య మధ్య పానీయాలు అందిస్తున్నారు సేవకులు. పళ్లేలతో మల్లెలు పైకి తీసుకువెళ్ళి వెదజల్లు

తున్నారు నౌకర్లు. విందులు తయారవుతున్నాయి. కోళ్ళూ, మేకలూ తెగుతున్నాయి. దేవిడిలో క్రిందా పైనా ఊపిరి సలపకుండా నౌకర్లు సందడిగా తిరుగుతున్నారు.

హఠాత్తుగా ముత్తి పెట్టినకేక క్రిందికీ, పైకీ తిరుగుతున్న సేవక బృందాన్ని నిలవబెట్టింది. అందరూ ఏమిటేమిటని ప్రశ్నించారు.

"నర్సిమ్మని పిలవండి." ఆదుర్దాగా ఆజ్ఞాపించింది ముత్తి. ముత్తి మంజరీదేవి అంతరంగిక సేవకురాలేకాదు, నౌకర్లమీద పెత్తనంకూడా ఆమెదే. అందరూ హడలిపోతూ ఉంటారు ఆమెను చూడగానే.

పైనుంచి నర్సిమ్మ ఆదరాబాదరా మెట్లు దిగి వచ్చి ముత్తి ముందర నిలబడ్డాడు చేతులు కట్టుకుని.

"దొరతో చెప్పు, దొరసాని తెలివితప్పి పడిపోయిందని." చెప్పి లోపలికి వెళ్ళిపోయింది ముత్తి.

మంచి పట్టులో ఉన్నది డ్యాన్సు. నర్తకి దోసెళ్ళతో మల్లెలు అందరిమీదికి విసురుతూ కవ్విస్తూ పాట పాడుతున్నది. ఆమె నాట్యం ప్రేక్షకుల హృదయాలమీద చేసినట్టుగా ఉంది. వహ్వావహ్వా అంటున్నారు ప్రేక్షకులు ఉద్రేకంతో. కొందరు లేచి ఆమె చెయ్యి పట్టుకోబోతున్నారు. నౌకర్లు అందరికీ పానీయాలు అందిస్తున్నారు.

నర్సిమ్మ చెప్పగానే గోపాలకృష్ణరాయడు క్రిందికి దిగి వచ్చాడు. మెల్లగా గదిలో అడుగుపెట్టాడు. పందిరి పట్టెమంచంపైన అస్తవ్యస్తంగా పడుకుని ఉంది మంజరీదేవి. ఆమె తలలోని మల్లెలతోపాటు ముఖం కూడా వాడిపోయి ఉన్నది. ముఖమంతా చెమటబిందువులతో నీరు చిలకరించినట్టుగా ఉన్నది.

వెంటనే డాక్టర్ని పిలుచుకు రమ్మని మనిషిని పంపి, కుర్చీ మంచానికి దగ్గరగా లాక్కొని కూర్చున్నాడు గోపాలకృష్ణరాయడు. ఆమెను చూడగానే అతడికి జాలి కలిగింది. తనకు తరగని కాలక్షేపము ఉంది. లేకపోతే సృష్టించుకుంటాడు గాని ఆమెకు కాలక్షేపము లేదు. సంతానము కలిగితే ఆమె కెంతో నిండుగా ఉండేది అది లేదు. సంతానంకోసం తనను యాత్రలకు రమ్మని పీడించేది. వ్రతాలు చేయమనేది. తనను బ్రతిమిలాడేది. అడిగేది. కోపగించేది. పాపం! ప్రాణం విసిగిపోయినట్టుంది. ఇప్పుడు తన నేమీ అడగదు. చాలా ముభావంగా ఉంటుంది. బహుశః మనోవ్యాధి కలిగిందేమో సంతానం కోసం! అంతగా అయితే పెంచుకొమ్మని సలహాలు కూడా ఇచ్చాడు. ఇప్పిం

చాడు. ఆమె కది నచ్చలేదు. తన కడుపున పుట్టాలంటుంది. స్త్రీలకు మాతృత్వం అంటే ఎంత కాంక్ష ! అతడి మనసంతా జాలతో నిండిపోయింది. ఆమె తల నిమురుతూ కూర్చున్నాడు.

డాక్టరు వచ్చాడు. ఆమెను పరీక్షచేశాడు. మనిషి బలహీనంగా ఉంది గాని మరేమీ కనబడటంలేదు. వెంటనే తన హాస్పిటల్లో ఉన్న నర్సుని పిలిపించి పరీక్ష చేయించాడు. మంజరీదేవికి వేడి వేడి హార్లిక్సు తెప్పించి ముత్తిని త్రాగించమన్నాడు. ఆమె తాగిన వెంటనే మత్తుగా పడకమీద వాలిపోయింది.

గోపాలకృష్ణరాయడికి అదేమిటో అర్థము కాలేదు. డాక్టరుతో బయట హాలులో ఉన్న సోఫాలో కూర్చుని సిగరెట్టొకటి వెలిగించి, "ఏమిటి జబ్బు ? ఏమయినా ఫిట్సు బాపతా ? ఎంత డబ్బయినా ఖర్చుచేయండి. ఇంజక్షన్లు, మందులూ వాడండి. ఆమె ఎప్పటి మాదిరిగా ఇంట్లో లక్ష్మిలా తిరిగేటట్టు చూడండి," అన్నాడు ఆవేదనతో.

డాక్టరు కళ్ళలో మెరుపు తళుక్కుమన్నది. ముసిముసి నవ్వులతో "దొర గారూ ! మీరు అదృష్టవంతులు. ఈ దేవిడీలో ఒక పాప కొద్దికాలంలో నడయాడబోతున్నది. మీరు తండ్రి కాబోతున్నారు. ఈ దేవిడీకి ఒక కొత్త వెలుగు" అన్నాడు.

"ఆఁ ? ?" నోరు తెరిచాడు గోపాలకృష్ణరాయడు. అది ఆశ్చర్యమో, సంబరమో తెలియని సేవకులు డాక్టరికి మధురపదార్థాలతో నిండిన పళ్ళెము తెచ్చి ముందుపెట్టారు. గోపాలకృష్ణరాయడు ఆశ్చర్యముతోనుండి తేరుకొనే లోపల డాక్టరు సెలవు తీసుకున్నాడు.

గోపాలకృష్ణరాయడు అలాగే కూర్చున్నాడు. పైనుంచి ఎన్నో కబుర్లు వచ్చాయి రమ్మని. నర్తకి నాట్యమయిందని కబురుపెట్టింది. అతడు కదలలేదు. విందులకు వేళయింది. ఆయన అలాగే కూర్చున్నాడు. చూసి చూసి అందరూ మెల్లగా జారుకున్నారు. వంటకాలు చల్లారిపోయాయి. సేవకులు ఎక్కడి వాళ్ళక్కడ నిద్ర కొరిగారు.

గోపాలకృష్ణరాయడు చలనంలేకుండా అలాగే కూర్చున్నాడు. తనకు సంతానం కలగబోతున్నదంటే అతడికి ఆశ్చర్యంగా ఉంది. అయోమయంగా ఉంది. అర్థంకాకుండా ఉంది.

ఇది ఎలా సాధ్యం ??

తానెంతమంది డాక్టర్లను చూశాడు ?



మంజరీదేవి యాత్రలకు రమ్మంటే ఏం లాభమని ఆమెను నిరుత్సాహ పరచలేదూ ?

నీవు తండ్రివి కాబోతున్నావని చెప్పిన డాక్టరే తనను పరీక్షించి నీకు సంతు కలగదని చెప్పలేదూ ?

ఇది నిస్సందేహంగా ఒక నాటకం.

ఈ నాటకంతో తనకు సంబంధం లేదు.

ఎవరి సంతానమో తన యింట్లో నడయాడుతూ తనను నాన్నా అని పిలుస్తుంటే తను సహించలేడు !

చివాలున లేచాడు. చిన్న సూటుకేసులో బట్టలు పెట్టుకున్నాడు. తన దగ్గర ఉన్న డబ్బును పర్సులో పెట్టుకున్నాడు. మంజరీదేవివైపు తిరస్కారంగా ఒక చూపు విసిరాడు. దేవిడీదాటి బయటికి అడుగుపెట్టాడు. అంతే. మళ్ళీ కాలు పెట్టనని శపథంకూడా చేసుకున్నాడు మనసులో.

# 4

ఉదయమే లేచిన రేఖ కడుపునొప్పితో చుట్టలు చుట్టుకుపోతున్నది. పక్కమీదినుంచి లేవలేదు. మూలుగుతున్నది. ఆ గదంతా దొర్లుతున్నది. కళ్ళనీళ్ళు కారిపోతున్నాయి. తలవెంట్రుకలు రేగి కన్నీళ్ళతో చెంపలకు అంటుకుపోయాయి.

రేఖకోసం చపాతి, కూర తీసుకువచ్చిన యాదమ్మ ఆమెను చూసి గాభరా పడ్డది. రేఖ వచ్చినప్పటినుంచీ – మొదట మొదట అంటీ ముట్టనట్లుగా ఉన్నా క్రమంగా ఆమెపట్ల వాత్సల్యము అంకురించి పెరగటం మొదలుపెట్టింది. మెల్లగా రేఖను లేవదీసి కూర్చోబెట్టి వేడి వేడి టీ తాగించింది. రేఖ కడుపు పట్టుకుని విలవిల్లాడిపోతున్నది. అప్పుడు గ్రహించింది యాదమ్మ – రేఖ రజస్వల అయిందనీ – ఈ కడుపు నొప్పి ఆ బాపతనీ. వెంటనే బజారుకు వెళ్ళి నువ్వులూ, కొబ్బరి, బెల్లం తీసుకువచ్చి దంచి ముద్దలుచేసి తినిపించింది. కదలకుండా పడుకోమని చెప్పి పులగం వండిపెట్టింది.

"రేఖమ్మా ! ఈ మూడురోజులూ స్కూలు మానెయ్యి తల్లీ. దీనితో కడుపునొప్పి తగ్గిపోతుంది. తగ్గకపోతే నేను ఆచార్యుల నడిగి మందు తీసుకు వస్తా."

"యాదమ్మా, ఇవాళ నాకు పరీక్ష ఉన్నది. రాత్రంతా కూచుని బాగా చదివాను. దానిలో నాకే మార్కులు బాగా వస్తాయని నమ్మకం ఉంది. ఎట్లా ఈ కడుపులో నొప్పి ?" ముఖమంతా బాధతో ముడుచుకుపోయింది.

"రేఖమ్మా, నొప్పి తగ్గినా నువ్వు నాలుగురోజులపాటు పడుకునే ఉండు."

అర్థం సరిగ్గా కాకపోయినా యాదమ్మ మాటలకు కట్టుబడి ఇంట్లోనే ఉన్నా రేఖ తన పరీక్షను తలుచుకుని తలుచుకుని బాధపడుతూనే ఉన్నది.

నాలుగవరోజున యాదమ్మ రేఖకు స్నానం చేయించింది. మరునాడు స్కూలుకు వెళ్ళమని చెప్పింది. రేఖ స్కూల్లో అడుగుపెట్టగానే దమయంతీ, కామాక్షీ ఎదురుగా వచ్చి కౌగిలించుకున్నంత పనిచేశారు.

"ఇన్నాళ్ళనుంచీ చదివి చదివి పరీక్షకు రాకుండా ఇంట్లో ఉన్నావేం ? చదవకపోయినా మేము పరీక్షకు హాజరయి చేతికి వచ్చింది రాశాము." ఆమెను నఖశిఖ పర్యంతమూ చూస్తూ జడ సవరిస్తూ గుచ్చి గుచ్చి అడగటం మొదలు పెట్టారు.

రేఖకు ఇరుకున పడ్డట్లయింది. ఏం చెప్పాలో తెలియలేదు. "నాకు కడుపు

నొప్పి విపరీతంగా వచ్చింది. లేవలేకపోయాను. ఏం చెయ్యను ?" మళ్ళీ విచారం రేఖ ముఖమంతా అలుముకుపోయింది.

క్లాసులోకి వెళ్ళగానే టీచరు రేఖను పిలిచి ఎందుకు రాలేదని ప్రశ్నించింది.

రేఖ తన కడుపు నొప్పి సంగతి చెప్పి తల వంచుకుంది.

"ఈ పరీక్ష క్లాసు పరీక్షే. నీ వెందు కంతగా బాధపడుతున్నావు రేఖా ! నే నూరికే ఎందుకు రాలేదన్నాను. పెద్ద పరీక్షలకు బాగా చదువు. నీవు ఈ స్కూలుకు ఫస్టు వస్తావన్న ఆశ నాకు బాగా ఉంది. ఈ సంస్థానాధీశ్వరులయిన శ్రీ రాజా గోపాలకృష్ణరాయలవారు ఈ స్కూల్లో ఫస్టు వచ్చినవాళ్ళకు పైచదువులు చదువుకోవటానికి స్కాలర్‌షిప్పు ఏర్పాటుచేశారు. అది నీకే వస్తుందన్న నమ్మకం నాకు బాగా ఉంది. నా ఆశలు నిరాశలు చేయవను కుంటాను." ఆమె ఇంగ్లీషు పాఠము చెప్పటమేకాదు హెడ్ మిస్ట్రెస్ కూడాను.

ఆ పాఠశాలను ప్రభుత్వము తన అధికారముక్రింద పాలన చేస్తున్నప్పటికీ శ్రీ రాజావారు ఏర్పరచిన కొన్ని నియమాలు పాటిస్తున్నది. ఆయన తన సంస్థానంలో ఒక ఉన్నత పాఠశాల ఉండాలని రెండెకరాల భూమిలో విశాల మయిన భవన మొకటి ఆధునిక సౌకర్యాలతో నిర్మించి తనకు ఆస్తి ఇచ్చిన పెద్దతల్లి నరసాయమ్మ పాఠశాల అని పేరుపెట్టాడు. ఆమె తైలవర్ణ చిత్ర మొకటి నిలువెత్తుది హాలులో తగిలించాడు. ఆమె పేరుమీద ఆ పాఠశాలలో ఫస్టున ప్యాసయినవాళ్ళకు ఉన్నత విద్యాభ్యాసానికిగాను నాలుగుసంవత్సరాల పాటు నెలకు 100 రూపాయల నరసాయమ్మా స్కాలర్‌షిప్పు లభిస్తుంది. ప్రభుత్వాధికారము క్రిందికి వచ్చినప్పటికీ రాజావారు పంపించిన పిల్లల నిద్దరిని ఆ పాఠశాలలో ఫీజులేకుండా చేర్చుకోవాలి. ఆ నియమాన్ననుసరించే మంజరీ దేవి రేఖను ఆ స్కూలులో చేర్పించింది.

ఆ ఊరు ఆరువందల గడపగలది. గోపాలకృష్ణరాయడు మూడు ఎకరాల స్థలాన్ని హాస్పిటల్ క్రింద వినియోగము చేశాడు. దానిలో నాలుగు పడకలు గల హాస్పిటల్ ఒకటి-కట్టించాడు. దాని పేరు కూడా నరసాయమ్మదే. ఆ భవ నాన్ని ప్రభుత్వానికి ఒప్పగించాడు. ఈ రెండిటినీ ప్రభుత్వానికి ఒప్పగించింది హైదరాబాదు రాష్ట్రింపైన పోలీసుచర్య జరిగిన తరువాతనే. హాస్పిటల్లో ఒక డాక్టరు, ఒక నర్సు, ఒక దాయి, ఒక కాంపౌండరు-ఇలా ఒక్కొక్కరిని ప్రభుత్వమే నియమించింది.

రేఖ అప్పుడప్పుడు తల్లికి జాబులు వ్రాస్తూ ఉండేది

ఒక ఉత్తరంలో "అమ్మా ! నన్ను ఒక్కసారి పంపమని మంజరీదేవిగారికి ఉత్తరం వ్రాయవూ ? నిన్నూ, అన్నలనూ చూడాలని ఉందమ్మా. రాత్రిళ్లు మరీ దిగులుగా ఉంటున్నది. యాదమ్మ ఇప్పుడు కాస్త నయం. నన్ను బాగా పలకరిస్తున్నది. నన్ను బాగా చూసుకుంటున్నది ఇంకా రెండు నెలల్లో మాకు పెద్ద పరీక్షలు వస్తాయి. అవి కూడా అయిపోతే నేను నీ దగ్గరికి ఎప్పటికీ వచ్చేస్తానమ్మా. నన్నింకా ఎన్నాళ్ళిక్కడ ఉంచుతావు ? నేనింక ఉండలేను.

నీ ఉత్తరంకోసం ఎదురు చూస్తుంటా.

రేఖ."

ఈ ఉత్తరం వ్రాసి స్కూలుకు వెళ్లేటప్పుడు ఆ సమీపంలో ఉన్న పోస్టు బాక్సులో పడేసింది పదిరోజులు ఎదురుచూసింది, తల్లి దగ్గరనుండి ఉత్తరం వస్తుందేమోనని. రాలేదు. నాలుగురోజులు గుబులు గుబులుగా తిరిగింది. రాత్రిళ్లు కంటిమీదికి కునుకురాక దొర్లిగింతలు పెట్టింది.

"ఏమిటి రేఖమ్మా ! నిద్రరావటంలేదా ! అమ్మమీదికి ధ్యాస మళ్ళిందా ?" యాదమ్మ పక్క పరచుకుంటూ అడిగింది.

ఆ పలకరింపుతో రేఖకు దుఃఖము ఉప్పెనలా పొంగింది.

యాదమ్మకు పిల్లలు లేరు. పెళ్ళి అయిందిగాని పెనిమిటి ఎక్కడికో వెళ్ళారని కొందరంటారు. పెళ్ళికాలేదనీ, చిన్నప్పటినుంచీ ఈ భవంతిలోనే ఉంటున్నదనీ కొందరంటారు. రేఖ కన్నీరు చూడగానే యాదమ్మకు గుండెలో కదలిక వచ్చినట్లయింది. ఇన్నాళ్ళనుంచీ మంజరీదేవి ఆజ్ఞమీద రేఖను చూస్తున్నది. పెదవులతోనే పలకరించి డ్యూటీచేసినట్లు చేస్తున్నది. కాని ఈనాడు యాదమ్మ గుండెలో తల దూర్చి దుఃఖిస్తున్న రేఖను మామూలుగా చూడలేకపోయింది.

"రేఖమ్మా ! నా తల్లివి కదూ ! నాతో చెప్పు. అమ్మమీద బెంగ కలిగిందా? స్కూల్లో ఎవరయినా మాటలన్నారా ? నాతో చెప్పు." తల నిమిరి కళ్ళు తుడిచింది.

తల్లినీ, అన్నలనూ చూడాలని ఉన్నట్టుచెబుతూ తన చిన్నప్పటి సంగతులన్నీ ఏకరువుపెట్టింది రేఖ. తన తండ్రీ, తల్లీ తనను ఎంత గారాబంగా పెంచిందీ, అన్నలు ఎంత మురిపెంగా చూసుకున్నదీ చెప్పింది.

"ఉత్తరం రాగానే వెళ్ళిపోదువుగాని. అంతలో చదువయిపోతుంది గదా," అన్నది యాదమ్మ వీపు నిమురుతూ.

"అమ్మ రమ్మని రాయాలి. మంజరీదేవిగారు పంపించాలి," అన్నది బిక్కముఖంపెట్టి రేఖ.

"అమ్మగారు పంపటానికేం ? ఉత్తరం రాగానే నేను కూడా వచ్చి పంపుతానుగా. అమ్మగారు అక్కగారి దగ్గరికి నన్ను అప్పుడప్పుడు పంపుతూ ఉంటారు." ధైర్యం చెప్పింది యాదమ్మ.

"నేను వచ్చినప్పటినుంచీ వెళ్ళలేదే ?" అనుమానంగా చూసింది రేఖ.

"అవును పంపలేదు. అమ్మగారికి ఈ మధ్య దైవభక్తి ఎక్కువైంది. ప్రతి శుక్రవారము, శనివారము గుడికి వెళ్ళి పూజలు చేయిస్తున్నారు. ఇంట్లో కూడా పూజలు చేయిస్తున్నారు."

"దేవిడీలో కూడా పూజలు చేస్తారా ? నా స్నేహితులు దమయంతీవాళ్లు చెప్పారు ఈ ఊళ్లో దేవాలయ ముందని. వాళ్ళతో వెళ్ళి చూద్దామనుకున్నాను గాని స్కూలు మూసెయ్యగానే ఇంటికి రాకపోతే ఎవరేమంటారోనన్న భయము."

"నీ వింతవరకూ దేవిడీ చూడలేదు కదూ ? అమ్మగారు గుడికి వెళ్ళినప్పుడు చూపిస్తాలే."

"నా కప్పుడు స్కూలు ఉంటుందిగా ?"

"ఏదో సమయం చూసుకుని చూపిస్తా రేఖమ్మా." అన్నది మెల్లగా ఆమెను తన పక్కలో పడుకోబెట్టుకుంటూ.

ప్రతిరోజూ రాత్రి పడుకోబోయేటప్పుడు రేఖ తన స్కూలు సంగతులూ, చదువు సంగతులూ, స్నేహితులను గురించీ యాదమ్మతో ఒక గంట కబుర్లు చెబుతూ కన్నుమూస్తుంది.

యాదమ్మ దేవిడీనుంచి భోజనం తీసుకువచ్చేటప్పుడు "రేఖమ్మకి మరి కాస్త కూర్ర వెయ్యి. ఆ పిల్ల టీ తాగదు. గ్లాసెడు పాలు పొయ్యి. చల్లబొట్లు నాకు పోసినా కాస్తంత పెరుగు పొయ్యి కప్పులో," అని వంటమనిషితో ఘర్షణ పడి అయినా తెచ్చేది.

"అమ్మగారిని అడిగావా ?" వంటమనిషి బెదిరించేవాడు. అతడు చాటు మాటుగా సరుకులు బయటికి తీసుకువెళ్ళి అమ్మటం యాదమ్మకు బాగా తెలుసు. ఆహారపదార్థాలు తన కిష్టమైన నౌకర్లకు చేతినిండా పెట్టటం - కొందరితో సంబంధాలు పెట్టుకోవటము కళ్ళతో చూసింది. కాని ఒకరిమీద నేరాలు తీసుకువెళ్ళి అమ్మగారితో చెబితే, పగబట్టి తనకు భుక్తిలేకుండా చేస్తారేమోనన్న భయం యాదమ్మకు మనసులో ఎప్పుడూ మెసులుతూ ఉంటుంది. అసలు తను ఆ ఊరి మనిషికాదు. తన మాటా - పద్ధతీ— ఇక్కడి నౌకర్లతో

కలవవు. మంజరీదేవి కనకదుర్గ గుడికి వెళ్ళినప్పుడు తను విజయవాడలో దుర్గకొండ ముందర పూలమ్ముకుంటూ ఉండేది. తల్లీ తండ్రీ లేని పదహారేళ్ళ పిల్ల–చూడముచ్చటగా కనబడ్డది మంజరీదేవి కళ్ళకు. "నాతో వస్తావా మా ఊరు ! నా వెంట తీసుకువెళ్తాన"ని ముచ్చటగా అడిగింది. ఒంటినిండా నగలూ, పెద్ద జరీ పట్టుచీరె, వెంట దాసీజనమూ – చూడగానే దిగ్భ్రాంతు రాలయింది. అప్పటి తన పేరు వీరి. ఆమెతో కూడా వెళ్ళితే తన కేలోటూ ఉండదనుకున్నది. అప్పటివరకూ పక్కయింటి ముసలవ్వనే పెద్దదిక్కుగా ఎంచుకుని జీవిస్తున్న వీరి మంజరీదేవి వెంట వచ్చి యాదమ్మగా మారింది. ఆ దేవిడీలో అమ్మగారి బట్టలు చాకలికి వెయ్యటమూ – సరిగా వచ్చినాయో లేదో చూసుకోవటమూ ముత్తి లేనప్పుడు తమలపాకు సరంజామా ఆమెకు అందించటమూ– అమ్మగారికి తల్లో పెట్టుకోవటానికి సాయంత్రానికల్లా పెరట్లో పూసిన సన్నజాజులు దండ గుచ్చటమూ – ఇవిగాక–అమ్మగా రేదయినా పని చెప్పితే చెయ్యటమూను. ఆ దేవిడీ నౌకర్లతో తా నెంత కలివిడిగా ఉన్నా వాళ్ళంతా ఒకటయి తనను వేరుగా చూడటం జరుగుతూనే ఉన్నది. అమ్మ గారయినా ఎప్పుడోగాని ఆప్యాయంగా పలకరించదని తెలుసుకున్నది యాదమ్మ. అయినా ఆమె తన పోషణ కేమీ తక్కువ చెయ్యలేదు. సంవత్సరానికి కావలసిన చీరెలు, రవికలు కొనిస్తుంది. దీపావళి పండుగకూ కాముడి పున్నమికీ కొత్తచీరెలు కొంటుంది. ఆ విశ్వాసంతోనే ఆ దేవిడీలో నౌకర్ల మధ్య జరిగే మంత్రాంగాలూ, రహస్యాలు తెలిసినా తెలియనట్లే ఉంటుంది. కంటితో చూసినా చూడనట్టే ఉంటుంది. అందరితో స్నేహంగా మసలుకుని మంచితనాన్ని నిలుపుకుంటూ వస్తోంది. ఒక్క డ్రైవరు బాలయ్యతో మాత్రం మనసు కలిపింది. కాని విచ్చలవిడిగా తిరగదు. ఆ సంగతి అందరికీ తెలిసినదే అయినా వాళ్ళిద్దరినీ సరసా లాడుకుంటూఉండగా ఎవరూ చూడలేదు.

*　　*　　*

మంజరీదేవి బద్ధకంగా ఒళ్ళు విరుచుకుని నిద్ర లేచేసరికి ముత్తి గదిలో లేదు. రెండుసార్లు గట్టిగా పిలిచింది. బయటినుంచి ఒక్క పరుగులో లోపల కాలు పెట్టిన ముత్తి ముఖం చాలా గంభీరంగా ఉన్నట్టు కనబడ్డది. మంజరీదేవి ముఖ మార్జనచేసుకుని టేబుల్ ముందర కుర్చీలో కూర్చోగానే కాఫీ, టిఫిన్ తీసుకువచ్చి బల్లమీద పెట్టింది. ఆమె ఇప్పుడు ఉదయయూ, సాయంకాలమూ తన గదిలో ఉన్న బల్లమీదనే కాఫీ, టిఫిన్ తీసుకుంటున్నది.

."ఏమిటట్లా ఉన్నావు ?" ఐదునెలలు దాటిన తన గర్భాన్ని ఒక చేత్తో తడుముకుంటూ ప్రశ్నించింది.

"నర్సిమ్లు ... నర్సిమ్లు ఏమో అంటున్నాడు." నసుగుతూ దూరంగా నిలబడ్డది.

"ఏమిటి నర్సిమ్లు, నిన్నేమన్నా అన్నాడా? వాడికేమయినా చిలిపిబుద్ధులు పుడుతున్నాయా?" కనుబొమలు పైకెత్తి కళ్ళు పెద్దవిచేసింది మంజరీదేవి.

"నన్నేమంటాడు ముసలిదాన్ని పట్టుకుని దొరసానీ! దొరవారు...దొర వారు..." నీళ్ళు నమిలింది.

"ఏమయింది? ఇంకా దొరవారు కిందికి దిగి రాలేదా? అలవాటేగా? రాత్రిళ్ల నిద్ర సరిగా లేకపోతే పదింటికి నిద్రలేవటం మామూలేగా?" తలవంచుకొని ఓరగంటితో చూస్తూ రొట్టెతుంచుకొని తినటం మొదలుపెట్టింది.

"దొరసానీ! దొరవారు పైన లేరట!"

''పైన లేకపోతే దొరవారి గదిలో చూడమను."

"అక్కడా లేరు దొరసానీ!"

అప్పటికామె టీ తాగటంకూడా అయింది. చేతులు చిన్న తువాలుతో తుడుచుకుని గదిబయటికి వచ్చి ఎప్పుడూ కూర్చునే సోఫాలో కూర్చుని తమలపాకు సరంజామాకోసం ఎదురుచూస్తున్నది

"అయితే ఎక్కడికి వెళ్ళినట్టు దొరవారు?" తనలో తాను గొణుక్కున్నది.

అంతలో పండు తమలపాకు బీడా జరదాతోకూడా తెచ్చినది పుక్కిట పెట్టుకుని, దిండుమీదికి జరుగుతూ తన గర్భంకేసి ఒకసారి చూసుకున్నది.

ఆయనకేమయినా అనుమానం తగల్లేదుకదా! ఎట్లా తగులుతుంది తామిద్దరూ ఒకయింట్లోనే ఉంటున్నారు కదా! దాంపత్యజీవితం చక్కగా సాగిపోతూనే ఉన్నదికదా? భుజంగం చొరవతీసుకోవటం ఆయన కంటపడలేదుకదా! అయినా అది ఏడాదినుంచీ సాగుతుంటే ఇవాళే అనుమానం కలగవలసి వచ్చిందా?

ఆమె మనసుకు సమాధానం కలగలేదు. చప్పున మెదడులో ఏదో మెరుపులా మెరిసినట్లయింది. వెంటనే గుమాస్తా శివయ్యను పిలిపించింది.

"దొరవారు ఈమధ్య డబ్బేమయినా ఎక్కువగా తీసుకుంటున్నారా?" ప్రశ్నించింది ఎటో ఆలోచిస్తూ.

"ఎక్కువేం తీసుకోలేదమ్మా" చేతులు కట్టుకుని చెప్పాడు.

"నిజం చెప్పండి. రాత్రిచేసిన ఖర్చులకు డబ్బు తీసుకోలేదూ?" నిలదీసి నట్లు అడిగింది.

"లేదమ్మా! దైవసాక్షిగా చెబుతున్నాను."

"అయితే రాత్రి ఖర్చులకు పైకము ఎక్కడిది?"

"రాత్రి పెట్టిన ఖర్చులకు పైకము చెల్లించమని ఒక చీటి వ్రాసి నర్సిమ్లు చేతి కిచ్చారట. నాకు ఇప్పుడే అందించాడు దాన్ని."

ఆమె ఆ చీటి అందుకుని చదువుకున్నది. నాట్యంచేసిన ఆమెకు వెయ్యి రూపాయలు, ప్రక్కవాదాల్యకు ఐదువందలు, కాక-వాళ్ళకు వెళ్ళేటందుకు చార్జీలు మూడువందలు.

ఒక్కరాత్రికి 18 వందలు! ఇవిగాక బుడ్ల ఖర్చువేరే. విందుఖర్చు ప్రత్యేకం. దాదాపు మూడువేలు!

చదువుకుని ఆ చీటి మడిచి చేతబట్టుకున్నది.

"నర్సిమ్లూ!" వెర్రికేకలేసింది ఆ హాలు దద్దరిల్లిపోయేటట్లుగా.

భయంతో మోకాళ్ళు రెండూ కొట్టుకుంటుండగా—నాలుక తడిఆరిపోగా— పెదవులు ముడుచుకుంటూ వచ్చాడు నర్సిమ్లు.

"దొరవారు నీకీ చీటీ ఎప్పుడు ఇచ్చారు?" ఖంగుమన్నది ఆమె కంఠము

"వేకువజామున నాలుగ్గంటలకు మంచినీళ్ళు తీసుకురమ్మన్నారు. నా చేతిలో నుంచి గ్లాసందుకుంటూ శివయ్యగారు వచ్చినప్పుడు ఇమ్మని ఈ చీటీ ఇచ్చారు." చేతులు కట్టుకుని ఆమె కెదురుగా నిలబడ్డాడు నర్సిమ్లు.

"కిందికి ఎప్పుడు వచ్చారు?"

"తమకు సుస్తీచేసిందని ముత్తయ్య కబురుచేసిన తరువాత-దొరవారు కిందికి వచ్చి ఈ సోఫాలో కూచున్నారు. మళ్ళీ పైకి పోలేదు డాక్టరుదొర వచ్చిచూసి తమకు మందిచ్చి దొరవారితో మాట్లాడి వెళ్ళారు."

"అయితే రాత్రి భోజనాలు పైన జరగలేదా?" ఆశ్చర్యంతో ప్రశ్నించింది కళ్ళు వెడల్పుచేసుకుని

"లేదు దొరసాని! దొరవారు పైకి పోలేదు. ఒక గంట చూసి ఎక్కడివా ళ్ళక్కడ సర్దుకున్నారు."

ఆమె అంతులేని ఆలోచనలతో కళ్ళుమూసుకుంది.

మరో పావుగంటకు "నాట్యంచేసిన ఆమె ఎక్కడ దిగింది?" కళ్లు తెరవ కుండానే అడిగింది.

"భూమయ్యదొర మిద్దెమీద దిగింది."

''వెళ్ళిపోయిందేమో చూసిరా."

"ఇంకా పోలేదు దొరసానీ! శివయ్యగారు అక్కడికివెళ్ళి పైకము ఇవ్వాలి కదా!"

ఆమెకు కలిగిన అనుమానము అంతటితో వదలిపోయింది.

మరి దొరవారు ఏమయినట్టు?

చటుక్కున జ్ఞాపకమొచ్చింది ఆమెకు—తన గర్భంసంగతి తాను ఇంతవరకూ ఆయనకు చెప్పనట్టుగా. ఒకవేళ డాక్టరు చెప్పాడేమో! చెబితేమాత్రం! ఇంత కాలం రాని గర్భం ఇప్పుడెలా వచ్చిందని సంశయము కలిగిందా? ఎలా కలుగుతుంది? ఎవరిమీద అనుమానం!

అలా ఆలోచిస్తూ సోఫామీద ఒరిగిపోయింది మంజరీదేవి.

మధ్యాహ్నం పన్నెండుగంటలు కావచ్చింది. ఆమె కదలలేదు. నౌకర్లంతా వాళ్ళ పనులు వాళ్ళు చేసుకుని హాలులో గోడవారగా నిలబడ్డారు. ఆమెను లేప టానికి అందరికీ భయమే.

ముత్తి చొరవచేసి "దొరసానీ! లేచి స్నానంచేయండి, వేడినీళ్ళు ఆరిపో తున్నాయి. వేళకు భోజనం చెయ్యకపోతే కడుపు బిగదీస్తుంది. మీరు వట్టి మనిషికారు." ముందుకువచ్చి నిలబడ్డది.

కళ్ళు తెరచిన మంజరీదేవి ఏదో జ్ఞాపకం వచ్చినట్టుగా దిగ్గున లేచింది. స్నానాలగదివైపు అడుగులు వేసింది.

ఏమిటిది? ఇలా ఎందుకు జరిగింది?

ఆలోచనలు సాగుతున్నా ఆమె తన ఆరోగ్యాన్ని గురించి అశ్రద్ధ చేయ దలచుకోలేదు. దైవము నిరంతరమూ ఆమె మనసులో మెదులుతున్నాడు. ఆ ఊరిలో నరసింహస్వామి దేవాలయము ఉన్నది. అదికూడా నరసాయమ్మ ధనంతో నిర్మాణమయినదే. ఆ స్వామి నర్చించుటంలో దేవార్చనే కాకుండా పెద్దల ఆశీర్వచనము లభించినట్లనుకుని వరుసతప్పకుండా ప్రతి శుక్ర, శనివారాలు వెళ్ళి సహస్రనామార్చన చేయించి కొబ్బరికాయలు కొట్టిస్తున్నది.

క్రమం తప్పకుండా డాక్టరు వస్తున్నాడు. మందులు ఎటువంటివి వాడాలో వ్రాసి ఇస్తున్నాడు. పళ్ళరసాలు తాగమంటున్నాడు. ఆమె అరోగ్యానికి భంగం రాకుండా కాపాడుతున్నాడు.

తొమ్మిదవనెల రాగానే మంజరీదేవి పట్నంనుండి లేడీడాక్టర్ని పిలిపించు కున్నది మంజరీదేవి గర్భంలో బిడ్డ సక్రమంగా ఎదుగుతున్నదని హామీ ఇచ్చింది. పురిటి సమయానికి తనకు కబురు చేయమని చెప్పింది డాక్టరు.

చలికాలం. జీవులన్నీ ముడుచుకొని పడుకునే వేళ—రాత్రి పదకొండు గంటలకు దేవిడీలో పసిబిడ్డ కేర్ కేర్ మని ఏడ్చినట్టు భవనమంతా వినబడ్డది.

మంజరీదేవి తన జన్మ సార్థకమయినట్లు భావించింది. పసిబిడ్డ ఏడుపుతో ఆమె తనువు పులకరించింది. గత రెండురోజులుగా పడిన బాధ దానంతట అదే మరుగున పడిపోయింది. తహతహ! ఆ బిడ్డను-అపురూపంగా తనకు జన్మించిన ఆ బిడ్డను-ఎన్ని అపవాదులయినా భరించి నవమాసాలూ మోసి కన్న ఆ పసిబిడ్డను కంటితో చూడాలన్న తహతహ! ఆరాటము! తొందర!

లేడీడాక్టరు మహాలక్ష్మి ఆమె చేతిలో మగబిడ్డను సజీవంగా పెట్టగలిగినందుకు తన అదృష్టాన్ని తానే అభినందించుకున్నది. తన చాకచక్యాన్నంతా ప్రదర్శించ గలిగినందుకు ఎంతో మురిసిపోయింది.

"అమ్మా! మీ బిడ్డను కళ్ళారా చూసుకోండి. ఆరు పౌనులున్నాడు. ఆరోగ్యంగా ఉన్నాడు." మంజరీదేవి పక్కలో పడుకోబెట్టింది. ఒత్తిగిలి తనబిడ్డను కంటినిండా చూసుకున్న మంజరీదేవి డాక్టరు మహాలక్ష్మిని ఒక దేవతగా భావించింది. ఆమెకు కృతజ్ఞతో రెండుచేతులూ పైకెత్తి జోడించింది. ఆనంద బాష్పాలు ఆమె కళ్ళల్లో ఇంధుపగింజల్లా నిలిచాయి.

డాక్టరు ఆ పదిరోజులూ వారింటనే బసచేసింది. ఆమెకొరకు మేడపైన రెండుగదులు శుభ్రంచేయించి కావలసిన ఏర్పాట్లు చేయించింది మంజరీదేవి. పదకొండవరోజున స్నానంచేయించి—తల్లికీ బిడ్డకూ కావలసిన మందులు రాసి యిచ్చి తన బహుమతులను అందుకొని మంజరీదేవి కారులో డాక్టరు వెళ్ళి పోయింది.

బిడ్డ పుట్టాడన్న అంత సంతోషములోనూ మంజరీదేవి మనసు వెలితి వెలితిగా ఉన్నది. తనతో జీవితము పంచుకున్న గోపాలకృష్ణనాయుడు తన సంతోషంలో భాగం పంచుకోవటానికి ఇష్టంలేకనే ఇల్లువదిలి వెళ్ళిపోయినట్టు ఆమెకు రూఢిగా అర్థంకావటం మొదలుపెట్టింది. ఆయనకు తనమీద అనుమానమే కలిగిందన్న దానికి నిదర్శనము చెప్పాపెట్టకుండా ఉత్తరమ్ముక్క-అయినా వ్రాసిపెట్టకుండా వెళ్ళటమే.

ఇప్పుడు తన కర్తవ్యం?

సంసారాన్ని త్యజించి వెళ్ళటం తప్ప ఆయన తననేమీ అవమానపరచ లేదు. కించపరచే మాటలేమీ అనలేదు. తనే ఇంటినుండి వెళ్ళిపోయాడుగాని తనను వెళ్ళగొట్టలేదు. స్థిరచరాస్తులన్నీ అట్లాగే ఉన్నాయి. ఈ బిడ్డను పెంచి పెద్దవాడిగాచేసి ఈ ఆస్తికి వారసుణ్ణి చేయటమే తన కర్తవ్యము. తన శక్తి వంచనలేకుండా బిడ్డను విద్యావంతుడిని చేయాలి. సకల విద్యలూ నేర్పించాలి. వాడికి జీవితంలో ఏవిధమయిన లోటూ ఉండకూడదు. దృఢంగా నిశ్చయము చేసుకున్నది మంజరీదేవి. ఇరవై ఒకటవ రోజున పేరు దేవాలయంలో పెట్ట టానికి నిశ్చయించుకున్నది. ఏ పేరు పెట్టాలన్న ఆలోచన చేయలేదు. గోపాల కృష్ణరాయడి తండ్రిపేరు గిరిధరరాయడు. ఆ పేరు పెట్టి-ఆ మరునాటినుండి ఆస్తి వివరాలు డబ్బు లెక్కలు స్వయంగా చూసుకోవటం మొదలుపెట్టింది.

గిరిబాబు మంజరీదేవి ప్రాణంలో ప్రాణంగా ఆ యింట పెరుగుతున్నాడు. బిడ్డ అందరికీ అపురూపం-కాని-నర్సిమ్లు మాత్రం ఓరగంటయినా చూడడు.

* * *

కాలచక్రం తిరుగుతున్నది. గిరిబాబుకు విద్యాభ్యాసము చేసే సమయము ఆసన్నమయింది. ఒక టీచర్ని పెట్టి ఇంట్లోనే ఏర్పాట్లుచేసింది మంజరీదేవి. మేడమీది గదులు పిల్లవాడి పడకకూ చదువుకూ ఆటలకూ ఏర్పాటుచేసింది. వయసుకు తగిన తెలివితేటలు గల పిల్లవాడు ఆమెకు తృప్తికరంగా చదువు తున్నాడు. పదిపన్నెండు సంవత్సరాల వరకూ ఇంట్లోనే చదువు చెప్పించి అక్క డికి పదిహేనుమైళ్ళ దూరంలో ఉన్న పట్నంలో తమ హోదాకు తగిన పాఠ శాలలో చేర్పిద్దామని సంకల్పించింది మంజరీదేవి.

పదవసంవత్సరము వచ్చిన గిరిబాబు చదువుతున్నాడుగాని-వయసుకు తగిన పొడుగులేడు. దేహము వయసుకు తగినట్టు నవనవలాడుతూ లేదు. ముక్కు, పాదాలు—చేతులు ఎదగటం ఆగిపోయినట్లనిపిస్తాయి. ఎదగకుండానే ముదురు తున్నట్టు కనబడుతున్నాయి. ఒంటినిండా బట్టలు ఉండటంచేత-ముఖం మాత్రం అసాధారణంగా కనబడటం నౌకర్లు గమనించినా నోరెత్తలేక పోయారు అనుమానించిన మంజరీదేవి వెంటనే డాక్టర్ని పిలిపించింది.

పిల్లవాడిని క్షుణ్ణంగా పరీక్షించాడు డాక్టరు. ఆరోగ్యంగానే ఉన్నాడు- వయసుకు తగిన తెలివితేటలు ఉన్నాయి. చురుకుతనమున్నది పిల్లవాడిలో.

"ఏమిటి లోపం డాక్టరుగారూ?" ఆవేదనతో అల్లాడిపోతున్నది మంజరీదేవి.

"అమ్మా! ఆరోగ్యంలో ఏమీ లోపములేదు." మెల్లిగా అన్నాడు.

"వయసుకు తగినట్టు ఎదగడంలేదని నాకనిపిస్తున్నది. మీ అభిప్రాయం చెప్పండి."

"ఇప్పుడితడు మూడు అడుగుల ఎత్తు ఉన్నాడు. ఇంకొక అరడుగుగాని ముప్పావు అడుగుగాని పెరగవచ్చు. క్షమించండి నాకు తోచినమాట చెబుతున్నాను. దేహనిర్మాణము దీనికి తగినట్లే ఉంటుంది. పుష్టికరంగా ఉంటుంది కాని పొడుగు పెరగదు."

పిడుగుపడినట్లయింది మంజరీదేవికి. "ఇవ్వక ఇవ్వక ఈ మరుగుజ్జును నాకు ప్రసాదించి కన్నీళ్ళు తుడిచావా పరమేశ్వరా" అన్నది పైకే-ఆమెకు ముచ్చెమటలు పోశాయి

కొంతసేపటికి తెప్పరిల్లి "దేహచర్మము ఎట్లాఉన్నదో చూడండి" అన్నది.

"దీనికి తగినట్లే ఉన్నదమ్మా. దిగులుపడకండి. అబ్బాయి తెలివిగలవాడు." ఆమె విచారాన్ని పోగొట్టటానికి ప్రయత్నించాడు డాక్టరు.

మంజరీదేవికి ఆశాభంగమే అయింది. తన కడుపున మగబిడ్డ పుట్టాడనగానే ఎంతో సంతోషించింది. గోపాలకృష్ణరాయడు ఇంటినుంచి వెళ్ళిపోయినా పిల్లవాడిని చూసుకుంటూ కాలం గడుపుకుంటూ వస్తున్నది. కాని చివరకు తనకు పరమేశ్వరుడు ప్రసాదించినది ఒక మరుగుజ్జని తెలియగానే క్రుంగిపోయింది. ముచ్చెమటలు పోశాయి. తెలివితప్పి పడిపోతుందేమోనని భయపడ్డాడు డాక్టరు.

"చూడండి పిల్లలకు పది పదహారు సంవత్సరాల మధ్య పెరుగుదల ఉంటుంది. మనకు తెలియకుండానే పొడుగు పెరుగుతారు. ఇతడికి అదొక ఛాన్సు ఉంది. యెదిగితే యెదగవచ్చు. మీరు యిప్పటినుంచి దిగులుపడకండి. మీరు అతడి చదువును గురించి శ్రద్ధ బాగా చూపండి.

ఈ సంభాషణ పిల్లవాడు వినకుండా పక్కగదిలోకి తీసుకువెళ్ళి డాక్టరుకు కాఫీ టిఫిన్ ఏర్పాటుచేసింది, మంజరీదేవి.

గిరిబాబుకు స్నేహితులు లేరు. అతనెక్కడికీ వెళ్ళడానికి వీలులేదు. బొమ్మల పుస్తకాలు తిరగేసి ఒక్కడూ ఆటలు ఆడుకుని టీచరుముందు కూర్చుని పాఠాలు చదివి హోమ్‌వర్క్ చేసి విసిగిపోతాడు. నౌకర్లు తనను అదొకమాదిరి వింత చూపు చూస్తే కోపం తెచ్చుకుంటాడు. అలుగుతాడు. నౌకర్ల మాటలు వినడు. కేకలు పెడతాడు.

మంజరీదేవికి ఇదొక పెద్ద సమస్యగా ఏర్పడ్డది. బిడ్డను గురించిన దిగులు

తనను క్రుంగదీస్తూనే ఉంది. పైగా అతడి ప్రవర్తన కూడా దానికి తోడయి ఆమెను కలవరపరుస్తున్నది.

ఆదిలక్ష్మీదేవి, కామేశ్వరీదేవి, మంజరీదేవి రాజారంగారావుగారి కుమార్తెలు. ఆయనకు మగబిడ్డలులేని కారణంచేత ఈ ముగ్గురు కూతుళ్ళనూ ఆ కాలములో ఆడపిల్లల పై చదువులకు అనువుగా ఉన్న మదరాసులోని క్వీన్‌మేరీస్ హాస్టల్లో చేర్చి, ఆ కాలేజిలోనే చేర్పించాడు. వాళ్ళు ముగ్గురు అదే కళాశాలలో పట్టభద్రులయ్యారు. రాజారంగారావుగారు తన హోదాకు తగిన సంస్థానాధిపతుల కుమారులకు పిల్లలనిచ్చి, వివాహాలుచేసి తన ఆస్తిని ముగ్గురికీ సమానంగా పంచిపెట్టాడు ఈ ముగ్గురు అక్కచెల్లెళ్ళకు తెలుగుభాషలో కంటే ఆంగ్ల భాషలోనే పరిచయమే ఎక్కువ.

మంజరీదేవికి కాన్వెంట్లు ఎక్కడెక్కడున్నాయో బాగా తెలుసు. బొంబాయి, కలకత్తా, మదరాసు నగరాలలోని కాన్వెంట్ల స్కూళ్ళకు తన సమస్యను గురించి వ్రాస్తూ ఎవరయినా వయసు మళ్ళిన స్త్రీ అంటే సుమారు నలభై సంవత్సరాలు గల ఆమె, పిల్లవాడికి చదువుచెప్పి, అతడికి సంతోషాన్నీ, ఉల్లాసాన్నీ కలిగిస్తూ అతడిని చూసుకునే గవర్నెస్ ఉంటే పంపమని వ్రాసింది. ఉన్నట్లయితే పంపమనీ, రైలు చార్జీలు పంపుతాననీ కోరినంత జీతమిచ్చి యింట్లోనే ఉంచుకుంటాననీ ఏడాదికొకసారి తమవాళ్లను చూడదలచుకుంటే వెళ్లవచ్చునని ఆ ఖర్చు కూడా తానే భరిస్తాననీ వివరించిందా ఉత్తరంలో.

పదిహేనురోజుల తర్వాత కలకత్తా మదరాసు నగరాలనుండి వచ్చిన సమాధానాలు మంజరీదేవి కంతగా తృప్తినివ్వలేదుగాని బొంబాయిలో ఉన్న ట్రైలా కాన్వెంటునుంచి ప్రిన్సిపల్ వ్రాసిన జాబు ఒకవిధంగా నచ్చింది. వెంటనే పంపమని డబ్బు పంపింది.

రైల్వేస్టేషనుకు దూరంగా ఉన్న తమ ఊరికి మొట్టమొదటిసారిగా రాబోయే అమెరికా దేశస్తురాలయిన టీచరు బస్సులో రావటానికి ఇష్టపడని మంజరీదేవి కారుతీసుకుని స్టేషనుకు స్వయంగా వెళ్ళింది.

బంగారు వన్నెగల తల వెంట్రుకలతో తెలుపురంగులో ఎరుపువన్నె కలసిన దేహచ్ఛాయతో అదొకవిధమైన నీలిరంగు కళ్ళతో పొడుగైన ముఖంలో కిందికి వాలిన ముక్కుతో సన్నటి పెదవులతో మోకాలివరకూ తెల్లటిగౌను తెల్లటి మేజోళ్లు తెల్లటి ఎత్తుమడమల కాలిజోళ్ళతో ఒక చేతిలో చిన్నగొడుగు, మరొక చేత్తో సూట్‌కేసుతో కంపార్టుమెంటులోనుంచి ప్లాటుఫారమ్ మీదికి దూకింది జోసఫిన్.

ఆమెను చూడగానే మంజరీదేవి తనకు వచ్చిన ఉత్తరంలోని ఫోటోను పోల్చి చూసుకుని గుర్తుపట్టి, తనను పరిచయము చేసుకుని ఆమెకోసమే తాను కారు తీసుకువచ్చినట్టు చెప్పి ఇంటికి తీసుకువచ్చింది. ప్రయాణం సరిగా జరిగిందో లేదో అడిగి తెలుసుకున్నది. మధ్యదారిలో తన కుమారుడి పేరూ అతడి పరిస్థితీ అతడి స్వభావమూ అతడి భవిష్యాన్ని గురించిన తన ఆందోళననూ వ్యక్తంచేసింది.

"నేను సైకాలజీ పట్టభద్రను. పరిస్థితులను అర్థంచేసుకొని అతడిని చదివించగలను." తన పండ్లను పైకి కనబరుస్తూ నవ్వి తల ఆడించింది జోసఫిన్.

హాల్లోకి ప్రవేశించగానే సోఫాలో కూర్చోబెట్టి కాఫీ టిఫిన్ తెప్పించింది మంజరీదేవి. కళ్లతో చూచిన ఆ యింటి వైభవాన్నీ ఐశ్వర్యాన్ని అంచనా వేయగలిగింది జోసఫిన్. తాను ఎంతకాలం ఉండగలిగితే అంతకాలమే సుఖంగా ఉండవచ్చునని తృప్తిపడ్డది. తన పట్ల ఆమెకు అంతలోనే కలిగిన గౌరవాన్నీ, విశ్వాసాన్నీ గ్రహించి అబ్బురపడ్డది.

ఇద్దరూ మెల్లగా మేడమెట్లు యెక్కుతూ ఉండగా మంజరీదేవి మేడపైన ఉన్న గదులనూ పెద్ద హాలునూ వర్ణించి చెప్పింది.

"హలో మైడియర్ గిరిబాబూ !"

హాలు తరువాత వీధి వైపుకు ఒక వరండా ఉంది. యెందుకు కట్టారోగాని పిట్టగోడ యెత్తుగా కట్టారు. ఒక చిన్న పెట్టెమీది కెక్కి కాళ్ళు పైకెత్తి గోడ మీదుగా చూస్తున్న గిరిబాబు వెనక్కి తిరిగి చూశాడు. ఎవరు తనను పేరుపెట్టి పిలుస్తున్నది ? కంఠధ్వని కొత్తగా ఉన్నదే !

బూట్లచప్పుడు వినబడుతున్న వేపుగా నడిచాడు.

అంతలో జోసఫిన్ అతడి చెయ్యిపట్టుకొని దగ్గరకు తీసుకొని "హలో ! గిరిబాబూ ! ఐయామ్ యువరు టీచర్ " అన్నది ప్రేమతో.

ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసుకొని చూశాడు గిరిబాబు

"నిజమా ?" అన్నాడు తెలుగులో.

అది ప్రశ్న కావచ్చుననుకొని "ఎస్, రియల్లీ ఐయామ్ యువర్ టీచర్ ఫ్రమ్ టు డే" అన్నది బుగ్గలు మృదువుగా నిమురుతూ జోసఫిన్.

గిరిబాబు ఆమెను చూసి విస్మయపడిపోతున్నాడు.

ఆ వెంకట్రావు టీచరు తనవైపు సరిగా అయినా చూసేవాడుకాదు. ముఖం పక్కకు తిప్పుకుని మాట్లాడేవాడు. కుర్చీలో కూర్చున్నంత సేపు అతడి ముఖం

ఎంత వికృతంగా పెట్టేవాడో! ఈ టీచరు చాలా మంచిదిలా ఉంది అనుకున్నాడు.

మంజరీదేవి జోసఫిన్‌కు ఒక గది మేడమీదనే ప్రత్యేకించింది. ఆమెకు నచ్చినట్లు కోరిన ఏర్పాట్లు చేసింది.

నాలుగు రోజుల్లోపలే ఆంటీ ఆంటీ అన్న పిలుపులూ, పక పక నవ్వులూ కిందికి వినపడసాగాయి. మెట్ల దగ్గరగా ఉన్న సోఫామీదనే పగలంతా గడపటం మొదలుపెట్టింది మంజరీదేవి.

జోసఫిన్‌కూ, గిరిబాబుకూ మేడమీదనే స్నానాలూ భోజనాలూ వగైరా జరిగిపోతున్నాయి.

ఒకనాటి సాయంకాలం ఐదుగంటలవేళ మంజరీదేవి గుడికి వెళ్ళాలని సోఫామీదినుంచి లేవబోతుండగా మేడమీదనుంచి వచ్చిన ధ్వనులకు విభ్రాంతురాలయి పది మెట్లు ఎక్కి ఆశ్చర్యంతో నిలబడిపోయింది.

ఏవో పాటలు వినబడుతున్నాయి.

మరో రెండు మెట్లు—మరో రెండు మెట్లు—ఎక్కుతూ వొంచి ద్వారం దగ్గర నిలబడిపోయింది మంజరీదేవి.

జోసఫిన్ ఇంగ్లీషు పాట పాడుతూ గిరిబాబుచేతకూడా పాడిస్తున్నది. ఇద్దరూ చేతులు పట్టుకుని హాల్లో అటునుంచి ఇటూ, ఇటునుంచి అటూ మెల్లగా అడుగులు వేస్తూ పాటపాడుతున్నారు, నవ్వు ముఖాలతో.

విప్పారిన ముఖంతో మంజరీదేవి మెల్లగా మెట్లుదిగి దైవదర్శనానికి వెళ్ళింది.

*　　　*　　　*

నాలుగురోజుల సెలవుమీద వచ్చిన మాణిక్యం కూతురిని చూడాలన్న తహతహతో యాదమ్మతో మాట్లాడుతూ కూర్చున్నది.

"ఇంతకాలానికి బిడ్డను చూడవచ్చారా?" అన్నది యాదమ్మ.

అవునని తలఊపుతూ "చూడమ్మా, నేనొకయింట్లో ఒదిగి ఒదిగి ఉన్నదానిని కామేశ్వరీదేవిగారికి ప్రైవేటు సెక్రటరీననుకో. ఆమె డబ్బులెక్కల దగ్గర్నించి బట్టలలెక్కవరకూ చూడాలి. ఇంటి మేనేజిమెంటంతా నేనే. ఆమె కొడుకు దూరదేశంలో ఉన్నాడు. ఆమె దిగులుపడకుండా చూడాల్సినదానను నేనే. నా బాధలన్నీ అణచిపెట్టుకుని ఆమె మనశ్శాంతికోసం ప్రయత్నించాలి. నాదొక విచిత్రమైన జీవితం. రేఖ ఉత్తరాలకు సంతోషిస్తూ ఉండటమేగాని వెంట వెంట ఉత్తరాలు వ్రాయటానికయినా నోచుకోలేదు" అన్నది కంటతడిపెట్టుతూ.

"రేఖమ్మ బాగా చదువుతున్నది. నాలుగునెలల క్రిందటివరకూ నాతోపాటే ఈ గదిలో ఉండేది. కాని దొరసాని ఇప్పుడు దేవిడీలోనే ఒకగది ఇచ్చారు. కాని రేఖమ్మ ఒంటరిగా పడుకోలేక నన్నే రాత్రిళ్ళు తనగదిలో పడుకోబెట్టుకుంటున్నది. వెర్రిపిల్ల. రాత్రిళ్ళు పడుకోబోయేటప్పుడు నా చేయి గట్టిగా పట్టుకుంటుంది. మెట్రిక్ ప్యాసయిందట. ఇవాళ స్కూలుకెళ్ళింది ఏదో బహుమానమిస్తారట."

రేఖ సెలవుల్లో తల్లిని చూడ్డానికి బయలుదేరాలని ప్రయత్నించింది. మంజరీదేవి ఇష్టపడలేదట. తను రేఖకు పెళ్ళిచేయాలనుకుంటోంది. కామేశ్వరీదేవిని సంబంధాలు చూడమని చెప్పింది. ఇప్పుడెందుకో మంజరీదేవి తనను ఒకసారి వచ్చి వెళ్ళమని ఉత్తరం వ్రాసింది. తనతో పంపిస్తుందేమో తను కోరినట్టుగా. పెళ్ళికేదయినా సహాయంచేయమని అర్థించాలి. రేఖ పెళ్ళయితే చాలు తనకు. మగపిల్లలు వాళ్ళే చేసుకుంటారు. తన జీవితం కామేశ్వరీదేవి దగ్గరే గడిచిపోతుంది.

తన కూతురిని ఇంతకాలము పోషించి చదువు చెప్పించినందుకు—ఆమెకు తన కృతజ్ఞత తెలుపుకోవాలి. మంజరీదేవి కొద్దిగా రాజసంతో మాట్లాడుతుంది. ఆమెవల్ల తను సహాయం పొందింది, కనుక అహం చంపుకొని—అతి వినయంతోనే మాట్లాడాలి. ఇంతకాలంనుంచీ కామేశ్వరీదేవి దగ్గరకూడా తను తనుగా మెలగటంలేదు. తాను ఆమెచేత పోషింపబడుతున్నట్టుగానే సంచరిస్తున్నది అంతకంటే పదిరెట్లు మంజరీదేవి దగ్గర తలవంచాలి.

మాణిక్యం కాలానికి తగినట్లుగా తనకున్న అవకాశంతోపాటు సర్దుబాటును అలవరుచుకున్నది. కాని మనసు అప్పుడప్పుడు వశం తప్పుతూ ఉంటుంది. బాధకొద్దీ కళ్లు మూసుకుని అలికిడికి కళ్లు తెరిచింది.

తనకెదురుగా నడిచి వస్తున్నది రేఖా! బాగా పొడుగెదిగింది. కాని సన్నగా రివటలా అట్టాగే ఉంది. ఒంటికి ఛాయవచ్చింది. దేహం మిసమిసలాడుతున్నది. తలవెంట్రుకలు మాత్రం ఎదిగినట్లేలేవు. బుద్ధిమంతురాలి తలవెంట్రుకలు భుజాలు దిగవన్నట్టు అట్లాగే కురచగా ఉన్నాయి. అచ్చం-ఆ పోలిక-ఆ నడక-తండ్రి నడిచి వస్తున్నట్టుగా ఉన్నది.

"నీవుటమ్మా ఇక్కడ కూర్చున్నది? ఇంకా ఎవరోననుకున్నాను! నా ఉత్తరాలకు జవాబయినా వ్రాయకుండా హఠాత్తుగా ఇప్పుడు వచ్చావా?" తల్లి చేతుల్లో ఇమిడిపోయింది రేఖ—ఆనందాశ్రువులతో.

అది-ఆనందమో-దుఃఖమో తెలియని ఉద్వేగంలోనుంచి ఇద్దరూ తేరుకునే టప్పటికి అరగంటకు పైగా పట్టింది.

అప్పటికి తన కర్తవ్యం స్ఫురించింది రేఖకు. "అమ్మా! మంజరీదేవిగారు హాల్లో కూర్చుని ఉన్నారు. రా పోదాం."

మంజరీదేవికి నమస్కరించి ఆమె చూపిన కుర్చీలో ఎదురుగా కూర్చుంది మాణిక్యం. రేఖ మెల్లగా తనకని ప్రత్యేకించిన గదిలో పరదాచాటున నిలబడ్డది.

జరదాబీడా పుక్కిటపెట్టుకుని "అక్క నిన్ను వెంటనే పంపించిందే! ఇంత తొందరగా పంపుతుందనుకోలేదు నేను" అన్నది మంజరీదేవి వీధివాకిలివైపు చూస్తూ.

"కామేశ్వరీదేవిగారికి ఈ మధ్య కడుపునొప్పి వస్తున్నది. అబ్బాయిగారు మరో రెండేళ్ళకుగాని అమెరికానుంచి బయలుదేరనంటున్నారు. ఆమెకు కొంత బెంగ-కొంత బాధ. ఆమెను వదలిపెట్టి రావటం కష్టమైనప్పనే-కాని మొన్న మా అబ్బాయి నన్ను చూడటానికి వచ్చాడు. ఆమె దగ్గర వాడిని ఉంచి వచ్చాను. నేనయినా రేపు బయలుదేరి వెళ్ళిపోవాలి. ఆ మాటమీదనే నన్ను రానిచ్చారు కామేశ్వరీదేవిగారు." చాలా నమ్రతతో చెప్పింది మాణిక్యం.

"అలాగా! అక్కకు కడుపునొప్పి చిన్నప్పుడు ఉండేది. ఇప్పుడదే తిరగ బెట్టింది కాబోలు. అయినా అక్కకు పిల్లవాడిమీద అంత దిగులెందుకు? పిల్ల వాడు లక్షణంగా పైచదువులకు అమెరికా వెళ్ళితే-వెళ్ళిన మరునాటినుంచీ ఎప్ప డొస్తావంటూ ఉత్తరాలు రాస్తుంటే-వాడు అక్కడ నిశ్చింతగా ఎలా చదువు తాడు? ఎంత తల్లయినా కాస్త ఆలోచన ఉండక్కరలేదూ? ఏం మనుషులో? ఒకటుంటే ఒకటి లేదని ఏడుస్తారు" అన్నది ముక్కుపుటా లెగురవేస్తూ మంజరీదేవి.

మాణిక్యం ఆమె మాటలకు విస్తుబోయింది. ఏదో సమాధానం చెప్పబోయి నిగ్రహించుకున్నది.

కొంతసేపయిన తరువాత మంజరీదేవిగారి కొడుకును గురించి కుశల ప్రశ్నలు వేయాలనుకుంది. పెదవులు విప్పబోయి అంతలోనే ముడుచుకున్నది. తన అంతస్తుకూ మంజరీదేవి అంతస్తుకూ గల తేడాను జ్ఞప్తికి తెచ్చుకుని ముభావంగా కూర్చుంది కాస్త సర్దుకుని మాణిక్యం.

"ఆఁ! అయితే రేఖసంగతి ఏంచెయ్యాలనుకున్నావు?"

మాణిక్యం ఉలిక్కిపడ్డది ఆ ప్రశ్నించిన తీరుకు. వెంటనే సర్దుకుని

మీ దయవల్ల మెట్రిక్ దాటిందికదా! మీ మీ సహాయంతో పెళ్ళిచేద్దామని ఉంది. అంతకంటె ఎక్కువ ఆశించే అధికారం నాకు లేదమ్మా." చేతులు జోడించింది మాణిక్యం.

సంభాషణ ఎటు తిరుగుతుందో—ఎలా ముగుస్తుందోనని కుతూహలంతో చెవులు దోరగిల బెట్టుకుని వింటున్నది రేఖ.

"ఊఁ. మెట్రికే చాలంటావు నీ కూతురికి?" అదొకమాదిరిగా మాణిక్యం ముఖంలోకి చూసింది మంజరీదేవి.

విషాదంగా నవ్వింది మాణిక్యం. "ఈ చదువు మాత్రం దీని అదృష్టంలో ఉన్నదని నేను మొదట అనుకున్నానా? మీ ఔదార్యం గొప్పది. నా యాచన—అక్కగారి సూచన—మీ కడుపులో దయను పుట్టించాయి. నాకు గొంతెమ్మ కోరి కలు లేవు. ఈ ఋణాన్ని నేను ఈ జన్మలో తీర్చుకోలేను. రేఖను ఇంతకాలం పోషించి చదివించారు. అంతేచాలు. రేపు ఇద్దరం వెళ్తాము. ఉదయం ఐదు గంటలకే బస్సు ఉన్నదని చెప్పారు." మాణిక్యం ఆనందబాష్పాలు తుడుచు కున్నది కొంగుతో.

"మాణిక్యం! మా అక్క కూడా రేఖను తీసుకువచ్చెయ్యమనే చెప్పిందా?"

"అవునమ్మా! ఒక సంబంధమేదో ఆమె దృష్టిలో ఉందట, పెళ్ళి చేద్దామన్నారు."

"చూడు! ఎంత గతిలేనిదానివైనా మెట్రిక్ చదువు ఒక చదువనుకుంటు న్నావా? బి.ఏ. వరకయినా చదవనీ. ఏదో ఒక చిన్న ఉద్యోగం చేసుకుని బ్రతుకుతుంది. అక్క కుదర్చబోయే సంబంధం ఎటువంటిదో అడిగావా?"

"టీ కంపెనీలో కమీషన్ ఏజంటు. ఎన్ని ప్యాకేట్లు అమ్మితే వాటిమీద అంత కమీషన్ దొరుకుతుందట. కనీసం నెలకు రెండువందలు ఉంటాయని ఒకసారి అనగా విన్నాను. నా స్థితిగతులు విచారించే తగిన సంబంధం చూశారు."

"ఇన్నాళ్లూ పెంచి వాడికా రేఖను అంటగట్టటం? శక్తిఉన్ననాడు టీ ప్యాకెట్లు అమ్ముతాడు. కాస్త తలనొప్పివస్తే అమ్మలేడు. ఆనాటి గతి ఏమిటి?" కాస్త కాఠిన్యం మాటల్లో కనబరచింది మంజరీదేవి.

"దానికంతకంటె గొప్పది ఎక్కడినుంచి వస్తుందమ్మా? నా స్థితికి అది ఘనంగానే తోచింది. నాదగ్గరేమున్నదని కట్నకానుకలు ఇవ్వగలను? ఆ ఒక్క పూట పెళ్ళికయినా మీ అందరి సహాయం కావలసిందేకదా?"



"ఆఁ. అయితే విను. మా సహాయం నీకు ఎలాగూ కావాలంటున్నావుకదా? బి.ఏ. వరకూ చదవనీ రేఖను. ఇప్పుడు చేసే సహాయం అప్పుడే చేస్తాము. కాదంనటంలేదు నేను."

"అమ్మో? ఇంకా నాలుగేళ్ళు చదవాలికదా!"

"చదవాలి మరి."

"ఈ ఊళ్లో పైచదువులకు వీలులేదుకదా!"

''అవును. ఇక్కడ కాలేజి చదువు లేదు. కాని పదిహేనుమైళ్ళ దూరంలో ఒక కాలేజి పెట్టారు. అక్కడికి వెళ్ళి చదువుకోవచ్చు. బస్సులు నడుస్తూ ఉంటాయి. అదికాక ఆ కాలేజికి హాస్టలుకూడా ఉన్నది. నేను అన్నీ విచా

రించాను. - దానిలో చేర్పిస్తాను. సరేనా! నాలుగేళ్ళు కళ్లు మూసుకుంటే నీ కూతురు రేఖ బి.ఏ. అయిపోతుంది.'' సూటిగా మాణిక్యం కళ్ళల్లోకి చూసింది మంజరీదేవి.

మాణిక్యానికి తన కూతురు బి.ఏ. అవుతుందంటే ఆశగా ఉంది. కాని–చేతిలో ఉన్న సంబంధంపోతే మళ్ళీ దొరకదేమోనన్న భయం. అప్పటికి రాజెవరో–రెడ్డెవరో? ఈ మాటలు అప్పుడుకూడా అక్క-చెల్లెళ్ళ మనస్సుల్లో ఉండాలి. అది నెరవేరాలి అంతవరకూ తాను కాచుకొని కూర్చోగలదా? అంలా సందిగ్ధంగా ఉంది.

"నన్ను అనుమానిస్తున్నావా మాణిక్యం? అయినా నీ కూతుర్ని పిలిచి అడుగు-ఇంతటితో చదువు చాలించి, నీతో వచ్చి, వాడినెవరినో కట్టుకుంటుందో–లేక ఇక్కడే ఉండి బి.ఏ. వరకూ చదువుతుందో తేల్చుకో.''

పిలవగానే రేఖవచ్చి ఎదురుగా నిలిచింది.

మాణిక్యం కూతుర్ని కిందినుంచి పైవరకూ చూసింది.

''రేఖా! నీవు చదువు చాలించి మీ అమ్మతో వెళ్ళి ఆమె చూపించినవాణ్ణి పెళ్ళిచేసుకుంటావా? లేకపోతే ఇక్కడే ఉండి బి.ఏ. వరకూ చదువుకుంటావా?" మంజరీదేవి రేఖను కూర్చోమని కుర్చీ చూపించింది.

రేఖ విస్మయానికి అంతులేకుండాపోయింది. యాదమ్మ గదిలోనుంచి తనను దేవిడిలోని గదిలో ప్రవేశపెట్టిననాడూ-తను అడగకుండానే పది వాయిల్ చీరెలు, జాకెట్లూ ఇచ్చిననాడూ ఎంత ఆలోచించినా తనకు ఆమె అర్థముకాలేదు.ఈనాడు బి.ఏ. వరకూ చదవమన్న ప్రోద్బలానికికూడా తను ఊహించలేని అర్థమేదయినా ఉందేమో! శ్రీమంతులకు ఆగ్రహమెప్పుడు వస్తుందో–అనుగ్రహమెప్పుడు కలుగుతుందో ఎవరయినా చెప్పగలిగారా ఇంతవరకు? కాని-మంజరీదేవి అన్నమాట చెల్లించింది. ఇంతవరకు ఆమె వాగ్దానము చేస్తే అయిందన్నమాటే, ఏమాత్రం సందేహించవలసిన పనిలేదు

"ఏం రేఖా! మాట్లాడవేం?"

''చదువు చెప్పిస్తే చదువుకుంటానమ్మా." జంకుతూనే జవాబిచ్చింది.

"మీ అమ్మనుకూడా ఒప్పించు, నీ మాట ఒక్కటే చాలదుగా!" మంజరీదేవి కచ్చితమైన జవాబు కోరినట్లుగా అడిగింది.

తల్లివైపు చూసింది రేఖ. మాణిక్యం తలవంచుకొని పైటచెంగులోని దారాలను లాగుతూ శూన్యంలోకి చూస్తున్నది.

"అమ్మా!" అన్నది రేఖ అదురుతున్న పెదవులతో.

"తల్లీ! నా పరిస్థితులనుబట్టి నేనొక పథకం వేసుకుని నిన్ను తీసుకుపోవటానికి వచ్చాను. నీకింకా చదువుకోవాలన్న కోరికఉంటే మంజరీదేవిగారు చదివిస్తానని అంటే మీ మధ్య నేను అడ్డుపడను. కాని—మన స్థితిగతులు ఆలోచిస్తే మాత్రం నీవు వెంటనే పెళ్ళిచేసుకుంటేనే మంచిదని నా ఉద్దేశ్యం" తేల్చి చెప్పినట్లుగా అన్నది మాణిక్యం.

"మీ అమ్మ గట్టిగా రమ్మంటున్నది. వెళ్ళు రేఖా! పైచదువు చదువుకుని బాగుపడతావని నేనన్నానుగాని బలవంతం ఎలా చెయ్యగలను? మీరిద్దరూ బాగా ఆలోచించుకొని నాకు చెప్పండి." చివాలున లేచి తన గదిలోకి వెళ్ళిపోయింది మంజరీదేవి.

ఇద్దరిమధ్యా నిశ్శబ్దము కొంత సేపు సంచరించింది.

మంజరీదేవి మధ్యలో లేచి వెళ్ళటంతో రేఖకు ముందు చదువుపట్ల ఆసక్తి రెండింతలయినట్లయింది. ఆ సదవకాశాన్ని చేతులారా పోగొట్టుకోదలచలేదు.

"అమ్మా, నాలుగంటే నాలుగేళ్ళు ఓపికపట్టమ్మా. నీకంతగా కామేశ్వరీదేవిగారి దగ్గర ఉండటం ఇష్టంలేకపోతే అన్నయ్యదగ్గరికి బొంబాయి వెళ్ళమ్మా." ప్రాధేయపడ్డది రేఖ.

"ఈ వయసులో-ఈ పరిస్థితులలో నాకు కష్టమూ, ఇష్టమూ అనేవి ఉన్నాయా? అసలివి నా జీవితంలో నేను చవిచూసి ఎరుగను. పరిస్థితుల వలలో చిక్కిన పిట్టను నేను. బాల్యమూ యవ్వనము అలాగే గడిచాయి. ఈ దశా అంతే." పెదవి విరుస్తూ అన్నది మాణిక్యం.

"నీ మనసంత కష్టపెట్టుకోకు నీవు. కష్టపెట్టుకోవలసినంత క్లిష్టపరిస్థితులు ఇప్పుడేమీలేవు. నీవు నిశ్చింతగా ఉండు. తొందరపడితే తరువాత చింతించాల్సి వస్తుంది. గడిచినరోజు మళ్ళీరాదు. చెయ్యిజారిన అవకాశము తిరిగి చేజిక్కదు." రేఖ కొంచెము విసురుగా అన్నది.

"అయితే సరే. నీ అదృష్టాన్నీ నీకున్న అవకాశాలనూ పాడుచేశానన్న పేరు నాకు వద్దు. రేపు పొద్దున్నే నేను వచ్చిన దారినే వెళ్తాను. ఈ నాలుగేళ్లల్లో మనము తిరిగి కలుసుకోలేకపోవచ్చు. నిన్ను మంజరీదేవిగారు పంపరు. నన్ను కామేశ్వరీదేవిగారూ పంపరు. నేను మాటిమాటికీ ఉత్తరాలు వ్రాయటాన్ని మంజరీదేవిగారు హర్షించరు. నీవే నీ క్షేమసమాచారం వ్రాస్తూ ఉండు." మాణిక్యం ముఖమ్మీద నిర్లిప్తత పొడచూపింది.

తల్లి ముఖంలోకి చూసిన రేఖ మనసులో బాధపడినా తన మనో నిశ్చయాన్ని మాత్రం సడలించ దలచక తన గదిని చేరుకున్నది.

ఆ రాత్రి భోజనంచేసి తమలపాకు సేవిస్తున్న మంజరీదేవి రేఖ నిశ్చయాన్ని విని మందహాసం చేసింది.

"బాగుపడతావు" అన్నది రేఖవైపు ఒక వింతచూపు చూస్తూ.

* * *

"మీ చదువుకు నేను అడ్డం రావటంలేదుకదా !"

"లేదు లేదు. మీరు రెండురోజులకొకసారైనా పైకివచ్చి మమ్మల్ని పలకరించి పోతూ ఉండండి." లేచి నిలబడ్డది జోసఫిన్, మంజరీదేవిని చూడగానే.

హాల్లో కిటికీకి దగ్గరగా ఉన్న బల్లకు చెరొకవైపు కుర్చీలు వేసుకుని కూర్చున్నారు గిరిబాబు జోసఫిన్‌లు.

"మీరెందుకు లేచారు? నేనిలా కుర్చుంటా" నని మంజరీదేవి ఆ దగ్గరలో ఉన్న మరొక కుర్చీలో కూర్చుంది.

"గిరిబాబుకు సంగీతంలో చాలా అభిరుచి ఉంది. పాటలు రాగంతో నేర్చుకుని నాతోకూడా పాడగలుగుతున్నాడు. ఒక ఆర్గన్ కొనిపెట్టాలి మీరు. ఫిడిల్ కూడా పనిలో పనిగా కొనండి. మరొక సంగతి, ఇతడికి చిత్రకళలో కూడా బాగా అభిరుచి కలిగింది. దానికి తగిన ఏర్పాట్లు చెయ్యాలి. మనం కొన్న టైపురైటర్ని బాగా ఉపయోగిస్తున్నాడు గిరిబాబు. స్పీడ్‌కూడా హెచ్చింది." జోసఫిన్ ఒక్కొక్క విషయము చెప్తున్నకొద్దీ మంజరీదేవి ఆశ్చర్యపోతున్నది.

"పిల్లవాడికి తెలివితేటలున్నాయి. ఒక్కసారి చెబితే గ్రహించేశక్తి బాగా ఉంది. సహజంగా లలిత కళలో పుట్టుకతో వచ్చిన నైపుణ్యం ఉంది. వాటి నన్నిటినీ బైటికి తీసి మంచి దోహదమివ్వాలి." జోసఫిన్ టీచరుగా తన బాధ్యత అనుకుని చెప్పుకుంటూ పోతున్నది.

మంజరీదేవికి ఆనందసాగరంలో మునకలు వేస్తున్నట్టుంది. జోసఫిన్ వచ్చిన రెండేళ్ళలో పిల్లవాడు చాలా ప్రగతిని సాధించాడు. కరెస్పాండెన్సు కోర్సులో బి.ఎ. కు గిరిబాబును ప్రవేశపెట్టాలని యూనివర్సిటీతో సంప్రతింపులు జరుపుతున్నది జోసఫిన్. తన కళ్ళయెదుటనే ఇంట్లోనే ఉండి గిరిబాబు నేర్వని విద్య లేదన్నట్టుగా అన్ని విద్యలూ లలితకళలతో సహా వశంచేసుకుంటున్నాడు.

తాంబూలంవల్ల ఎరుపెక్కిన మంజరీదేవి పెదవులమీద సంతోషం వెల్లువై ప్రవహించినట్లు దానిని అతి కష్టమ్మీద నిగ్రహించుకున్నట్టూ చిహ్నాలు పొడచూపాయి.

కాని అంతలోనే విచారరేఖలు, విషాదరేఖలు ముఖమంతా అలుముకు పోయాయి.

ఎన్ని విద్యలు నేర్చితే ఏంలాభం? తన బిడ్డ నలుగురితోపాటు బహిరంగగా విహరించలేడు. నలుగురిలో తన ప్రజ్ఞలు చూపించలేడు ? పదిమందిలో తల యెత్తుకుని తిరగలేడు. ఆమె ఆలోచనలను జోసఫిన్ కనిపెట్టింది. "మీరు అనవసరంగా బాధపడుతూ గిరిబాబును కూడా బాధపెడుతున్నారు. ఇందులో అభిమానపడవలసింది, కించపడవలసిందికూడా ఏమీ లేదు. అతడి శారీరకమైన వైపరీత్యాన్నికాదు మనం చూడవలసింది. అతడి మానసికమైన పెరుగుదలను గురించి ఆలోచించాలి. అతడు మేధావి. అతడు వేసే ప్రశ్నలకు జవాబులు నా మన స్తత్వ గ్రంథాలలో కొన్ని కనబడటంలేదు. టీచరుగా నా అనుభ వాలను త్రవ్వి త్రవ్వి చూసుకోవలసి వస్తోంది. డబ్బు ఖర్చయినా అతడికి మీరు కొనిపెట్టిన గ్రంథాల నన్నిటినీ క్షుణ్ణంగా చదివి తనకు కలిగిన సందే హాలను నాతో చెబుతూ ఉంటాడు."

మంజరీదేవి నోరు తెరిచింది తెరిచినట్లే ఉంది.

"నా కంటె ముందు చదివించిన టీచరు మీ భాషను బాగా నేర్పించినట్లు న్నారు. దాని అభివృద్ధి నా వల్లకాదు కదా. కాని గిరిబాబువద్ద నేను మీ భాష మాట్లాడటం, కొద్దిగా వ్రాయటం నేర్చుకుంటున్నాను. ఉన్నమాట మరొకటి చెప్తు న్నాను. మీ దేశీయులు ఆంగ్లభాష నేరుస్తారు. పండితులవుతారు. గాని ఉచ్చా రణ మాత్రం స్వచ్ఛంగా వుండదు. ఇతడు స్వచ్ఛమైన ఉచ్చారణతో ఇంగ్లీషు మాట్లాడగలడు."

మంజరీదేవి తన ఆంగ్లభాష ఉచ్చారణను గురించి పరిశీలన చేసుకుంటు న్నది. అవునేమో ! ఎవరి లోపాలు వారికి తెలియవు కదా ! తనకెంత ఆత్మ విశ్వాసం వుండేది, తన చదువుపట్ల, సంస్కృతిపట్ల జోసఫిన్. మాటల ప్రభావం గిరిబాబుమీద బాగా పడ్డదనుకున్నది మంజరీదేవి. అతడికి సంస్కృ తాంధ్ర భాషలలో కూడా చక్కని విజ్ఞానాన్ని కలిగించాలి. తమ ఆస్థానంలో పండిత సన్మానాలు ఉన్నంతవరకూ పండితులు కనబడేవారు. మరి ఇప్పుడు కవి పండిత సన్మానాలు గోపాలకృష్ణరాయడి అంతర్థానంతో తను మానుకున్నది. అందరి ముందర తన దురదృష్టం బయటపడి పోవటాన్ని ఆమె సహించలేదు.

సరిగ్గా పదిహేనురోజుల క్రిందట ఒకనాడు ఆమె డాక్టరు సదాశివరావును పిలిపించింది.

"మీరు అనుమతిస్తే నేను ఒక పని చేయాలనుకుంటున్నాను. ఎంతకాలం నుంచో నేనీ అవకాశంకొరకు ఎదురుచూస్తున్నాను, ఏమంటారు ?" అన్నాడు మంజరీదేవి ఇచ్చిన బ్రూ కాఫీ తాగుతూ

ఏమిటన్నట్టు చూచిందామె కనుబొమలు పైకెత్తి. "హైదరాబాదులో జరిగే మెడికల్ కాన్ఫరెన్సుకు ముగ్గురు వైద్య నిపుణులు వస్తున్నారు. ఒకరు ఎండ్రో క్రైనాలిజిస్టు, రెండవవారు న్యూరోసర్జన్, మూడవవారు న్యూరాలిజిస్టు. ఈ ముగ్గురూ కూడా అంతర్జాతీయంగా ప్రఖ్యాతి గలవారు. వారిని నేను కారులో ఇక్కడికి తీసుకువచ్చి గిరిబాబును చూపించి తిరిగి హైదరాబాదుకు చేర్చే ఏర్పాటు చేయగలను. అందుకు మీరు అనుమతించి సహకరిస్తే మనకు మంచి నిపుణుల సలహా లభిస్తుంది." అన్నాడు ఆశగా చూస్తూ.

"ఆ నిపుణులు ఇంత దూరం వస్తారా ?" సందేహించింది మంజరీదేవి.

"ఎందుకు రారు ? వారంతా నా స్నేహితులు. నాకు అదృష్టం వక్రించి ఈ ఊరికి డాక్టరుగా వచ్చాను. వాళ్ళకు మంచి అవకాశాలు లభించాయి. వాటిని ఉపయోగించుకుని లాభం పొందారు విదేశాలలో పరిశోధనలు చేశారు. డిగ్రీల పైన డిగ్రీలందుకున్నారు. తమవాళ్ళందరిని చూసినట్లుంటుందని ఈ కాన్ఫరెన్సుకు ఆహ్వానం పోగానే అంగీకరించి వస్తున్నారు. నేను ఈ కేసు విషయంలో వాళ్ళను సంప్రదించి తీసుకువస్తాను. అసలు పరిశోధనలకేమి - డాక్టర్లకేమి ఒక అసాధారణమైన విషయమేదయినా కంటికి కనిపిస్తే-లేక తెలిస్తే వెళ్ళి చూడాలన్న కుతూహలం సామాన్యంగా పుడుతుందికదా ? మీరు సందేహించకండి. ఆ భారము నా పైన పెట్టండి, నేను తీసుకువస్తానుగా!" నమ్మకంగా నెమ్మదిగా ఆమెతో చెబుతున్నాడు డాక్టరు

అసాధారణము-కుతూహలము-ఈ రెండు మాటలు చెవినపడగానే గుండె చెరువయిపోయింది మంజరీదేవికి. వెంటనే అభిమానం తలఎత్తింది. తన కుమారుడి పట్ల వాళ్ళకు సానుభూతిలేదు. కాని కుతూహలము ఉన్నది ! ఎంత క్రూరం ! భరించలేక కళ్లుమూసుకుని తల అడ్డంగా తిప్పింది.

ఆమె ముఖకవళికలను గమనించాడు డాక్టరు. వైద్యంతోపాటు వైద్యులు మనస్తత్వశాస్త్రాన్నికూడా రోగులపైన ప్రయోగించి చూస్తారు. అందులో శ్రీమంతుల ఇళ్ళల్లో వైద్యం చేయాలంటే వైద్యంకంటె మనస్తత్వశాస్త్రమే ఎక్కువగా ఉపకరించి మంచి ఫలితాలను ఇస్తుంది. డాక్టరు సదాశివరావు పరీక్షలలో అపజయం పొందుతూ ఆలస్యంగా కోర్సు పూర్తిచేసినా మానవ నైజాన్ని బాగా కాచివడపోసినవాడు.

"మీ ఆంతర్యాన్ని నేను గ్రహించగలిగాను. మీ సమస్యను తీర్చగ్గలిగిన శక్తి వాళ్ళకు ఉన్నదా లేదా? అంతర్జాతీయంగా కీర్తిగలవాళ్ళమని ఊరికే డబ్బు వ్రాయించుకుంటున్నారా? ఇది తెలుసుకుందామన్న కుతూహలంకంటె వాళ్ళ అనుభవంతో కూడిన సలహా మీకు ఇప్పిద్దామన్న ఆశే నాకు అధికంగా ఉంది. నాకు తోచినది వాళ్ళకు తోచవచ్చు కదా. సెకండ్ ఒపినియన్ తీసుకోవటం మా సంప్రదాయమే.'' చాల నమ్రతతో ఆమెకు నమ్మకం కలిగించేటట్టుగా అన్నాడు.

"మీరింతగా చెబుతున్నారు కనుక నేనందుకు అంగీకరిస్తున్నాను—అదీ ఒక షరతుపైన. గిరిబాబును వాళ్ళు రోగిని పరీక్షించినట్టు పరీక్ష చేయగూడదు. వాళ్ళందరూ తనను చూడటానికే వస్తున్నారని గిరిబాబుకు తెలియకుండా చెయ్యాలి. మీరు వెంబడి పెట్టుకుని వస్తే వాడు గ్రహించేస్తాడు. మీరెలా చేస్తారో ఆలోచించండి," అన్నది అధికారపూర్వకంగా

ఆలోచనలో పడిపోయాడు డాక్టరు. శ్రీమంతులకు అన్నిటిలో అధికారము లభిస్తే ఎట్లాఉంటుందో చవిచూసినట్లయింది.

కొంత సేపటికి సరే అన్నాడు. ఇంతదూరమూ చర్చించి వైద్యమంటే ఏమీ తెలియని ఆమె ముందర తలఒగ్గ దలచలేదు.

డాక్టరు వెళ్ళటానికి లేస్తూఉండగా "మా కారు పెద్దది. పదిమందయినా కూర్చోవచ్చు. మంచి కండిషన్‌లో ఉంది కనుక మీరు ఆ కారు తీసుకెళ్ళండి. మీరు వచ్చేసరికి నేను భోజనం ఏర్పాట్లు చేస్తాను. వాళ్ళను భోజన సమయానికి ఇక్కడికి తీసుకరండి." అంతలో డాక్టరుకు ఆశ్చర్యం కలిగేటట్లుగా శాంతం వహించి జమీందారిణికుండే సహజమైన వితరణబుద్ధితో అన్నది మంజరీదేవి.

ఆ సాయంకాలము డాక్టరు కారులో వెళ్ళాడు. మరునాడు మధ్యాహ్నం ఒంటిగంటవరకూ ముగ్గురు వైద్యనిపుణులతో డాక్టరు సదాశివరావు దేవిడీ ముందర దిగాడు.

డాక్టరు దారిపొడుగునా ఆలోచించిన విధంగా మంజరీదేవితో చెప్పాడు—తాను కిందనే ఉంటాననీ, వచ్చిన ముగ్గురు వైద్యనిపుణులూ జోసఫిన్ స్నేహితులుగా గిరిబాబుకు పరిచయము చేయవలసినదనీ ఈ సంగతి ముందుగా జోసఫిన్‌కు తెలియజేయవలసినదనీను.

మంజరీదేవికి ఈ ఉపాయము నచ్చింది. జోసఫిన్‌తో సంగతంతా చెప్పింది. విందుభోజనం పైన ఏర్పాటుచేసింది.

అంతకుముందే షరతులన్నీ సదాశివరావుద్వారా విన్నందువల్ల ముగ్గురు వైద్యనిపుణులూ అందుకు తగినట్లే గిరిబాబుతో కబుర్లుచెబుతూ-జోసఫిన్‌ను కుశలప్రశ్నలువేస్తూ- విందారగిస్తూ అతడిని గమనిస్తున్నారు.

అతడి కా స్థితి ఎందుకు వచ్చినట్లు?

హీన పోషకాహారంవల్ల వచ్చిందనుకుందామా ? డాక్టరు సదాశివరావు గిరిబాబు పుట్టినప్పటినుంచీ తీసుకుంటున్న ఆహారాన్నిగురించీ టానిక్కులను గురించీ వివరంగా చెప్పాడు. పైగా ఆ లక్షణాలు కనబడటంలేదు పిల్లవాడిలో. కనుక అది కారణంకాదు. కనుక ఇతర కారణాలు వెదకాలి. వాళ్ళకు తోచిన కారణాలవల్ల అయినట్లయితే గిరిబాబు ఇంతటి మేధావిగా ఉండటానికి వీలులేదు— అది అసంభవము. అతడికి వయసువల్ల ముఖము ముదిరినట్లు కనబడుతున్నది- అతడి ఎత్తుకు తగినట్లుకాక వయసుకు తగని అవయవ నిర్మాణమున్నది.

నవ్వులతో కబుర్లతో భోజనాలు ముగిశాయి. కిందికి దిగివచ్చారు. వాళ్ళు ఏంచెప్పనున్నారో ననుకుంటూ మంజరీదేవి తన సహజకుతూహలాన్ని పైకి కనబడనీయకుండా ఎదురుచూస్తున్నది.

సదాశివరావు భుజంపైన చెయ్యివేస్తూ—"దీనికి మెదడులో పిట్యూటరీ గ్లాండ్ తన విధిని సక్రమంగా నిర్వహించకపోవటమే కారణం గాని మరొకటికాదు. దానిని బాల్యంనుండీ గమనించి తగిన వైద్యంచేస్తే ఈ పరిస్థితి కలిగేది కాదేమో! కాని బాల్యంలో దీన్ని తెలుసుకోవటం కష్టం" అన్నాడు ఎండ్రొక్రైనాలజిస్టు. మిగతా ఇద్దరూ తలలూపారు.

చివ్వున తలెత్తి చూసింది మంజరీదేవి. కళ్ళల్లో నీటిపొర తేలియాడింది. "అయితే ఇప్పుడు చేయగలిగింది ఏమైనా ఉన్నదా?'' దీనంగా ఉందామె ముఖము.

"ఇప్పుడు మనమేమీ చేయలేము. కాని ఇప్పుడు అతడికి లోపమేమున్నది? బాగా చదువుతున్నాడు, మహా చురుకుగా ఉన్నాడు, తెలివితేటలూ వివేకమూ మేధ గలవాడు. వయసుకు తగిన పొడుగులేదు అంతేగా!" అన్నాడు న్యూరాలజిస్టు.

ఆమె ఇంక పట్టలేకపోయింది. "అయ్యో! నా దురదృష్టాన్ని మీకెలా చెప్పను?" అంటూ కన్నీరు కారుస్తూ తన పరిస్థితినంతా ఏకరువుపెట్టింది. తనను పీడిస్తున్న సందేహాన్ని తీర్చుకోవటంకోసం "గిరిబాబుకు పెళ్ళిచేయవచ్చునా?'' అడిగి నాలుక కరచుకున్నది.

"ఓ! దానికేం, తప్పకుండా పెళ్ళిచేయండి. సంతానంకూడా కలగవచ్చు." ముగ్గురూ ఒక్కసారే అన్నారు.

మంజరీదేవికి మనసులోఉన్న అలజడి కొంతవరకూ తగ్గింది. వాళ్ళకు విందు ఏర్పాట్లుచేసింది. అందరినీ హాల్లో సోఫాలమీద కూర్చోమని ఆహ్వానించింది. వాళ్ళను తన కారులోనే పంపుతూ వచ్చినందుకు కృతజ్ఞతలు తెలిపింది. కారు కనుచూపుమేర దాటేవరకూ మెట్లమీదనే నిలబడ్డది.

వాళ్ళు వెళ్ళగానే ఆమె కెదురయిన ప్రశ్న గిరిబాబుకు పెళ్ళి ఎట్లా అవుతుంది?

ఈ ప్రశ్న—పదిహేనుకోజులక్రిందట ఉదయించిందే-గాని ఇప్పుడు వెయ్యి రెట్లు అధికంగా బాధించటం మొదలుపెట్టింది. ఆ రాత్రంతా మంజరీదేవి దీన్ని గురించి ఆలోచిస్తూనే ఉన్నది. తెల్లవారేసరికి ఒక పరిష్కారమార్గం లభించినట్టుగా మనసు ప్రశాంతమయింది. ఉదయం లేస్తూనే ముత్తిచేత కబురుపంపి రేఖను తన గదిలోకి పిలిపించుకున్నది.

"రేఖా! ఇవాళ శుక్రవారము. తలంటి నీళ్ళుపోసుకొని కొత్త చీరె కట్టుకో. దేవాలయానికి వెళ్ళి కొబ్బరికాయ కొట్టివద్దాము. చూడు! ఇవాళ్టినుంచి నీవు నా పక్కగదిలో ఉండు. ఈడువచ్చిన పిల్లవు. ఎక్కడో దూరంగా యాదమ్మ గదిలో ఉండటము నాకు బాగుండలేదు" అన్నది ఎంతో ఆప్యాయంగా.

రెండు గుడ్లూ ఒప్పగించి నిలబడిపోయింది రేఖ ఆశ్చర్యంతో.

*      *      *

అప్పుడే స్కూల్లో అడుగుపెట్టిన రేఖను చూడగానే దమయంతి కళ్ళు గుండ్రంగా తిప్పుతూ "ఓహో!" అన్నది.

"ఏమోయ్ రేఖా! ఏమిటి విశేషం? ఇవాళ ఈ వేషంలో వచ్చావు? మీ అమ్మగారు కొత్తచీరెలు కొని పంపించారా?" అన్నది కామాక్షి. రేఖ తల్లి పరిస్థితులెటువంటివో కామాక్షికి బాగా తెలుసు. అయినా నిజమేమిటో చెప్పించాలని ఒక బాణం విసిరింది.

రేఖ మనసు ఉడికినట్లయింది. తన పరిస్థితులు తెలిసే వాళ్ళిద్దరూ అలా అంటున్నారని గ్రహించింది. కన్నీళ్ల రాలబోతుంటే అణుచుకుంటూ అన్నది "నాకు కన్నీళ్లు తెప్పించారు. మీ సరదా తీరిందా? ఇంకా ఉందా?" జాలి గొలుపుతున్న చూపులతో ఇద్దరినీ పోనీయకుండా ఆపింది.

"చీరె చూడటానికి బాగుంది. ఈ చీరె కట్టుకున్న నీవు ఇంకా అందంగా

ఉన్నావు. స్నేహాంకొద్దీ సరదాకు అంటే అప్పుడే కన్నీరు కార్చాలా?" వీపు మీద తట్టింది కామాక్షి.

"ఎట్లాగూ అడిగి చెడ్డవాళ్ళమనిపించుకున్నాంగాని-ఎక్కడిది చెప్పవూ?" అన్నది దమయంతి.

"మంజరీదేవిగారు ఇచ్చారు" అన్నది తలవంచుకుని రేఖ.

"అవున్లే, కాలేజికి పంపుతూ ఈమాత్రం చీరెలయినా కొనిపెట్టకపోతే ఎలా? ఎట్లాగయినా పెద్దయింటినుంచి వస్తున్నావు కనుక ఆ యింటి గౌరవానికి తగినట్టుగా ఉండాలికదా అన్నీ?" మళ్ళీ అందుకున్నది దమయంతి కామాక్షి వద్దని కళ్ళతో సైగచేసినా లెక్కచెయ్యకుండా.

ముగ్గురూ బస్సులో పొరుగూరువెళ్ళి కాలేజిచదువు చదువుతున్నారు. చదువు కోవటం తప్ప మిగతా ఆలోచనలను రేఖ తన మనసులో చొరబడనివ్వకుండా జాగ్రత్తపడుతున్నది. దమయంతి కామాక్షిలమాదిరిగా సరదాలకూ వినోదాలకూ మనసులో చోటివ్వటంలేదు. ఇరవైనాలుగు గంటలూ తాను చదువు కోసమే ఆ ఊరిలో—ఆ యింట్లో — ఉంటున్నదన్న విషయాన్ని మనసులో పెట్టుకునే మసలుకుంటుంది.

కాలేజిలో మామూలుగా ఉండే విద్యార్థినీ సంఘాలు—వాటి ఎన్నికలూ—వాటి సాంస్కృతిక కార్యక్రమాలు మొదట రేఖను ఆకర్షించలేదు. కాని విద్యార్థినులు రేఖను విడిచిపెట్టలేదు. నాటకాలు వేయటానికి రమ్మనీ, వ్యాసపోటీలలో, వక్తృత్వపోటీలలో పాల్గొనమనీ, పాటలు పాడమనీ వేధించటం మొదలు పెట్టారు. అంతమంది విద్యార్థినులు ఏకమై ఒత్తిడిచేస్తుంటే ఒప్పుకోక తప్పింది కాదు రేఖకు. ఉపాధ్యాయినుల ఆజ్ఞలను మీరలేకపోయింది. ఆ కళాశాలలో ఒక అధ్యాపకురాలు లలితసంగీతంలో నిధి. విద్యార్థినులు చాలామంది ఆమెవద్ద ప్రైవేటుగా శిక్షణపొందటం మొదలుపెట్టారు. శాస్త్రీయ సంగీతం కొంత వచ్చిన రేఖకు లలితసంగీతం కష్టమనిపించలేదు. వార్షికోత్సవాలలో రాణీసంయుక్త నాటకం ప్రదర్శనలో రేఖ రాణీసంయుక్త పాత్రకు ఎన్నికయింది. ప్రేమి వివాహాలు మంచివా లేక పెద్దలు ఏర్పాటుచేసిన వివాహాలు మంచివా అన్న విషయం పైన వక్తలత్వపోటీలో పాల్గొనటానికీ, లలితసంగీతపోటీలో పాల్గొనటానికీ విద్యార్థినీవర్గంతోపాటు ఉపాధ్యాయవర్గంకూడా రేఖను ఎన్నికచేసాయి. బల వంతంగా ఎన్నిక అయిన రేఖ తన శక్త్యనుసారం కృషిచేయక తప్పలేదు.

స్కూలులో గడిచినట్టుగా కాలేజిలో రోజులు భారంగా గడవటంలేదు రేఖకు.

దేనిలోనో ఒకదానిలో పోటీ-దానిలో ఎవరో బలవంతంగా చేర్చటం-రేఖ గెలు పొందటం జరుగుతోంది. దానివల్ల సహజంగా ఉత్సాహం పెంపొందటం మొదలు పెట్టింది రేఖలో. నలుగురితోపాటు నవ్వటం-నలుగురిలో ముఖం ముడుచుకొని కూర్చోకుండా వినోదకాలక్షేపం చేయటం క్రమంగా రేఖకు అలవాటు కాసాగింది. ఇప్పుడు దమయంతీ, కామాక్షులను తానే ఆటలు పట్టించేవరకూ వచ్చింది.

కాలేజి చదువులో ప్రవేశించి చూస్తూ చూస్తూ ఉండగానే మూడవసంవత్సరం ఆరంభమయింది.

రేఖలో కలుగుతూవచ్చిన నూతనోత్సాహాన్ని, క్రమ వికాసాన్నీ మంజరీదేవి గ్రహించింది. రేఖకు తెలియకుండా ఆమె చదువును గురించీ మిగతా విషయాలను గురించీ మంజరీదేవి రిపోర్టులను తెప్పించుకుంటునే ఉన్నది. అప్పుడప్పుడు రేఖ కాలేజినుంచి రాగానే ఆమెను పలకరించి మాట్లాడించాలన్న ఉద్దేశ్యంతో సంభాషణలోకి దింపి కాలేజి కబుర్లు అడుగుతూ ఉంటుంది. ఇద్దరి మధ్యా కొద్దిగా చనువు ఏర్పడటము ఆ దేవిడీ నౌకర్లనుకూడా ఆశ్చర్యపరుస్తున్నది. అయినా రేఖ కాలేజినుంచి రాగానే తనగదిలో తలుపులు వేసుకుని కుట్టుపని చూసుకుంటూనో-చదువుకుంటూనో కాలక్షేపం చేస్తుంది.

"మమ్మల్ని ఒక్కసారయినా మీ యింటికి రమ్మని పిలవవేందుకు రేఖా?" దమయంతికి ఆ రోజు విరామం దొరికింది రేఖను ఏడిపించటానికి.

గంభీరంగా ఉన్న రేఖ అదొకమాదిరిగా ఆమె ముఖంలోకి చూసి మందహాసం చేసింది.

"మీ దేవిడీలో ఉండే చిత్రపటాలూ, బొమ్మలూ, అందమైన వస్తువులూ మాకు ఒకరోజు చూపించవా? మంచి పూలతోట ఉన్నదటకదా! ఒకపక్క ఈతకొలను ఉన్నదటకదా! ఈ ఆదివారం శకుంతలనూ, రమనూకూడా తీసుకు రామా దేవిడీకి? అన్నీ చూపిస్తావుకదూ?" మురుస్తూ అడిగింది దమయంతి.

"అవన్నీ నాకే తెలియవు. ఇంతవరకూ ఆ గదితప్ప నేనేదీ చూడలేదు. ఇంక మీకేం చూపించను?" మాట తప్పించుకోచూసింది రేఖ.

"కాదులే. మాకు చూపించటం ఇష్టంలేదనరాదూ? ఎంతయినా నీవు రేఖవే!"

"అంటే?" కళ్ళు పెద్దవిచేసి చూసింది రేఖ.

"అంటేనా? కొంటే! రేఖంటే గీత. వంకరలేని నిడుపైన గీత. ఇటూ అటూ వంగని కడ్డీ." వెక్కిరించింది దమయంతి. అంతలో మరో పదిమంది వచ్చి చేరారు. దమయంతి మాటను వాళ్ళందరూ బలపరచారు.

రేఖ ఎంత తప్పించుకోవటానికి ప్రయత్నాలుచేసినా ఫలించలేదు

"ఒక షరతు. ఆ దేవిడీలో ఏమేమున్నదో నన్ను ముందు చూడనీయండి. నేను చూసినతరువాత మంజరీదేవిగారిని అడిగి మిమ్మల్ని తీసుకవెళ్తాను. ఆమె ఇష్టపడకపోతే మాత్రం నన్ను నిందించకండి. ఒప్పుకుంటారా?"

''నీకు అభ్యంతరం ఉంటుందిగాని ఆమెకేమీ ఉండదనుకుంటాను. అంతే కదూ?'' భుజంమీద చెయ్యివేస్తూ అడిగింది శకుంతల

"యజమానురాలిని అడగవద్దా? నా శక్తికి మించి నేను వాగ్దానాలు చెయ్యను మీకు కోపము వచ్చినా సరే. నేను మీ అందరిమాదిరిగా తలిదండ్రులదగ్గర ఉండి అధికారపూర్వకంగా ఆదరణలతో బ్రతుకుతున్నాననుకుంటున్నారా? యజమానురాలి దానదయాభిక్షంతో చదువుకుంటున్నాను వారింట ఉంటున్నాను. ఇంతకంటె నాచేత ఏమీ చెప్పించకండి.''చిన్నబోయిన ముఖంతో తల పక్కకు తిప్పుకుంటూ అన్నది రేఖ.

''పోనీలేవోయ్! నీకంత కష్టంగాఉంటే వద్దులే. రండర్రా పోదాము ఇంక రేఖను బలవంతం చెయ్యనద్దు. పాపం. ఊరికే రేఖవెంబడి పడుతున్నారేమిటి అందరూ?" అప్పుడే అక్కడికి వచ్చిన కామాక్షి అందరినీ వారించింది

"ఇందులో తప్పేముంది? చూపించమని అడిగితేనే తప్పా?" మూతి మూడు వంకరలు తిప్పింది రమ.

ఇది జరిగి పదిరోజులయింది. రేఖ అటువంటి ప్రయత్నమేమీ చెయ్యలేక పోయింది.

భోజనాలు చేసేహాలుకు పక్కగా పూజగది ఉన్నది. మంజరీదేవి ఆ గదిలో ఉన్న దేవుడి పటాలకూ, విగ్రహాలకూ ప్రతి శుక్రవారమూ పూలదండలు మార్చి కొత్తవాటితో అలంకరిస్తూ ఉంటుంది. ఈ పూలదండలు కట్టే పనీ-పూలు తోటలో నుండి కోసుకువచ్చే పనీ ముత్తిది. కాని ఈ మధ్య ఆమె అనారోగ్యంవల్ల యాదమ్మ చేస్తున్నది.

ఆ శుక్రవారంనాడు కృష్ణాష్టమి కలిసివచ్చింది. మంజరీదేవి సూర్యోదయానికి పూర్వమే తలార స్నానముచేసి కొబ్బరికాయలూ, మందారపుష్పాలూ తీసుకుని కారుమీద దేవాలయానికి వెళ్లుతూ దండలు కట్టమని యాదమ్మకు చెప్పింది. యాదమ్మ వెళ్లుతూవుంటే రేఖకూడా ఒక చిన్న బుట్ట తీసుకుని పూలు కొయ్యటానికి తోటలోకి వెళ్ళింది. రకరకాల పూలు-రంగురంగుల పూలు కోసి బుట్ట నింపుతూ పోయింది. ఇంకా ముందుకు వెళ్ళి నందివర్ధనంపూలు కోయాలని

మెల్లగా దేవిడికి దక్షిణభాగంవైపుగాఉన్న చెట్లదగ్గరకు వెళ్ళింది. పూలు కనబడు తున్నకొద్దీ ఇంకా ఇంకా కొయ్యాలనే ఆశతో తొందరతొందరగా కోస్తున్నది.

ఎక్కడినుంచో పాటలు వినబడుతున్నయి.

ఇటూ అటూ చూసి తలపైకెత్తింది రేఖ.

ఒక ఆడగొంతు ఒక మగగొంతు కలిసి పాడే ఇంగ్లీషుపాట. మధ్య మధ్య పియానోవాద్యం!

అక్కడే నిలబడి తన్మయురాలై వినటం మొదలుపెట్టింది.

"రేఖమ్మా! ఓ రేఖమ్మా!"

యాదమ్మ పిలుపుతో ఉలిక్కిపడ్డది రేఖ. బుట్ట తీసుకుని గబగబా అడు గులువేస్తూ గదిని చేరుకున్నది.

"దొరసాని వచ్చేవేళయింది. తొందరగా దండలు గుచ్చాలి." యాదమ్మ తొందరపడుతున్నది.

"నేను కట్టిపెడతానే. కోప్పడకు" పళ్ళెంనిండా పూలు పోసుకుని దారంతో మాలలు కడుతూ కొంతసేపు ఆడగనా వద్దా అనుకుంటూ మథనపడిన రేఖ "యాదమ్మా!" అని పిలిచింది మెల్లగా.

"దొరసాని వస్తుంది. తొందరగా కట్టు" అన్నది సన్నగా యాదమ్మ.

"మాడు. దండలు కడుతున్నాలే. నీవు గుచ్చినదానికంటె బాగా కట్టి పెడతాను గాని–నే నోమాట అడుగుతాను. ఏమనుకోకుండా చెబుతావా?"

ఏమిటన్నట్టు చూసింది యాదమ్మ.

"మేడమీద ఎవరున్నారు? సంగీతం వినబడుతున్నది?"

గతుక్కుమన్నది యాదమ్మ. "ఈ పూలు ఎక్కడినుంచి కోసుకువచ్చావు?" భయంతో కళ్ళు పెదవిచేసి కనుబొమలు పైకెత్తింది యాదమ్మ.

"అటువైపు–అంటే ఎడమచేతివైపుగా వెళ్ళి ఈ నందివర్ధనాలన్నీ కోశాను. మరి ఇటువైపు చాలా లేవు." గబగబా దండలు కడుతోంది రేఖ.

"ఎడమచేతివైపు ఎందుకు వెళ్ళావు? దొరసానికి తెలిసిందంటే పీక నులిమే స్తుంది. ఏమనుకుంటున్నావో?" బెదిరించింది యాదమ్మ.

"నా కా సంగతి తెలియదు యాదమ్మా. నీవైనా చెప్పలేదు. అటు వెళ్ళ కూడదా?" భయపడుతూనే అడిగింది రేఖ.

"వెళ్ళకూడదు. దొరసాని ఆజ్ఞ!" ఇంచుమించుగా గర్జించింది యాదమ్మ.

ముఖం చిన్నబుచ్చుకుని దండలుకట్టి పళ్ళెంలో అమర్చింది రేఖ.

రాత్రిళ్లు గదితలుపులు లోపల గొళ్ళెంవేసుకుని పడుకుంటారు యాదమ్మా రేఖా. పడుకోబోతూ మెల్లగా అడిగింది రేఖ—"యాదమ్మా, పైన ఎవరుంటారో చెప్పవా? చాలా బాగా పాడుతున్నారు. ఆ సంగీతం వింటే నా ప్రాణం లేచి వచ్చినట్లయింది, ఎంతో బాగుంది. ఎవరున్నారో చెప్పవా?" బ్రతిమిలాడుతూ.

"మనకెందుకు రేఖమ్మా! ఆ సంగతులన్నీ? మన మానాన మనం మన పనులు చేసుకోవాలిగాని అవన్నీ ఎందుకు మనకు?" ముసుగుపెట్టుకుని పక్కకు తిరిగి పడుకుంది యాదమ్మ.

కుతూహలం రేఖను పడుకోనివ్వలేదు. మంచమ్మీద లేచి కూర్చుని "యాదమ్మా చెప్పవూ?'' మళ్ళీ అడిగింది.

యాదమ్మ కళ్లు నులుముకుంటూ లేచి కూర్చుంది. "మేడమీద దొరసాని కొడుకు ఉంటాడు. ఇంక పడుకో" అని తిరిగి ముసుగుపెట్టుకోబోయింది.

"ఆడగొంతుక్కూడా వినబడ్డదే? ఆమె ఎవరు? ఆయనకు పెళ్ళి అయిందా?"

"ఆయనకు పెళ్ళా? ఎంత ఉంటాడో తెలుసా? మూరెడు. ఆమె ఆయన టీచరు. ఇంగ్లీషు దొరసాని" ముసుగుపెట్టింది యాదమ్మ. మళ్ళీ అంతలోనే ముసుగుదీసి, "చూడు రేఖమ్మా! ఎవరితోనయినా అనేవు. ఏమీ తెలియనట్లే ఉండాలి ఏమనుకున్నావో?" కళ్ళు మూసుకుంది.

వాళ్ళనెప్పుడైనా చూడాలి. మూరెడు మనుషులుంటారా ఎక్కడైనా? ఊరికే తోటంతా ఇళ్ళంతా తిరగకుండా యాదమ్మ భయపెడుతున్నదేమో! ఒకవేళ ఉన్నారేమో! చూస్తే? ఎవరూ చూడకుండా మళ్ళీ ఒక్కసారి దక్షిణంవైపుగా ఉన్న తోటలోకి వెళ్ళాలి అనుకుంటూ నిద్రలోకి జారుకున్నది రేఖ.

* * *

ఆదివారం ఉదయము పదిగంటలవేళ—మార్చినెల ఎండలను ప్రజానీకానికి చవిచూపిస్తున్నది. రేఖ పరీక్షలకు దీక్షగా చదువుతున్నది. అప్పటికి స్నానం చేసి తలవెంట్రుకలు రిబ్బనుతో బంధించుకొని కిటికీ దగ్గరగా కూర్చున్నది. దేవిడీచుట్టూ పెద్దపెద్ద చెట్లు ఉండటంచేత చల్లగా ఉన్నది. పిల్లగాలులు అప్పుడప్పుడువచ్చి రేఖను పలకరించి పోతున్నాయి. రేఖ పుస్తకం చేతబట్టిందంటే తా నా పూట పూర్తిచేయదలచుకున్న భాగాలను క్షుణ్ణంగా చదివిగాని కూర్చున్న చోటినుండి లేవదు. అప్పటికి రెండు పేజీలు మాత్రమే మిగిలాయి చదవటానికి.

అయిదారు మాసాలనుండి మంజరీదేవి ఉదయం పదిగంటలనుండి పన్నెండు

గంటలవరకూ దేవాలయంలో పూజ చేసే అర్చకుడిని ఇంటికి పిలిపించుకుని భాగవతము చదివించుకుంటున్నది. ఈ భాగవతకథా కాలక్షేపము పూజగదిలోనే జరుగుతున్నది. రామానుజాచార్యులు దేవిడీలో ప్రవేశిస్తూనే శ్రీరామానుజాయ నమః అంటాడు. అది విని మంజరీదేవి గదిలోనుంచి బయటికివచ్చి అయనకు చేతులు జోడించి లోపలికి తీసుకు వెళ్లుతుంది.



రామానుజాచార్యులూ మంజరీదేవీ పూజగదిలో ప్రవేశించే సమయానికి సరిగ్గా రేఖ చదవదలచుకున్న చాప్టరు పూర్తిచేసింది ఒకసారి ఒళ్ళువిరుచుకొని, ఆ పుస్తకాన్ని బల్లమీద పడేసి గదిలో అటూఇటూ పచారుచేసింది.

రేఖకు మళ్ళీ గతరాత్రి కుతూహలం మనసులో అలజడి మాదిరిగా రేగింది. కుర్చీలో కూర్చున్నదల్లా చివ్వున లేచింది. కాళ్ళకు చెప్పులు వేసుకుని గది తలుపులు చేరవేసి తిన్నగా దక్షిణపువైపుగా ఉన్న పూలతోటలోకి మెల్లిగా అడుగులువేసుకుంటూ వెళ్ళింది. దక్షిణపువైపున ఆ దేవిడీకి రెండు కొబ్బరి చెట్లమధ్య పది విశాలమైన మెట్లు—వాటిమీద రంగురంగుల క్రోటన్ మొక్కల కుండీలు వరుసగా పైనుంచి క్రిందివరకూ రెండుప్రక్కలా పెట్టి ఉన్నాయి. ఆ మెట్లు ప్రతిరోజూ కడిగి ముగ్గులేస్తున్న గుర్తులు స్పష్టంగా కనబడుతున్నాయి. ఒక విశాలమయిన ఎత్తైన వరండాకు అవి మెట్లు. ఆ వరండాలోనుంచి లోపలికి వెళ్ళటానికి ఒక అందమైన రెక్కలు గల దర్వాజా-మేడమీదికి వెళ్ళటానికి మెట్లున్నాయి.

రేఖ వచ్చేటప్పుడు చేతబట్టుకుని వచ్చిన పుస్తకాన్ని ఒక చెట్టుచాటుకు కూర్చుని పేజీలు తిప్పుకున్నది. కాని-ఆనాడామెకు ఎదురుచూసిన సంగీతము గాని వాద్యంగాని వినబడలేదు. ఇంక ఆనాటికి వినడనేమో అనుకుంటుండగా పెద్ద కారొకటి వచ్చి మెట్లదగ్గర నిలిచింది. డ్రైవరు హారన్ మోగించాడు వచ్చినట్టుగా.

తాను కనబడకుండా రేఖ చెట్టుచాటున ఒదిగి కూర్చున్నది. కాని అదే చూస్తున్నది.

పెద్ద శబ్దంతో వరండా తలుపులు తెరుచుకున్నాయి. వంటమనిషి రెండు పెద్ద పెద్ద బుట్టలు డ్రైవరు కందించాడు. అతడు వాటిని డిక్కీలో సర్దాడు. డ్రైవరు కారుతలుపులు తెరిచి పట్టుకుని నిలబడ్డాడు.

ఐదునిమిషాల తరువాత ఇద్దరూ ఇంగ్లీషులో మాట్లాడుకుంటూ పైనుంచి కిందికి దిగి వరండాదాటి మెట్లమీదికివచ్చి నిలబడ్డారు.

డ్రైవరు రహ్మాన్ ఆ యిద్దరికీ సలామ్‌చేశాడు.

రేఖ ఆ యిద్దరినీ కనురెప్పార్పకుండా చూసింది.

అతడు చాలా చిన్నపిల్లవాడు. ఐదుసంవత్సరాలలోపుగా ఉన్నట్టు ఊహించింది రేఖ పాంటు దానిపైన బుష్‌షర్టూ; ఎడమపక్క పాపిడితో దువ్విన క్రాపూ—కళ్ళకు నల్లద్దాలజోడు—కాళ్ళకు మెరుస్తున్న నల్లటిబూట్లూ హుందాగా ఉన్నాడు ఆమె పొడుగ్గా ఉంది. కత్తిరించిన తలవెంట్రుకలు-విదేశీయుల ఒంటి రంగు-గళ్ళగౌను, ఎత్తుమడమల కాలిజోళ్ళు విదేశీయురాలుగా కనబడ్డది.

"ఆంటీ, ముందు కారెక్కు."

అది పురుషుడి కంఠధ్వనిగా రేఖ గుర్తించింది. యౌవనంలోఉన్న మగ గొంతు నాలుగూ అయిదు సంవత్సరాల చిన్నపిల్లవాడి గొంతులా లేదు. అంత చిన్నపిల్లవాడు స్వచ్ఛమైన ఇంగ్లీషుభాషలో మాట్లాడుతున్నాడు. ఈ రెంటికి సమన్వయ మెలాకుదిరింది?

"నీవు ముందెక్కు గిరిబాబూ!'' ఆమె అతడిచేతిని అందుకుని కారెక్కించింది. డ్రైవరుతో సామాన్లసంగతి కాబోలు అడిగి కారుఎక్కి తలుపు మూసింది. కారు మెల్లగా కదిలిపోయింది.

గిరిబాబు! ఈ మాట—ఈ పేరు యాదమ్మ చెప్పలేదే? ఆమెకూ తెలియదా? యాదమ్మ చెప్పినట్టు మూరెడుకాదుగాని చిన్నపిల్లవాడిలా ఉన్నాడుకాని ఆ కంఠధ్వని!

కారు వెళ్ళగానే విస్మయంతో అక్కడినుంచి లేచి తన గదికి ఆలోచిస్తూ చేరుకున్నది రేఖ. ఒక్కటే ఆశ్చర్యం! దానినుండి తేరుకోలేక మునకలు వేస్తున్నది.

పన్నెండు గంటలయింది. మంజరీదేవి భోజనంచేసిన తరువాతనే సెలవు రోజుల్లో రేఖ భోజనం చేస్తుంది ఆరోజున పూజగదిలోనుంచి వస్తూనే "భోజనం

చేశావా రేఖా?" అడిగింది. లేదని రేఖ తల తిప్పగానే "రా, భోజనంచేద్దాము" తన సరసన కూర్చోబెట్టుకున్నది. ఆమె పక్కన కూర్చోవటం అదే ప్రథమం రేఖకు. బిడియపడుతూ భోజనం ముగించి లేచింది.

ఆ రాత్రి పడుకునేవేళ "యాదమ్మా, మేడమీద........."

"అదిగో. మళ్ళీ మేడమీద అంటున్నావా? మరిచిపొమ్మని రాత్రేగా చెప్పింది? రేఖమ్మా! మనకొద్దాజోలి. చదువుకో. చదువయితే నిద్రపో" కసిరినట్టుగా మాట్లాడింది యాదమ్మ.

"యాదమ్మా! యాదమ్మా! ఒక్కటంటే ఒక్కటేమాట. ఆయన-అంటే మంజరీదేవిగారి కొడుక్కు ఎన్నేళ్ళు? పేరేమిటి?" రేఖ బ్రతిమిలాడింది యాదమ్మను.

"నా కదంతా తెలియదు తల్లీ. అక్కడ్లేని ప్రశ్నలడుగుతావు" చివాట్లు పెట్టింది.

రేఖ చిన్నబుచ్చుకుంది. ఆలోచనలు అల్లిబిల్లిగా అల్లుకుంటుండగా నిద్ర పట్టింది.

మరుసటి ఆదివారంకూడా రేఖ మళ్ళీ అదేచెట్టుచాటున చిన్నరాయి వేసుకుని పుస్తకం పట్టుకుని కూర్చుంది.

కొంతసేపటివరకూ నిశ్శబ్దం. ఆ తరువాత ఫిడేలువాద్యము కొంతసేపు-ఫ్లూట్ వాద్యము కొంతసేపూ వినిపించాయి. కొంతసేపు టకటకమంటూ టేబుల్‌టెన్నిస్ ఆడిన శబ్దము వినిపించింది. మధ్యమధ్య గొల్లున నవ్వులు.

రేఖ ధ్యాసంతా మేడమీదనే ఉంది. పేరుకే పుస్తకం చేతిలో పట్టుకున్నది పేజీలు తిరగవేస్తూ.

మధ్యాహ్నం పన్నెండుగంటలు కాగానే లోపలికి వెళ్ళిపోయింది.

పరీక్షలు ప్రారంభమైనాయి. రేఖ తొందర తొందరగా బయలుదేరుతుంటే మంజరీదేవి వెనక్కు పిలిచింది.

"రేఖా! ఇవాళ నీవు కాలేజికి చేరుకునేటప్పటికి ఆలస్యమవుతుంది. వాకిట్లో కారుంది. నిన్ను తీసుకెళ్ళి మళ్ళీ నీవు వచ్చేవరకూ అక్కడే ఉంటాడు రహ్మాను. వెళ్ళు. పరీక్షలు జాగ్రత్తగా వ్రాయి" మంజరీదేవి ఆజ్ఞాపించినట్లుగా అంది.

మారుమాట్లాడటమంటే రేఖకు భయము మంచయినా చెడుఅయినా ఆమె చెప్పినట్లు నడుచుకోకతప్పదు. పరీక్షలు జరిగిన వారంరోజులూ రేఖ కారులోనే వెళ్ళింది.

"ఏమోయ్ రేఖా! ఏమిటి విశేషం? కారులోగాని కాలేజికి రావా ఇంక?" స్నేహితురాళ్ళంతా ఆమెచుట్టూ మూగుతూ ఆటలు పట్టించారు.

"చెప్పవేం? అప్పుడే శ్రీమంతురాలివయినట్టుగా పలుకే బంగారం చేశావే?" గంటకొట్టడంచేత హాస్యాలు ఆపుచేశారు.

పరీక్షలు కాగానే సెలవుల్లో ఏంచెయ్యాలో అందరూ మాట్లాడుకోవటం మొదలుపెట్టారు. దమయంతీ కామాక్షీ బంధువుల ఇళ్ళకు వెళ్ళాలని ఉబలాట పడసాగారు. కాని రేఖకు సెలవుల్లో ఏమిచెయ్యాలో తోచలేదు. తల్లిదగ్గరికి పోలేదు. ఒక రోజున అన్నకు ఉత్తరం వ్రాసింది తనకు బొంబాయినగరం చూడాలని ఉన్నట్టుగా. అతడు తల్లికి ఈ సంగతి ఉత్తరం వ్రాశాడు. రేఖను చివాట్లుపెడుతూ "బుద్ధిగా చదువు ముగించుకుని రా. లేనిపోని కోరికలు—మన వంటివాళ్ళకు తగనికోరికలు పెట్టుకుని చదువు పాడుచేసుకోకు. ఈ ఒక్క సంవత్సరం కళ్ళుమూసుకుని ఉంటే నీ నాకష్టాలు గట్టెక్కినట్లే" అంటూ మాణిక్యం పెద్ద ఉత్తరం వ్రాసింది. రేఖ గుండె రాయిచేసుకుంది.

"పుస్తకాలేమయినా ఉంటే ఇవ్వండి చదువుకుంటాను. ఏమీ తోచటంలేదు" బిడియపడుతూ అడిగింది ఒకనాడు రేఖ మంజరీదేవిని భోజనాల సమయంలో.

కొంతసేపటివరకూ మంజరీదేవి జవాబు చెప్పలేదు. ఆమె సందేహిస్తున్నట్లు గ్రహించిన రేఖ ఆ మాట మళ్ళీ ఎత్తకుండా ఊరుకుంది.

మరునాడు మంజరీదేవి తనంతటతానే రేఖను పిలిచి, "ఆ గదిలో బీరువాల నిండా పుస్తకాలున్నాయి. చూసుకుని తీసుకో. జాగ్రత్తగా చదివి తీసినచోటనే తిరిగి పెట్టెయ్యి" అన్నది.

ఆ గదిలో అడుగుపెట్టిన రేఖ గోడలకున్న నిలువెత్తు ఫోటోలను ఒక్కొక్కటే చూడనారంభించింది. తలమీద జరీటోపీలు.పొడుగు చెమ్కీకోట్లు—ఒంటికి అతుక్కుపోయిన పైజమాలు చూసి ఇవి జమీందారుల డ్రెస్సు కాబోలనుకుంటూ బీరువాతలుపులు తెరచి పుస్తకాలు చూస్తూ తనకు పనికివచ్చే వేవయినా ఉన్నాయేమోనని వెదకటం మొదలుపెట్టింది రేఖ. పుస్తకాలన్నిటిమీద గోపాలకృష్ణరాయడి పేరు తెలుగుపుస్తకాలకు తెలుగులోనూ ఇంగ్లీషు పుస్తకాలకు ఇంగ్లీషుభాషలోను వ్రాసి ఉంది.

ఆ గ్రంథాలున్న గదిలోకి ప్రవేశించిన రేఖ భోజనానికీ నిద్రకూ బయటికి వస్తూఉండేది. విసుగు పుట్టినప్పుడు తోటలో తిరుగుతూ సంగీతం వింటూఉండేది.

సెలవులు ఎలాగడపాలా అని దిగులుపడ్డ రేఖకు రోజులు ఎన్ని గడిచాయో తెలియకుండానే గడిచిపోయాయి.

కాలేజీలు తెరిచారు.

* * *

దసరాలకు మంజరీదేవి దేవీనవరాత్రులు మహావైభవంగా జరిపించింది. ఆమె చేయదలుచుకున్న దానాలు విరివిగా చేసింది. అమ్మవారి పూజలు దగ్గరుండి తొమ్మిదిరోజులూ చేయించింది. ఒక సెలవురోజున రేఖను కూడా దేవాలయానికి తీసుకువెళ్ళింది.

రేఖకు బాల్యంనుండీ విగ్రహాలను పూజించటం – దేవాలయాలకు వెళ్ళటం తెలియదు. కాని గోపాలకృష్ణరాయని గ్రంథాలయంలో అన్నిరకాల గ్రంథాలనూ చదవటంచేత కొంత కొంత గ్రహించగలుగుతోంది. "భారతదేశంలో హిందూమతము నశిస్తుందా" అన్న గ్రంథము చదివిన తరువాత "హిందూ మతానికి పట్టిన బూజు దులపాలి" అన్న గ్రంథము చదివింది. కాలేజీ తెరచే ముందరే "హిందూమతమంటే ఏమిటి ? అది ఒక మతము కాదు – భారతీయులు నడుచుకోవటానికి ఏర్పరచిన మార్గాలు. అంటే పద్ధతులు – నడచుకో వలసిన విధానాలు – హిందూజీవనపథము." ఈ వివరణతో ఒక గ్రంథం చదివింది – (Hindu Way of Life). ఇదే విశ్వశాంతికి వెలుగుబాటలు వేసిన మతం అని పండిత రాధాకృష్ణ అన్నారట. ఈ గ్రంథాల తరువాతనే "భక్తిమార్గాలు" అన్న గ్రంథం చదివింది. ఆ మార్గాన పయనించేవారికి విగ్రహారాధన – భజనలు మొదటి సోపానాలు – అంటూ వివరణతో శాండిల్య భక్తి, శబరి శక్తి మొదలైన అంశాలు తెలుసికొన్నది. కాని అంతలోనే-ఇవన్నీ చదివిందిగాని వీటిని గ్రాహ్యము చేసుకునే శక్తీ, వయసూ తనకు లేవని తెలుసుకున్నది. ఆ గ్రంథాలయంలో ఆమెకు, తాను చదివిన గ్రంథాలే కాకుండా వీటినన్నిటినీ వ్యతిరేకించే గ్రంథాలు కూడా ఉన్నట్లు చూసిందొకనాడు. వాటినన్నిటినీ చాలా ఉత్సాహంతో–కుతూహలంతో గబగబా చదివేసింది. కాని– ఏ వాదం నిలుస్తుంది – ఏ వాదం నిలవదు అన్న విషయాన్ని తేల్చుకునే శక్తి తనకు లేదని తెలుసుకున్నది. ఈ గ్రంథాలను సేకరించి భద్రపరచిన గోపాల కృష్ణరాయలవారు ఎక్కడికి వెళ్ళారు ? వారు మరణించలేదా ? వారు సజీవులుగా ఉన్నట్టు మంజరీదేవి నుదుట కుంకుమబొట్టు రుజువుచేస్తున్నది కదా ! అయితే ఎక్కడికి వెళ్ళారు ? వారి ప్రశంస ఇంట్లో ఏ ఒక్కరి నోటివెంట తాను వినలేదే ?

"యాదమ్మా ! మొన్న నే నడిగిన ప్రశ్నకు జవాబు చెప్పనన్నావు. సరే మర్చిపొమ్మన్నావు. ఒప్పుకున్నా. కాని – చూడు ! ఈ దేవిడీ యజమాని పేరేమిటి ? ఇదయినా చెప్పు !" రేఖకు రాత్రిళ్ళే యాదమ్మతో మాట్లాడటానికి తగిన సమయం. దాన్ని వృధాచేయకుండా ఏదో ఒకటి అడుగుతుంది.

"ఆ దొర పేరు గోపాలకృష్ణరాయడు." రేఖ తనను ఇంకేమీ ప్రశ్నించకుండా పక్కకు తిరిగింది.

"అయితే వారు ఇప్పుడు ఎక్కడున్నారు ?" పడుకున్న రేఖ తలఎత్తి ప్రశ్నించింది.

"ఇప్పుడు లేరు " ముసుగులోనుంచే జవాబు వచ్చింది.

రేఖ మంచమ్మీదినుంచి చెంగున లేచి యాదమ్మ ముసుగు తీసి "మరి – మరి – అమ్మగారు కుంకుమబొట్టు పెట్టుకుంటున్నారు కదా !" ఆశ్చర్యాన్ని వ్యక్తీకరించింది.

"అవును ! లేరు అంటే ఇంట్లో లేరన్నమాట ! ఇంక పడుకో రేఖమ్మా" మళ్ళీ ముసుగు పెట్టుకుంది.

"అప్పుడే పడుకోనా ? చదువుకోవద్దా ? ఇది ఆఖరి సంవత్సరం. బాగా చదివి మంచి మార్కులతో పాసుకాకపోతే అందరూ కోప్పడతారు."

"అయితే చదువుకో. కాని – నన్నుమాత్రం ప్రశ్నలతో వేధించకు. నీ ప్రశ్నలన్నీ నీ కక్కర్లేనివి. అవన్నీ నీ కెందుకు చెప్పు ?" ముసుగులో నుంచే జవాబిచ్చి నిద్రలోకి జారుకున్నది. మరో రెండునిమిషాలలో గురక పెట్టేసింది.

రేఖ ఆలోచనలో పడ్డది. యాదమ్మ అన్నమాట నిజమే. ఈ యింటి సంగతులు తన కెందుకు ? కాని – పొట్టిగా ఉన్న ఆ యువకుడు – ఆ ఇంగ్లీషు దొరసాని–కనబడని గోపాలకృష్ణరాయడు – వాళ్ళ ప్రశంస పొరపాటు నైనా ఎత్తకుండా గంభీరంగా మెసిలే మంజరీదేవి రాత్రిళ్లు రేఖ మనసులోకి వస్తారు. ఆలోచింపచేస్తారు. ఆమెలో జిజ్ఞాసను రేకెత్తించి – ఆలోచనలను వలయాకృతిలో తిప్పించి, తిప్పించి ఆమెను పల్టీలు కొట్టించి అలసిపోయేటట్టు చేస్తారుగాని ఆ రహస్య మేమిటో విడదు. క్రమంగా ఈ విషయాలను గురించి రాత్రిళ్ళే కాదు – ఏ కాస్త విరామం దొరికినా పగలే ఆ ఆలోచనా వలయంలో చిక్కుకుపోతున్నది రేఖ.

ఆమెలో అంతలో నిర్లిప్తత - అంతలో కుతూహలం చోటు చేసుకుంటున్నాయి.

మంజరీదేవి సాయంకాలంవేళ - చల్లటి పానీయము తరువాత తమలపాకు విడెము జరదాతో సేవించుతూ హాల్లో సోఫాలో కూర్చున్నవేళ ముత్తి ఒక ఉత్తరం తెచ్చి యిచ్చింది.

కవరు చింపి చదువుకున్నది మంజరీదేవి. ఆమె కనుబొమలు ముడిపడ్డాయి. వెంటనే ఆ ఉత్తరాన్ని ముక్కముక్కలు చేసి పక్కనే ఉన్న బుట్టలో వేసింది. అక్కడితో కోపం చల్లారక చివాలున లేచి తన గదిలోకి వెళ్ళింది. అరగంటకు పైగా పడుకుని లేచింది. స్నానముచేసి జరీఅంచుల పసుపువన్నెచీరె కట్టుకుని కారులో దేవాలయానికి వెళ్ళిపోయింది.

నౌకరులంతా గజగజ ఒణుకుతూ గోడల కంటుకుని నిలబడిపోయారు.

ఆ రాత్రి భోజనమయిన తరువాత అక్కకు ఉత్తరం వ్రాసింది.

'ప్రియమైన అక్కగారికి,

నమస్కారాలు. మీ ఉత్తరం చదువుకున్నాను. మీరు పంపిన నాటినుండీ రేఖను చాలా జాగ్రత్తగా చూస్తున్నాను. ఇప్పుడు బి. ఏ. ఆఖరి సంవత్సరం లోకి వచ్చింది. పరీక్షలు రెండంటే రెండే నెలలు ఉన్నాయి పొరుగూరిలో ఉన్న కాలేజికి రేఖను కారులో పంపి చదివిస్తున్నాను. ఆడపిల్లను ఎట్లా కాపాడాలో నాకూ తెలుసు. ఆ అమ్మాయిని నా పక్కగదిలోనే ఉంచాను. నా దగ్గర ఉన్న యాదమ్మ కూడా ఆ గదిలోనే పడుకుంటుంది. ఆ అమ్మాయిని మీరు పంపారన్న గౌరవంతో, చాలా ప్రేమతో, జాగ్రత్తతో పెంచుతున్నాను. డబ్బు ఖర్చుచేయటానికి కూడా వెనుదీయటంలేదు. ఈ పరీక్షలయితే బి. ఏ. తప్పకుండా పాసవుతుందన్న నమ్మకం ఉన్నది. అమ్మాయి చాలా తెలివిగలది. నేను ఇంత చేసినదాన్ని మంచి సంబంధం చూసి పెళ్ళి చేయలేనని సంశయిస్తున్నారా ? మంచిపిల్లలకు మంచి సంబంధమే చూడాలి. నామీద నమ్మకం లేక కాబోలు మీరు ఒక ఉద్యోగిని మాట్లాడారు. అప్పుడే నిశ్చయం చెయ్యకండి. మాణిక్యం వచ్చినప్పుడు నేను ఈ విషయాలన్నీ విపులంగా చెప్పాను. ఎవరి సహాయాన్నీ అపేక్షించకుండా నేనే మంచి సంబంధం చూసి ఎంత డబ్బయినా ఖర్చుచేసి పెళ్ళిచేస్తానని వాగ్దానం కూడా చేశాను. మాణిక్యం పిల్లకు పెళ్ళంటూ రోజూ మిమ్మలను వేధిస్తున్నదా ఏమిటి !

అక్కా ! మీరు రేఖ విషయంలో నిశ్చింతగా ఉండండి. అన్ని విషయాలూ నేను చూసుకుంటాను.

ఇట్లు
మీ ప్రియమైన
మంజరీదేవి."

మరుసటిరోజు సాయంకాలం "అమ్మ పిలిచారుట" అంటూ రేఖ వచ్చి మంజరీదేవి ఎదుట నిలబడ్డది.

"రేఖా ! నేనంటే నీకింకా భయమేనా ? అంతదూరంలో ఆ నిలబడట మేమిటి ? ఇలా వచ్చి కూర్చో." మందలించినట్లన్నది మంజరీదేవి.

బిడియంతో సందేహిస్తూనే ఆమె పక్కన సోఫాలో కూర్చున్నది రేఖ.

"ఈ మధ్య అమ్మ ఏమయినా ఉత్తరం వ్రాసిందా ?" తానే స్వయంగా తమలపాకులతో బీడా తయారుచేసుకుంటూ ప్రశ్నించి రేఖ ముఖంలోకి చూసింది మంజరీదేవి.

"వ్రాయటంలేదు." చేతి వేళ్ళు చూసుకుంటూ జవాబిచ్చింది.

"పోనీ నీవు వ్రాస్తున్నావా ?"

"లేదమ్మా లేదు. ఏదయినా విశేషముంటేనే వ్రాయమని అమ్మ చెప్పింది. అంతే" భయంతోనే సమాధాన మిచ్చింది రేఖ.

"మీ అమ్మ పోరుపెట్టింది కాబోలు - మా అక్కగారు ఒక ఉత్తరం వ్రాశారు. పరీక్షలు పూర్తికాగానే పంపమన్నారు. అక్కడ ఓ పనికిమాలిన సంబంధం చూసి నిశ్చయంచేశారట. వెళ్ళి ఆ సంబంధాన్ని చేసుకుంటావా ? నీకు చూపించకుండానే నిశ్చయం చేసారు - చూస్తే నీవు మెచ్చవని కాబోలు!" పెదవి విరిచింది మంజరీదేవి.

తలమీద మొత్తినట్లయింది రేఖకు. నెలరోజుల క్రిందట మాణిక్యం కాలేజి ఎడ్రసుకు ఒక కవరు వ్రాసింది. దానిలో ఒక యువకుడి ఫొటో ఉంది. ఒక సినీ పత్రికలో విలేఖరట. పేలగా ఉంది ముఖం. కళ్ళూ, ముక్కూ తప్ప మిగతా ముఖాన్ని తలవెంట్రుకలు కప్పివేశాయి - గడ్డమయిందీ, మీసమయిందీ తెలియకుండా ముఖమంతా మూసుకుపోయింది. పేరు జయపాల్‌ట. తన ఫొటో చూసి అంగీకరించాడట. ఒక ముఖ్య విషయమేమిటంటే "ఇద్దరమూ ఉద్యోగాలు చేసుకుంటాము. నా కామే కట్నం" అన్నాడట. సందేహించకుండా ఒప్పుకుని పరీక్షలు కాగానే బయలుదేరి రమ్మన్నదా ఉత్తరం చివరన. అప్పటినుంచీ రేఖ జవాబివ్వకుండా ఆలోచిస్తూనే ఉన్నది.

ఈ సంగతే కామేశ్వరీదేవిగారు చెల్లెలికి కూడా వ్రాసారేమో !

"ఏమంటావు" నీ కిష్టమేనా వాళ్ళు చూపించిన సంబంధం చేసుకోవటానికి ? చెప్పు ? వాళ్ళకు సమాధానం వ్రాయాలి నేను."

ఐదు నిమిషాల తరువాత కూడా జవాబు రాకపోయేసరికి "అయితే రేఖ ఒప్పుకుందని వ్రాయనా ?" అన్నది మంజరీదేవి గంభీరంగా.

చివ్వున తలెత్తింది రేఖ. కళ్ళలో నీటిపొర తేలిఆడుతున్నట్టుగా కనిపెట్టింది మంజరీదేవి.

"అయితే పెళ్ళి వద్దట అని వ్రాయనా ?" రెట్టించినట్లన్నది.

"నేనా విషయం బాగా ఆలోచించుకోలేదమ్మా. నేను పెళ్ళిచేసుకుంటేనే గాని అమ్మకు మనశ్శాంతి లేనిపక్షంలో చేసుకుంటాను. ఆమె నాకు బుద్ధ తెలిసినప్పటినుండీ అన్నీ కష్టాలే పడ్డది. నా పెళ్ళితో కష్టాలంతమవుతాయనుకుంటే చేసుకోక తప్పదు." తల వంచుకొని అన్నది రేఖ.

"అయితే అతడినే చేసుకుంటావా ?"

ఈ ప్రశ్నకు రేఖ చప్పున సమాధానం చెప్పలేకపోయింది. బూచిలా ఉన్న ఆ ఫొటోను ఎప్పుడో చించి పారేసింది ఉత్తరంతో కూడా. ఆ ఫొటోను తిరిగి చూడనవసరం లేదనుకుంది.

పావుగంటసేపు నిశ్శబ్దము ఆవరించుకున్న దా హాలులో.

కన్నార్పకుండా రేఖవంకే చూస్తున్నది మంజరీదేవి.

జడ చివర్లు అల్లుతూ విప్పుతూ కూర్చుంది రేఖ మౌనంగా.

"నీ కంతగా ఇష్టమున్నట్టులేదు చూస్తే. ముందు పరీక్షలు కానీ – తరువాత ఆలోచిద్దామని మా అక్కగారికి ఒక వుత్తరం వ్రాసి పడేస్తాను. సరేనా ? ఇదంతా మనసులో పెట్టుకుని పరీక్షలు పాడుచేసుకునేవు ! జాగ్రత్తగా చదువుకో." చివాలున లేచింది మంజరీదేవి.

తలవంచుకుని మాట్లాడకుండా గదిలోకి వెళ్ళిపోయింది రేఖ. ఈ విషయాలను మనసులోకి రానివ్వకుండా చదువు సాగించాలన్న పట్టుదలతో కృషి చెయ్యటం మొదలుపెట్టింది.

రోజులు ఆమెకు తెలియకుండానే గడిచిపోవటం చూసి రేఖ తనలో తానే ఆశ్చర్యపడ్డది. ఎట్లా చదివిందో – పరీక్షలు ఎట్లా వ్రాసిందో ఆమె ఊహించలేనంతగా కాలం గడచింది. పరీక్షల తరువాత వార్షికోత్సవాలు తలపెట్టారు, వాళ్ళ ప్రిన్సిపాల్. విద్యార్థినులు నాటకాలు వేశారు. వినోదకరమైన పాత్రలు

ధరించి ప్రేక్షకులను విస్మయపరచారు. లలితసంగీతంలో ప్రావీణ్యంకలవారు పాడి శ్రోతలను తన్మయులను చేశారు.

ఆ మరుసటిరోజే ప్రిన్సిపాల్ సెలవులు ప్రకటించారు.

* * *

ఎప్పుడూ రానివాళ్లు తనకోసం దేవిడీలోకి వచ్చేసరికి రేఖకు విస్మయమూ, భయమూ కూడా కలిగాయి. కాని – అంతలోనే సర్దుకొని "హలో ! దమయంతీ ! కామాక్షీ ! ఏమిటి ఇలా వచ్చారు ?" అంటూ చేతులు పట్టుకుని గదిలోకి తీసుకువెళ్ళి తలుపులు దగ్గరగా వేసింది.

"ఏంలేదు రేఖా ! సెలవు లిచ్చారు. నీవు హైదరాబాదు వెళ్ళిపోతానని అన్నావు ఒకసారి జ్ఞాపకం వుందా ? అందుకని వచ్చాము. మళ్ళీ మనం కలుస్తామో లేదో " అన్నారు ఒక్కసారే.

"అవును. వెళ్ళాల్సిందే, కాని..." నసిగింది రేఖ.

"కాని...అంటున్నావు – ఏమిటి సంగతి ? ఇంకా పైచదువు చదువుతావా?" దమయంతి కళ్ళు పెడల్పు చేసుకుంటూ అన్నది.

"అబ్బే ! అటువంటి దేమీలేదు. ఇంక వెళ్ళిపోతాను. అమ్మకు వుత్తరం వ్రాసి బయలుదేరటమే. అంతే" అన్నది రేఖ.

తల్లి దగ్గరికి చాలా కాలానికి వెళ్లుతున్న సంతోషంగాని, ఉత్సాహంగాని రేఖలో కనబడకపోవటం గమనించారు ఇద్దరూ.

అనాసక్తంగా వున్న రేఖ ఒక పావుగంట తరువాత కాస్త తేరుకుని ఉత్సాహాన్ని తెచ్చుకుంటూ వాళ్ళతో కబుర్లకు దిగింది. "నీకు క్లాసు వస్తుందంటే, నీకు క్లాసు వస్తుంద"ని కొంతసేపు ముగ్గురూ వాదులాడుకున్నారు.

"రిజల్ట్సు వస్తే– వస్తే ఏమిటి–వస్తాయి. తరువాత ఏంచేద్దామని ?" దమయంతిని అడిగింది రేఖ.

"నే నింకా ఆలోచించుకోలేదు. టీచరు ఉద్యోగం చేయాలంటే ట్రైనింగు అవాలి." టక్కున జవాబిచ్చింది దమయంతి.

"కామాక్షీ ! నీవో ? నీకింకా చదవాలని వుందా ?" దమయంతి దృష్టి కామాక్షివైపుకు మళ్ళింది.

"నా సంగతే అడిగావు ? నా ఇష్టమేంలేదు. ఈపాటికి నా సంగతి నిశ్చయం చేసే ఉంటారు మాయింటో అమ్మా నాన్న."

"ఏంచేసి ఉంటారోయ్? పెళ్ళేనా?" దమయంతి హేళనగా నవ్వేసింది.

వాళ్ళతో మాట్లాడుతూ నవ్వుతూ గడుపుతున్నప్పటికీ రేఖ ఆలోచనలు ఎక్కడెక్కడో విహరిస్తున్నాయి ముఖమ్మీద ఆందోళన కొట్టవచ్చినట్టుగా కనబడుతోంది. వాళ్ళు ఎప్పుడు వెళ్తారా అని మనసులో తలపోస్తోంది.

"నీవు మాతో కులాసా కాలక్షేపం చేస్తావని వచ్చాం. నీ మనసెక్కడెక్కడో విహరిస్తోంది. ఇంక మేము వెళ్తాం" ముగ్గురూ వీధివాకిట్లోకి వచ్చారు.

దమయంతి చెప్పాలా వద్దా అనుకుంటూ గేటుదగ్గరికి రాగానే అననే అన్నది. "రేఖా! నీకు పెళ్ళి ఏర్పాట్లు మంజరీదేవిగారు చేస్తున్నారటకదా! నగలు చేయిస్తున్నారట-బట్టలు కొంటున్నారట. మరి... పెళ్ళికొడుకు ఏ దేశంవాడు? పోనీ ఎక్కడివాడు? ఇవన్నీ తెలుసుకోవాలనే మేము వచ్చాము. నీవేమో మమ్మల్ని నిరుత్సాహపరచి పంపేస్తున్నావు. మాకు చెప్పటం నీకిష్టంఉన్నట్టులేదు." గబగబా అనేసింది నిష్ఠూరంగా.

రేఖ ముఖం పాలిపోయింది. పెద్దపులి ఎక్కడన్నా ఉందేమో అని భయం భయంగా చూస్తూ అడుగులువేసే మేకలా చూసింది రేఖ

"దమయంతీ! నీవు చాలా క్రూరంగా మాట్లాడుతున్నావు. రేఖ ముఖం చూడు ఎలాఉందో? మనం వెళ్దాంపద" ఇంచుమించుగా చెయ్యిపట్టుకుని లాక్కుపోయింది కామాక్షి.

వాళ్ళను పంపించి లోపలికి వచ్చిన రేఖ మంచంమీద బోర్లా పడుకుంది. ఏదో ఆమె సహించలేని భావం మెదడులో సంచారంచేస్తున్నట్లుంది. మధ్య మధ్య తలతిప్పుతున్నది. అనూహ్యమైన భయం ఆమెను వెంటాడుతున్నట్టుగా ఉన్నది ముఖము.

పదిహేనురోజులనాడు మంజరీదేవి రేఖను పిలిచి దగ్గర కూర్చోబెట్టుకుని "రేఖా! వీటిలో నీకు నచ్చిన నగలేమయినా ఉన్నాయేమో చూడు!" ఒక పెట్టె ముందర బెట్టింది మంజరీదేవి.

వాటినిచూసి త్రుళ్ళిపడ్డది రేఖ. రకరకాల నగలు-మెడలో వేసుకునేవీ-చేతులకు వేసుకునేవీ-చెవులకు పెట్టుకునేవీ-వేళ్ళకు పెట్టుకునేవీ కొత్తవీ పాతవీ కూడా ఉన్నాయి.

కంటితో చూసి ఉదాసీనంగా కూర్చుంది రేఖ వాటిమీదినుండి చూపులు మరల్చుకుని.

"చేతులకూ మెడలోకీ నీకు కావలసినవి ఏమకో. ఉంగరాలు నీ వేళ్ళకు పట్టక

పోతే మళ్ళీ చేయిస్తాను." రెండుమూడు చేతిలోకి తీసుకుని చూపించింది మంజరీదేవి.

"నా కెందుకమ్మా నగలు?" తలదించుకుంది రేఖ.

"ఏం? నగలంటే ఇష్టంలేదా? అవి నీకు నచ్చినట్టులేవా ఏమిటి? ఏమిటో చెప్పు?"

"నగలకేం? చాలాబాగున్నాయి. కాని నా కెందుకు? నగలు కోరటం నా తాహతుకు మించిన కోరికకదా?" నిర్లిప్తత్వాన్ని కనబరచింది రేఖ.

"లేకపోతే కోరటం గొంతెమ్మకోరికే అవుతుంది. నీకు మంచి సంబంధం చూసి పెళ్ళిచేస్తానని మీ అమ్మకూ మా అక్కగారికీ వాగ్దానం చేశాను కదా. ఆ ప్రకారం మంచిసంబంధం చూశాను. మీ అమ్మకు వ్రాశానుకూడా. పెళ్ళికి నీకు నగలు వీటిల్లోనుంచి ఏరుకున్నాసరే-లేక కొత్తనమూనాలు ఏమయినా ఈ క్యాటలాగులో చూసి సెలెక్టు చేసినాసరే, ఉత్తరం వ్రాసి తెప్పిస్తాను. బనారసుచీరెలు కంచిపట్టుచీరెలూ తెప్పించాను. వాటిలోనుంచికూడా ఎన్నికచేసుకో. నీ ఎన్నిక అయిన తరువాతనే మిగిలినవి తిప్పి పంపుతాను."

త్రుళ్ళిపడ్డది రేఖ. తనకు సంబంధం నిశ్చయమైందా? తను చూడకుండానే నిశ్చయమైపోయిందా? అప్పుడే అమ్మకుకూడా ఉత్తరం వెళ్ళిందా? కంపరం పుట్టుకొచ్చింది రేఖకు.

"అమ్మా, నేను మా అమ్మదగ్గరికి వెళ్ళిపోతాను" లేచి నిలబడ్డది రేఖ.

"నేను పెళ్ళి జరుపుతానని మీ అమ్మకు మాటఇచ్చాను. మాట తప్పేదాన్ని కాదు నేను. మీ అమ్మను ఇక్కడికే పిలిపిస్తాను. అది నీ స్వంతఇల్లా-ఇది కాకపోయిందా? అలా భయపడతావేం? భయమా లేక సంకోచమా రేఖా నీకు నా దగ్గర?" చేతులు పట్టుకుని కూర్చోబెట్టింది.

"ఏరుకో మరి! వీటిలో నీకు నచ్చినవే ఏరుకో. సందేహించకు" ఒక్కొక్కటీ విడదీసి చూపించింది మంజరీదేవి.

ముఖమాటం రేఖను తలెత్తనివ్వలేదు. పైగా ఏవేవో సందేహాలు మనిషిని కదలనివ్వటంలేదు. అయిష్టంగా ఒక సన్నటి గొలుసుమీద వేలు ఆనించింది.

మంజరీదేవి పగలబడి నవ్వింది, "రేఖా! నీవు ఈ కాలపు పిల్లవు కావు. పైగా ముఖమాటమెక్కువ. ఈకాలపు పిల్లను దృష్టిలోపెట్టుకుని నేను సెలెక్టుచేస్తాను చూడు. ఈ రాళ్ళనెక్లెసు-దానికి తగిన గాజులజత- ఉంగరం-చెవులకు కమ్మలు చూడు ఎంతబాగున్నాయో! ఇంకోసెట్టుకూడా ఆర్డరుచేశానులే. నాలుగురోజు

లలో వచ్చేస్తుంది. చీరెలు నేను ఎన్నికచేసినవి నీకు నచ్చేతీరుతాయి?" అంటూ నాలుగు చీరెలు గడివిప్పి చూపించింది.

రేఖకు వాటిని చూడగానే కళ్లు జిగేలుమన్నాయి. ఇంత ఖరీదుగల నగలూ చీరెలూ తనకు మంజరీదేవిగారు ఇస్తున్నారా?

ఎందుకు? అవి ఇచ్చేటంత అభిమానము నాపైన ఆమెకు ఉన్నదా?

అసలింతకూ పెళ్ళికొడుకు ఎక్కడున్నాడు? ఎలా ఉంటాడు? తనకు చూపించదా? ఆమెను తనెలా అడుగుతుంది? ఆ రాత్రి తల్లికి ఉత్తరంవ్రాసింది. పరీక్షలయిపోయి ఇరవైరోజులకు పైగా అయిందనీ—మంజరీదేవిగారు ఇక్కడే పెళ్ళి ప్రయత్నాలు చేస్తున్నారనీను.

మాణిక్యం దగ్గర్నించి మంజరీదేవికి పెద్ద ఉత్తరం వచ్చింది- తనకు చాలా చాలా సంతోషంగా ఉన్నదనీ—ఈ పెళ్ళితో తన బాధ్యతలు రేఖపట్ల నెరవేరి నట్లైననీ—పెళ్ళికొడుకు ఏంచేస్తున్నాడు? ఎలా ఉంటాడు? కుటుంబ వివరాలు ఊరూ మొదలైన వివరాలన్నీ తెలుపమని వ్రాసింది.

మంజరీదేవి అందరితో రేఖపెళ్ళి శ్రావణమాసంలో నని చెప్పుతోంది. మాణిక్యానికి ఇంకా వరుడి వివరాలు వ్రాయలేదు. మంజరీదేవి తల్లికి వ్రాస్తే తల్లిదగ్గర్నించి తనకు తెలుస్తాయని ప్రతిరోజూ ఉత్తరంకోసం ఎదురుచూస్తున్నది రేఖ.

మధ్యాహ్నం భోజనాలవేళకు ముందు—రేఖ గదిలోనుంచి బయటికివస్తుండగా మంజరీదేవి ఇంగ్లీషులో ఎవరితోనో మాట్లాడటం వినిపించింది. ఆ సమయంలో తాను ఎదటబడటం మంచిదికాదేమో ననుకుంటూ లైబ్రరీ గదిలోకి వెళ్ళింది.

"అమ్మకు కొంచెం తగ్గగానే మా ఆంటీకి ఒప్పగించి వచ్చేస్తాను. ఉత్తరం వచ్చిందనీ—అమ్మకు జబ్బనీ వెళ్లుతున్నాను కాని వెళ్ళటం నాకిష్టంలేదు. నా కిక్కడే బాగున్నది. నా మనసు మీ ఇంటికి వచ్చిన తరువాత ఎంతో తేలిక పడ్డది. ఈ పదిరోజులు వెళ్ళటానికే నాకు కష్టంగా ఉంది."

ఆ కంఠధ్వని ఎక్కడో విన్నట్లనిపించింది రేఖకు.

"తప్పకుండా పదోనాటికి ఇక్కడుండాలి. నీవు చేసేపని ఈ యింట్లో ఉన్న నౌకర్లు ఎవరూ చెయ్యలేనిది. నీవు వచ్చినతరువాత నా మనసెంతో నిశ్చింతగా ఉంది. వాడి భారమంతా నీ కొప్పగించి నేను ధ్యానమంతా పూజల పట్లా దేవాలయములోనూ కేంద్రీకరిస్తున్నాను" బాధపడుతూ మాట్లాడుతున్నది మంజరీదేవి.

కొంతసేపటికి మంజరీదేవితోపాటు గౌనువేసుకున్న ఆమెకూడా బయటికి రావటం రేఖ కిటికీలోనుంచి చూసింది. ఆమె మేడమెట్లుదిగి ఆ చిన్న అబ్బాయితో కారెక్కుతూ ఉండగా రేఖ నాలుగైదుసార్లు చూసింది ఇంతకుముందు.

మరో అరగంటకు రేఖకు పిలుపువచ్చింది మంజరీదేవి దగ్గరనుంచి. వెళ్ళి భోజనంచేసింది.

తల్లిదగ్గరనుంచి ఉత్తరం రాలేదు. మంజరీదేవిగారిని అడిగే ధైర్యము లేదు రేఖకు. మనసు కలవరపడిపోతున్నది.

''అమ్మా, నేను మా అమ్మదగ్గరికివెళ్ళి పదిరోజులుండివస్తాను'' అన్నది రేఖ ఒకనాడు గద్గదస్వరంతో.

జోసఫిన్ వెళ్ళిన తరువాత మంజరీదేవి తిరిగి ఆమె ఎప్పుడువస్తుందా అని రోజులు లెక్కబెట్టుతున్నది. ఆమె మనసులో ఇదీ అని తెలియరాని ఆందోళన చోటుచేసుకున్నది. నౌకర్లమీద ఊరికినే చికాకుపడిపోతున్నది

రేఖను చూడగానే ఎందుకో కంపరం పుట్టుకొచ్చింది మంజరీదేవికి.

''రేఖా! ఎన్నిసార్లుచెప్పాను నీకు పెళ్ళినాటికి మీ అమ్మే ఇక్కడికి వస్తుందని? ఊరికే వెళ్తావెళ్తానని గోలచేస్తున్నావేమిటి? నీవు ఈ ఇల్లుదాటి వెళ్ళటానికి వీలులేదు తెలిసిందా? నేనెవరికిచ్చి పెళ్ళిచేస్తే వాడిని చేసుకునితీరాలి. నీ మనసులో ఏముందో నేను కనిపెట్టాను. నీ సందేహాలు నాకు తెలుసు. మీ అమ్మ కాదన్నా నేను తీసుకువచ్చినవాడిని నీవు చేసుకుని తీరాలి'' గర్జిస్తూ గదిలోకి వెళ్ళిపోయింది మంజరీదేవి.

హాల్లో గోడదగ్గరగా నిలబడ్డ రేఖ కుప్పగా కూలబడిపోయింది. రేఖ తలబాదుకుంటూ ఏడుస్తున్నది.

మంజరీదేవి పుత్రిని తీసుకుని దేవాలయానికి కారులో వెళ్ళిపోయింది.

నౌకర్లందరూ వాళ్ళ గదుల్లోకి చేరుకున్నారు బుగ్గలు నొక్కుకుంటూ

ప్రపంచమంతా తలక్రిందులైనట్లూ—పర్వతాలు తనమీద విరిగిపడ్డట్టూ—సప్తసముద్రాలూ పొంగి తనను ముంచివేసినట్లూ ఏడుస్తున్నది రేఖ తనకిక్కడ మరణంతప్ప వేరే శరణ్యం లేదు. ఉరిపోసుకుని చావాలి. లేకపోతే తోటలోఉన్న బావిలోపడి ప్రాణాలు తీసుకోవాలి. తన నెవరూ రక్షించలేరు.

తలగోడకేసి కొట్టుకుని వెక్కివెక్కి ఏడుస్తున్నది రేఖ. ముఖమంతా కందిపోయింది. కన్నీటిచారలతో బుగ్గలు మాసినట్లయ్యాయి. దిక్కుతోచనిదానిలా తల బాదుకుంటున్నదల్లా అక్కడొక చిన్న తలుపు తెరచుకొని గడప ఏవ

నిలబడ్డ మనిషినిచూసి కెవ్వున అరచింది రేఖ. తలవెంట్రుకలు సర్దుకొనిదూరంగా జరిగి నిలబడ్డది కొంతసేపటికి.

"నీవెవరు? ఎందుకేడుస్తున్నావు? ఏం ప్రమాదం జరిగింది?" అక్కడి నిలబడే అడిగాడు.

అతడు పొట్టిగా ఉన్నాడు. కాని దాదాపు పాతికసంవత్సరాల మనిషికి తగిన ముఖము ముక్కూ-కళ్లూఉన్నాయి. చేతులుకూడా వయసుకు తగినవే ఉన్నాయి. కంఠధ్వని పురుషోచితంగా గంభీరంగా ఉంది పచ్చటి చేతివేలికి రవ్వల ఉంగరం తళుక్కుమన్నది. తలుపుమీద చెయ్యి ఆనించి నిలబడ్డాడు.



గజగజ వణుకుతూ ఓరగంట అతడిని చూస్తోంది రేఖ

"నీ సంగతేమిటో నాకు చెప్పు? నే నిక్కడ నిలబడటం బాగుండదు. నీవెందుకు ఏడుస్తున్నావో చెప్పు, నా చేతనైన సహాయంచేస్తాను. నీ సంగతంతా చెప్ప టానికి నాతో పైకిరా" ఆ మాటలు చాలా స్నేహపూరితంగానూ ఒక అర్తుడికి సహాయం చేసేవిగానూ సహృదయంలోనుంచి వచ్చినట్లుగానూ ఉన్నాయి.

పైకి వెళ్ళటమా? రేఖ ఇంకా విస్మయావస్థనుండి తేరుకోలేదు. భయం తగ్గ లేదు. మోకాళ్లు రెండూ ఇంకా కొట్టుకుంటూనే ఉన్నాయి.

"నీకేం భయంలేదు. నన్ను నమ్ము. నీకు అపకారం చెయ్యను నీ ఏడుపు చూస్తుంటే నా కళ్ళకు నీళ్ళు వస్తున్నాయి. నాతో చెప్పు నీ సంగతి" అభయ మిస్తున్నట్టేకాదు-జాలికూడా కలుగుతోంది ఆ మాటలు వింటుంటే.

కళ్ళు పైటకొంగుతో ఒత్తుకొని మెల్లగా కదిలింది రేఖ. ఆమె తనవైపు రావటంచూసి వెనక్కుచూస్తూ ముందు మెట్లు ఎక్కుతున్నాడు అతడు. రేఖ బరువుగా అడుగు ఒక్కొక్క మెట్టుమీదనే పెడుతూ పైకి ఎక్కింది.

"అలా ఆ కుర్చీలో కూర్చుని చెప్పు. ఆఁ. ఇప్పుడే చెప్పొద్దులే బల్లమీద ఫ్లాస్కులో కాఫీ ఉంది కప్పుల్లో పోస్తాను. ముందు కాఫీ తాగుదాము" ఒక కప్పు ఆమె చేతికిచ్చి తానొకటి తీసుకున్నాడు.

లేడిలా బెదిరిపోతూ ఇటూ అటూ చూసింది రేఖ.

"నీకేం భయంలేదని చెప్పానుగా. కాఫీ తాగు" వేడుకుంటున్నట్లుగా ముఖం పెట్టాడు అతడు.

కాఫీ కప్పు గోడదిగ్గరగా కిందపెట్టింది రేఖ.

"అయ్యయ్యో! అంత వినయమా? అక్కర్లేదు. సరే—నాకు పళ్ళుకోసే అలవాటులేదు. నా గవర్నెస్ ఊరికి వెళ్ళింది. ఆ ఏపిల్‌పండు కోసి నీవు తీసుకుని నాకొక ముక్క నీచేత్తో ఇస్తే తింటాను."

అయ్యో, ఇదెక్కడి బాధరాబాబూ అనుకుంటూ కనుబొమలు చిట్లిస్తూ లేచి ఏపిల్‌పండు ముక్కలుగా చాకుతోకోసి ఒకప్లేటులోపెట్టి అతడి ఎదుట పెట్టింది రేఖ.

"నీవు కొన్ని ముక్కలు తీసుకోవాలి అప్పుడుగాని నేను తినను" అతడు మూతి బిగించుకుని కూర్చుంటే చేసేది లేక రెండంటే రెండే ముక్కలు తీసుకుంది రేఖ.

"నీకేం బాధ లేనట్టుగా ఒక్కసారి నవ్వు."

మళ్ళీ ఏడుపు ముంచుకువచ్చింది రేఖకు. పైటకొంగు కళ్ళమీద పెట్టుకుని వెక్కటం మొదలుపెట్టింది.

అతడు కుర్చీమీద కూర్చోలేకపోయాడు. అతడి గుండె బీటలువారుతున్నట్లనిపించింది.

"అమ్మాయీ ! నీవు ఏడిస్తే నే నాగలేను. నాకెంతో బాధగా ఉంది. అలా కూర్చుని నీ సంగతంతా చెప్పు." బ్రతిమిలాడాడు.

రేఖ వెక్కుతూనే తా నా ఊరు ఎందుకు వచ్చిందీ, ఎలా వచ్చిందీ చెబుతూ తన చదువు - అకస్మాత్తుగా లభించిన మంజరీదేవి ఆదరణ, తన పెళ్ళి ప్రసక్తి, తల్లి వచ్చి వెళ్ళటం — తాను బి ఏ. పూర్తిచేయటం — మంజరీదేవి ఆ నాటి మాటలూ వివరంగా పూసగుచ్చినట్లు చెప్పింది.

అతడు బరువుగా నిట్టూర్చాడు. "అయితే నీకు వరుణ్ణి చూపించకుండానే పెళ్ళిచేస్తుందా అమ్మ ?" కనుబొమలు పైకెత్తి ఆశ్చర్యంతో నోరు తెరిచాడు.

"నేనూ ఆ కోరికే కోరాను. నన్ను ఈ ఆవరణం దాటటానికి వీలులేదని ఆంక్షపెట్టారు. చావు తప్ప నాకు వేరే శరణ్యం లేదు." మళ్ళీ వస్తున్న ఏడుపును ఆపుకోవటానికి చేసిన ప్రయత్నం విఫలమైంది.

"ఏడవకు. నేను అమ్మతో మాట్లాడతాను. నీకు అన్యాయం జరగకూడదు. నేనది చూడలేను. నామీద నమ్మకం కుదిరిందా మరి ?"

తల ఊపింది రేఖ నమ్మకం ఉందన్నట్టుగా.

"అయితే ఒక్కసారి నవ్వు మరి !"

అతడలా అడుగుతుండేనే నవ్వు వచ్చింది రేఖకు.

"సరేగాని — నేను ఒక్కడినీ ఈ ప్రాణంలేని వస్తుజాలంతో కాలక్షేపం చెయ్యలేక నానా అవస్థాపడుతున్నాను. రోజూ ఒకసారి ఇలా వచ్చి కబుర్లు చెప్పరాదూ ? ఎవరితోనయినా కాసేపు మాట్లాడితే మనసు కెంతో హాయిగా ఉంటుంది." అర్థిస్తున్నట్టుగా అడిగాడు.

"మీ రీ యింటి యజమానుల్లా ఉన్నారు, అవునా ?" సందేహిస్తూ ఒక పక్క భయపడుతూనే అడిగింది రేఖ.

బరువుగా నిట్టూర్చా డతను.

కొంత సేపటికి, "నా బాధేమిటో నీకు చెప్తాను. మరి—రేపు వస్తావా ?"

మౌనంగా తల తిప్పింది రేఖ.

"జాగ్రత్తగా కిందికి దిగి వెళ్ళు. తలుపులు దగ్గరికి లాగితే లాక్ దానంతట అదే పడిపోతుంది. మరిచిపోకు — రేపు ఇదే సమయానికి రావాలి." అతడు లేచి నిలబడగానే రేఖ తలవంచుకుని గబగబా మెట్లు దిగి తలుపులు దగ్గరికి లాగింది.

ఆ రాత్రి ఆమెకు కళ్ళు మూతపడలేదు. ఎంత ప్రయత్నించినా లాభం కనబడలేదు. ఆ గంభీరమైన కంఠధ్వని, అభయమిచ్చే ఆ చూపులు—ఆప్యాయమైన ఆ పలకరింపు ఆమె మనసులో బలమైన ముద్రలువేశాయి. అతడా ఈ యింటి యజమాని ? కాదనలేదే ! ఆ మాట అనగానే బరువుగా నిట్టూర్చాడు — అతడి గుండెలో ఎన్ని అగ్నిగోళాలు భగభగమంటున్నాయో ? అతడి బాధలు చెప్పుకోవటానికి దిక్కులేని తనను రమ్మంటున్నాడు ! అది ఆశ్చర్యమో — సంశయమో తెలియని అవస్థలో దొర్లి దొర్లి తెల్లవారుజామునకు నిద్రలోకి జారింది రేఖ.

* * *

మంజరీదేవి ఆ రోజంతా మౌనంగానే ఉంది. పక్కన కూర్చున్నా రేఖతో ఒక్కమాటయినా మాట్లాడలేదు. సాయంకాలం ఐదుగంటలు కాగానే ముత్తిని తీసుకుని దేవాలయానికి వెళ్ళిపోయింది.

రేఖ ముఖం కడుక్కొని బొట్టుపెట్టుకుని తెల్లటిచీరె కట్టుకుని మెల్లగా తలుపు తీసి ఒక్కొక్క మెట్టే ఎక్కుతూ పైకి చేరుకున్నది. అతడు హాలు కెదురుగా ఉన్న వరండాలో నిలబడి బయటికి చూస్తున్నాడు. అడుగుల సవ్వడికి వెనక్కు తిరిగి చూసి 'హలో' ! అన్నాడు.

పెదవులమీద హాసరేఖ ఒకటి తొంగిచూసింది రేఖకు.

"వచ్చావా ? కూర్చో. అన్నట్టు రాత్రి నిద్రబోయావా లేదా ?" అన్నాడు చిరునవ్వుతో

నవ్వి ఊరుకుంది రేఖ.

"పరీక్షలు బాగా వ్రాశావా ?" అనుకోకుండా అడిగా డీ ప్రశ్న.

వ్రాశానన్నట్టు తల ఊపింది.

"చూడు. నీవు చాలా అదృష్టవంతురాలివి."

"దేనికి ?" విస్మయం కలిగింది రేఖకు.

"దేనికా ? చదువుకొన్నదానవు — పదిమందిలో కూర్చుని పరీక్ష వ్రాసిన దానవు - నీ కెంతమందో స్నేహితులుండే ఉంటారు చక్కగా ఆహ్లాదకరంగా అందరితో కబుర్లు చెప్పకుంటూ తిరగవచ్చు. పదిమందిలోకి వెళ్ళవచ్చు. ప్రపంచాన్ని స్వేచ్ఛగా చూసి ఆనందించవచ్చు. ఇంతకంటె అదృష్టం వేరే కావాలా ?" పచ్చటి ముఖం విచారంతో ముడతలుపడి వికృతంగా కనబడ్డది.

అతడి బాధ ఏమిటో అర్థంకాక వింతచూపు చూసింది రేఖ.

"నా బ్రతుకు చూడు ఎంత నికృష్టమైనదో ! నీ వన్నట్టు నే నీ యింటికి వారసుణ్ణే. కాని ఈ ఇంట్లో నేను స్వేచ్ఛగా తిరగలేను. ఈ మేడదాటి బయటికి రాలేను. యజమానిగా, హుందాగా నలుగురిలోకి రాలేను. చివరికి ఈ ఇంటి నౌకర్లలో ఒక్కడికి తప్ప నా ముఖం ఎవరికీ కనబడదు. నా చదువు ఈ హాల్లో — ఈ బల్లముందర కూర్చుని చదివిన చదువు. నాకు స్నేహితులు లేరు. నా మనసులో మాట నా మనసులోనే అంతం కావాల్సిందే. నా జీవితంలో ఒక వెలుగురేఖ జోసఫిన్. ఆమె వచ్చిన తరువాత నాకు వ్యాపకా లెక్కువయ్యాయి. ఈ లలితకళలన్నీ ఆమె నేర్పినవే. ఇవన్నీ కాలక్షేపానికీ—నా ఒంటరి జీవితం లోని వ్యథను మాన్పుకోవటానికీ - దానిని మరచిపోవటానికీ. ఆమె వచ్చిన తరువాతనే అప్పుడప్పుడు బయటికి తీసుకువెళ్ళుతూ - సినిమాలు చూపిస్తూ — పాటలు పాడిస్తూ — నవ్వుతూ నవ్విస్తూ నాచేత ఆటలు ఆడించటం మొదలు

పెట్టింది. అయినప్పటికీ నాది న త్త గుల్ల జీవితమే కదా ! ఇప్పుడు చెప్పు నీవా నేనా అదృష్టానికి నోచుకున్నది ?"

కన్నీటిధారలు చెంపలమీదుగా కారిపోతున్నాయి రేఖకు. అలా అతడి ముఖం లోకి చూస్తున్నది జాలిగా.

"అదేమిటి ఆ కన్నీళ్ళు ? నా సంగతి చెబుతుంటే నీ వేడుస్తున్నా వెందుకు ? ఈ ప్రపంచంలోకల్లా నేనొక దురదృష్టజీవిని. నే నిలా పుట్టడము నాకు శిక్ష అయినట్లా - మా అమ్మకు శిక్ష అయినట్లా ? నేను ఊహించలేకుండా ఉన్నాను. ఆమె ముఖం చూడటానికే నాకు భయం. నావల్ల ఆమెకు ఏ విధమైన సంతో షమూ కలగలేదు. ఎంతో వ్యధను అనుభవిస్తోంది. ఈ పాపిష్టివాడికి ఆయువు మూడకూడదూ ? నా ఆరోగ్యంకోసం అమ్మ ఇంకా ఎంతో డబ్బు ఖర్చు చేస్తోంది. శ్రద్ధచూపుతోంది. ఈ ప్రపంచానికి నేను ఉన్నా లేకపోయినా ఒకటే. కాని - కాని - ఈ కురూపికి ఏదయినా వస్తే అమ్మ గుండె బ్రద్దలవు తుంది. నేను నాకోసం కాదు - కురూపిగానయినా బ్రతికి అమ్మకు దుఃఖం కలగకుండా చేయాలని ఈ చదువూ, ఈ వ్యాసంగమూ మొదలుపెట్టాను. ఇప్పుడు నా బాధ అర్థమయిందా ? నా బాధముందర నీ బాధ ఎంతటిదో చెప్పు ?"

రేఖ తలవంచుకున్నది.

గ్లాసెడు మంచినీళ్ళు కూజాలోనుంచి ఒంపుకుని తాగాడు. గాలికి తలుపులు కొట్టుకుంటుంటే గబగబా నడిచి గాలిగడియలుపెట్టి వచ్చాడు.

అతడి చర్యలను వింతగా చూస్తున్నది రేఖ.

జేబురుమాలతో కళ్ళూ, ముఖం తుడుచుకుని పియానో దగ్గరికి వెళ్ళి మార్చింగ్ సాంగ్ వాయించాడు.

"నాకు మనసులో బాధ కెరటాల్లా పొంగి పైకి పైకి వచ్చినప్పుడు - మరీ నిరుత్సాహంగా ఉన్నప్పుడూ ఇటువంటి పాటలు వాయిస్తాను. ఉత్సాహం కలుగు తుంది. నీకు సంగీతం వస్తే ఒకపాట పాడి వినిపించు." అర్థించాడు.

మాటలు నోట్లోంచి బయటికి రావటమే కష్టమైపోతుంటే పాట ఎలా పాడు తుంది రేఖ ? జవాబివ్వటానికి నోట తడి ఆరిపోయింది.

ఆమె అవస్థ గమనించి "గ్లాసెడు మంచినీళ్లు తాగు. అంత భయపడిపోతున్నా వేమిటి ?" మంచినీళ్ల గ్లాసు చేతి కందించాడు.

భయంతో నోటమాట సరిగా రాకపోయినా ఒకపాట పాడా ననిపించుకున్నది రేఖ

"పళ్లు తిందాం రా. ఈ ఎర్రటి అరటిపళ్ళంటే నాకు చాలా ఇష్టం ఇవాళ కమలాఫలాలు తిందాం. ఏమంటావు ?"

ఇద్దరూ పళ్ళు తినటం పూర్తిచేశారు. ఫ్లాస్కులో ఉన్న కాఫీని కప్పుల్లోకి ఒంపాడు.

"చూడు నన్ను చూస్తే అసహ్యం వెయ్యటంలేదూ ? నీ భయమంతా నన్ను చూసి కాదుకదా ?" బాధపడుతున్నట్టుగా ఉన్న దతడి ముఖం.

"నా కెందుకు భయం ? మీరెంతో మంచివారుగా కనబడుతున్నారు."

"ఎందుకు అబద్ధమాడతావులే ! ఒదిగి ఒదిగి కుర్చీలో కూర్చుంటున్నావు! నావైపు భయం భయంగా చూస్తున్నావు ! ఏదో వింత జంతువును చూసినట్టు బెదిరి చూస్తున్నావు ! నీ చేష్టలే చెబుతున్నాయి నీ మనసులో ఏమున్నదో ! అంతేకదూ ? నిజమా అబద్ధమా ?"

"లేదు లేదు. మీరలా అనుకోవద్దు. నా చేష్టలవల్ల మీకలా అనిపిస్తే నన్ను క్షమించండి." చేతులు జోడించింది రేఖ నొచ్చుకుంటూ.

"ఏంచేస్తాం ? దేవుడు నన్నిలా పుట్టించి ఇలా ఖైదుచేశాడు.

"టైమయింది - అమ్మ తిరిగి వచ్చే వేళయినట్టుంది జాగ్రత్తగా కిందికి దిగి వెళ్లు. రేపు వస్తావు కదూ ?" చేతికున్న గడియారాన్ని చూసి ఆమెను తొందర పెట్టాడు.

"నా పేరు గిరిధరరాయడు. గిరిబాబని పిలుస్తారు. నీ పేరు?" పసిపిల్లవాడు అడిగినట్లు అడిగాడు.

"రేఖ."

ఆమె మెట్లు దిగుతున్నంతసేపూ అక్కడే నిలబడి "రేఖా !" అని పిలిచాడు.

ఆమె వెనక్కు తిరిగి నవ్వుతూ చెయ్యి ఊపి తలుపు మూసింది.

ఆ రాత్రి భోజనం దగ్గర కూడా మంజరీదేవి మౌనంగానే ఉన్నది. ఎప్పు డెప్పుడు భోజనం ముగించి గది చేరుకుంటానా అనుకుంటూ నిమిషాలు లెక్క బెట్టిన రేఖ ఆమె లేవగానే ఒక్క అంగలో గది చేరుకున్నది. ఆమెకు మంజరీ దేవిని చూడగానే ఆ క్రిందటిరోజు తనకు పెళ్ళి వద్దు వెళ్ళిపోతానని ఏడ వటమూ, మంజరీదేవి "నీమీద ఎంత ఖర్చు చేశానో తెలుసా ? ఎందుకు చేశానో తెలుసునా ? నేను చెప్పినట్లు వినకపోతే ఏమవుతుందో తెలుసా ? నా సమ్మతి లేనిదే నీవీ గడప దాటలేవు" అన్నమాటలు జ్ఞాపకం వచ్చాయి.

"మీరు ఖర్చుచేసిన ప్రతిపైసా నేను తీర్చుకుంటానమ్మా! నా చర్మంతో చెప్పులు కుట్టించయినా మీ ఋణం తీర్చుకుంటానమ్మా. నన్ను వెళ్ళనీయండి. నేను ప్రాణత్యాగమయినా చేసుకుంటాను గాని నేను పెళ్ళిచేసుకోను" అని ఏడుస్తుంటే, "నిన్ను దగ్గరకి తీసి ఇంత చదువు చెప్పించి ఇంతదాన్ని చేసింది ఎందు కనుకున్నావు ? నా మాట నీవు విని తీరాలి" అంటూ ఆమె బొబ్బలిలా అరుస్తూ గదిలోకి వెళ్ళిన దృశ్యం కళ్ళల్లో మెదిలింది. సలువెల్లా ఒణకిపోయి గోడకు ముఖం ఆనించి వెక్కి వెక్కి ఏడవటం మొదలుపెట్టింది రేఖ.

గదిలోకి వచ్చిన యాదమ్మ రేఖను బలవంతంగా మంచమ్మీద పడుకో బెడుతూ, "రేఖమ్మా! నా కొక కాశీమజిలీ కథ వినిపించవా ? అప్పుడు చెప్పిన కథ సగంలోనే ఆపేశావు. పూర్తిచెయ్యవూ ?" అన్నది.

"మరిచిపోయాను యాదమ్మా." రేఖ తప్పించుకోవాలని చూసింది.

"జ్ఞాపకం ఉన్నకాడికి చెప్పు. నా కివాళ తలనొప్పిగా ఉంది. దాన్ని పోగొట్టాలి నీవు కథ చెప్పి."

రేఖకు కథ చెప్పక తప్పలేదు.

మరునాడు మంజరీదేవి కాఫీ తీసుకుంటుండగా రేఖ ఎదురుగా నిలబడ్డది.

"ఏమిటిలా వచ్చావు ? నిన్ను చూస్తేనే నాకు భయంగా ఉంది." చీత్కారం చేసింది మంజరీదేవి.

ఎక్కడలేని ధైర్యము వచ్చింది రేఖకు. వెనక ముందూ చూడదలచు కోలేదు.

"కుక్కకు రొట్టె ముందు పడేసినట్టు నాకు అన్నంపెట్టి పోషించి, చదువు చెప్పించి ఇలా ఖైదీని చేస్తారా ? ఆటబొమ్మను చేసినట్టు చేస్తారా ? ఎందు కమ్మా ఈ పేదవాళ్ళమీద ఇంత అలుసు ? మావి బ్రతుకులు కావా ? మాకూ ఇష్టాఇష్టాలు ఉండవా ? మా జీవితాలను డబ్బుపెట్టి కొనుక్కున్నారా మీరు ? మీకు బానిసలమా మేము ? మా కెందుకీ కట్టడి" అరుస్తూ నేలమీదపడి దొర్లింది రేఖ.

మంజరీదేవికి సహనం ఆవగింజంత కూడా మిగలలేదు.

"నీవు ఈ రకంగా ఆగంచేస్తే కాళ్ళూ, చేతులూ కట్టి గదిలో పడేస్తాను. ఆ శిక్ష కావాలనుకుంటే ఇలా శోకాలుపెట్టి, అల్లరి చెయ్యి. నీకు లక్షణంగా పెళ్ళి చేస్తానంటే ఈ గోల ఏమిటి ? నా ఇష్టానికి తిరుగులేదు." అక్కడినుండి వెళ్ళి పోయింది మంజరీదేవి.

ఆ రోజంతా అన్నమూ, నీళ్ళూ ముట్టలేదు రేఖ.

సాయంకాలము మంజరీదేవి దేవాలయాలనికి వెళ్ళినా అలాగే గదిలో గోడ కానుకుని కూర్చున్నది.

అయిదు-అయిదున్నర-ఆరుగంటలు కావచ్చింది.

హాలులో పైకి వెళ్ళే మెట్లతలుపు తెరుచుకున్నది గిరిబాబు తలుపుపట్టుకుని నిలబడి "రేఖా ! రేఖా !" పిలుస్తున్నాడు.

మూడో పిలుపుకు రేఖ కదిలి బయటికి వచ్చి చూసింది.

"అరే ! ఏమిటలా ఉన్నావు ? కళ్ళు తుడుచుకుని పైకి రా." ఆమె కదలగా చూసి మెట్లు ఎక్కాడు. రేఖ అతడి వెనుక ఒక్కొక్క మెట్టే కళ్ళు తుడుచు కుంటూ ఎక్కింది.

బల్లకు చెరొకవైపూ, ఇద్దరూ చిన్న చిన్న కుర్చీలలో కూర్చున్నారు. మేడ పైన ఉన్న ఫర్నిచరంతా చిన్నపిల్లలకు నిర్దేశించినట్టుగా ఉంది.

"రేఖా ! నీ బాధలూ, నా బాధలూ ఒకరితో ఒకరం చెప్పుకోవటం అయి పోయింది. కొంతవరకూ మనసులు తేలికపడ్డాయి. ఇంక వాటిని మరిచిపోవ టానికి ప్రయత్నం చేద్దాము. నీవు ఏమేమి పుస్తకాలు చదివావు ? నీ కాలేజి పుస్తకాలేనా ఇంకా ఇతర పుస్తకాలు కూడా చదివావా ?" తెచ్చుకున్న ఉత్సా హంతో అడిగాడు.

తను చదివిన పుస్తకాల పేర్లన్నీ చెప్పింది రేఖ.

"ఎక్కడ చదివావు ఇవన్నీ ? కాలేజి లైబ్రరీలోనా ?" కుతూహలం ఎక్కువైంది అతడికి.

"ఎక్కడో కాదు. మీ యింట్లో ఉన్న లైబ్రరీలోనుంచి తీసుకుని చదివాను. చదవటమయితే చదివాను. ఎంతవరకూ బుర్రలోకి ఎక్కాయో తెలియదు. ఆసక్తికొద్దీ కుతూహలంకొద్దీ చదివాను" అన్నది

"నా లైబ్రరీ చూడు" హాలుకు పక్కగా ఉన్న గదిలోకి తీసుకువెళ్ళాడు రేఖను. విశాలమయిన పెద్ద గది. ఆ గదికి నాలుగు పక్కలా మూడడుగుల ఎత్తు బీరువాలు. వాటినిండా పుస్తకాలు. అక్కడక్కడా చిన్నచిన్న కుర్చీలు. రేఖ నాలుగు ప్రక్కలా చూస్తూ గదికి మధ్యగా నిలబడిపోయింది.

"ఇలా నిలబడిపోయావేం ? ఈ గదికూడా నా వికృత స్వరూపాన్ని గుర్తుకు తెస్తున్నదా ?" అన్నాడు బాధగా.

రేఖ కొంచెం ధైర్యం తెచ్చుకున్నది. "అన్నీ మరిచిపోదామని ఇప్పుడే

అన్నారు మళ్ళీ మీరే ఆ మాట ఎత్తుతున్నారు" అన్నది మెల్లగా మందలించే ధోరణిలో.

"పొరబాటయింది. క్షమించు." నవ్వుతూ చెంపలు వేసుకున్నాడు గిరిబాబు.

ఇద్దరూ ఆ గదిలోనుంచి హాల్లోకి వచ్చారు. ఎదురెదురుగా కూర్చుని కబుర్లు చెప్పుకున్నారు. గిరిబాబు తన దగ్గర ఉన్న పుస్తకాలలోని నవలలను గురించి వింత వింత కబుర్లు చెప్పాడు.

చెక్కిట చెయ్యి చేర్చుకుని కళ్ళు పెద్దవిచేసుకుని వింటున్నది రేఖ.

ఏదో జ్ఞాపకం వచ్చినవాడిలా చివ్వున లేచాడు గిరిబాబు. బీరువాలోని కెమెరా తెచ్చి క్లిక్ మనిపించాడు.

"అదేమిటి అదేమిటి" అంటూ అదిరిపడి లేచింది రేఖ.

"అదేమిటో నాలుగురోజుల తరువాత చూపిస్తా." కెమెరాను యథాస్థానంలో పెట్టి వచ్చాడు.

"ఇలా తియ్యతియ్యగా కబుర్లు చెప్పుకుంటూ మన తెలుగుభాషలో మాట్లాడు కుంటూ ఉండచ్చు - నీవు పగలంతా పైన ఉండకూడదూ ? ఆ జోసఫిన్ రాకపోయినా ఫరవాలేదు నాకు. కబుర్లు చెప్పుకుంటుంటే రోజంతా నిమిషంలా గడిచిపోతుంది. ఏమంటావు ?"

నవ్వింది రేఖ.

జోసఫిన్ ఎక్కడ ? తనెక్కడ ? మహా అయితే మరో అయిదారు రోజు లుంటుంది అక్కడ ఆమె. ఆమె గిరిబాబుకు చేసినట్టు తానేమి చెయ్యగలదు ?

కాని ఆ మరునాడు జోసఫిన్ దగ్గరనుండి ఉత్తరం వచ్చింది. తల్లికి వ్యాధి చాలా తీవ్రంగా ఉన్నదనీ, తాను రావటానికి ఒక నెలకు పైగా పట్టినా పట్ట వచ్చుననీ.

పుట్టినప్పటినుంచీ చూస్తున్నవాడు కనుక వృద్ధుడయినా నర్సిమ్మునే గిరిబాబు పనులకు నియమించింది మంజరీదేవి.

ఆమె దేవాలయానికి వెళ్ళగానే తలుపు తెరుచుకొని రేఖ పైకి వెళ్ళుతున్నది. గిరిబాబు దగ్గర క్రమంగా చనువు ఏర్పడుతోంది రేఖకు. స్నేహంగా తలఎత్తి మాట్లాడటము ప్రారంభించింది.

కాని రాత్రిళ్లుమాత్రం మంజరీదేవి మాటలు జ్ఞాపకం వచ్చి కన్నీరు కార్చటం మానలేదు. తను వ్రాసిన ఉత్తరాలకు తల్లి జవాబివ్వటంలేదు. ఎందుకని ? ఆమెకు కూడా తను బరువైపోయిందా ?

తనిప్పుడు ఖైదీ. చావటానికి కూడా స్వాతంత్ర్యం లేదు. గిలగిలా కొట్టు కుంటుంది రేఖ మనసు.

*　　*　　*

రేఖ, కోసిచ్చిన పళ్లు రెండు పళ్లేలలో సర్ది – ఒక ప్లేటు ఆమె ముందుకు నెట్టి "ఇంతకూ పెళ్ళికొడుకును చూపించిందా మా అమ్మ?" అడిగాడు గిరిబాబు.

"వస్తాడట రేపు పెళ్ళనగా. నాకేదో భయంగా ఉంది. అయినా నన్ను పంపించేస్తే గొడవ వదిలిపోయేదానికి నాకు పెళ్ళిచేయాలన్న పంతమేమిటో అర్థంకాలేదు. ఆ పెళ్ళికొడుకు ఎవరో ఎలా ఉంటాడో తెలియదు. కాని పెళ్ళి పనులుమాత్రం అన్నీ జరుగుతున్నాయి. డబ్బుగలవాళ్ళకు అసాధ్య మేముం టుంది ?" అంతలో రేఖ ముఖం ముడుచుకుపోయింది.

"అమ్మ ఇంత కఠినంగా ప్రవర్తిస్తోందా ?" గిరిబాబు గొణుక్కున్నాడు.

చివ్వున తలెత్తింది రేఖ. "గిరిబాబూ ! మానవస్వభావం చాలా విచిత్ర మైంది. అది ఎప్పుడు ఎలా ఉంటుందో ఎవరూ సూచనగా తప్ప నిర్ధారణగా చెప్పలేరు. ఒక మంచి మనిషి ఎల్లవేళలా మంచిగా ఉండలేకపోవచ్చు. కొందరి తోనే మంచిగా ఉండవచ్చు. అందరికీ మంచిగా ఉన్న మంజరీదేవిగారు – నా విషయంలో ఇప్పుడు ఈ విధంగా ప్రవర్తించటానికి కారణం ఏమిటి ? అది కేవలం నా దురదృష్టమనుకొంటాను." ఉద్రేకంతో అనేసింది రేఖ. కాని – మరునిమిషంలోనే లేచి నిలబడి, "నాది చాలా తెలివితక్కువ ప్రవర్తన. మీ అమ్మగారిని మీ ఎదుటనే విమర్శించటం చాలా పొరబాటుపని. ఏదో ఆవేశంలో అనేశాను. క్షమించాలి." రెండుచేతులూ జోడించింది.

"ఇందులో నీ తప్పేంలేదు రేఖా ! నీవొక బాధితురాలివి. కష్టాలు పడు తున్నదానవు. ఉపకారం పేరుతో అపకారాన్నే చవి చూస్తున్నదానవు. నీ అను భవంకొద్దీ విమర్శించావు, తప్పులేదు. అయినా అమ్మ ఎప్పుడూ ఇలా ప్రవర్తించగా నేను చూడలేదు. విననైనా లేదు. అవునులే. నే నీ మేడపైన ఖైదు చేయబడిన వాడిని–నాకేం తెలుస్తాయి అన్ని సంగతులూ? నాతో మాట్లాడే దెవరు ? చెప్పే దెవరు ?"

'ఇంత బాధ ఉన్నదా ఇతడి గుండెలో ?' రేఖ తలెత్తి చూసింది. అతడు కిటికీగుండా దూరానికి తన చూపులను పోనిచ్చాడు. తల తిప్పటంలో అతడి కంటికి పెట్టుకున్న జోడు తళుక్కున మెరిసింది. అతడి నొక్కుల

క్రాపులోనుంచి ఒకటి రెండు వెంట్రుకలు ఎదురు తిరిగి గాలికి కదులుతున్నాయి.

కురచదేహం పైన పెట్టినట్టున్న పెద్దతల - ముఖం — ఆ ముఖంలో తేజస్సు లొలికే రెండు పెద్దకళ్లు. అవి తెలివిగా చురుగ్గా చూడగలిగినవి. ఆ కళ్ళల్లోకి చూడలేకపోతోంది రేఖ కాని వాటి లోతులను చూడాలన్న ఆస క్తి-కుతూహలం ఆమెను పురికొల్పుతున్నాయి.

"నేనిట్లా పైకి వస్తున్నట్టు మంజరీదేవిగారికి తెలిస్తే ఆమెకు కోపం రావచ్చు. అసలే నామీద ఆగ్రహించి ఉన్న ఆమెకు మరింత కోపం తెప్పించటం మంచిదికాదు. నేను వెళ్తాను" లేచింది రేఖ.

ఈనాడు గిరిబాబు ఆహ్లాదంగా లేడని గ్రహించింది రేఖ. ఆమె అక్కడ ఉన్నంతసేపూ ఏదో ఆలోచిస్తున్నట్లే కనబడ్డాడు. రేఖ గబగబా దిగి వచ్చి తలుపులు వేసింది. ఆమె తన గదికి చేరుకోకముందే మంజరీదేవి వచ్చినట్లు కారు చప్పుడు వినవచ్చింది.

దేవిడీకంతకూ బూజులు దులిపి రంగులు వేస్తున్నారు. తోటంతా శుభ్రం చేశారు. ఎండుకొమ్మలు కొట్టివేశారు. చెట్లకుండీలకు జాజురంగు పూశారు. తలుపులకూ, కిటికీలకూ కొత్తరంగులు వేశారు. గడపలకు పసుపు, కుంకుమలు పెట్టారు. ఆ దేవిడీ కొత్తరూపం దాల్చినట్టుగా ఉంది. శుభకార్యం జరపబోతున్న దానిలా దేవిడీ కళకళలాడుతున్నది.

మరునాడు ఉదయమే మామిడాకు తోరణాలు కడతారు.

ఉదయం పదిగంటలవేళ రేఖను పెళ్ళికూతురిని చేస్తారు.

పురోహితుడితో అతడు చేయవలసిన పనులు పురమాయిస్తున్నది మంజరీదేవి. పూజ గదికి ఎదురుగుండా వున్న విశాలమయిన హాలులో పెళ్ళి జరిపించమని స్థలం చూపిస్తున్నది మంజరీదేవి

అటకలమీదినుంచి పాత్రసామగ్రిని దింపించి తెల్లగా తోమి బోర్లించిన వాటిని వంటమనిషికి చూపించింది. తెప్పించి బాగుచేయించిన పప్పు, ఉప్పు మొదలైనవాటిని లోపల భద్రపరచమని చెబుతున్నది అధికారస్వరంతో మంజరీదేవి.

ఆమె ఒక్కొక్కమాట ఒక్కొక్క శూలంలా పొడవటం మొదలుపెట్టింది రేఖను.

తనను బలిచేయటానికి అంతా సిద్ధముచేసింది మంజరీదేవి.

ఈ పెళ్ళి విషయంలో ఆమెకున్నది స్వార్ధమా ? లేక పట్టుదలా ?

ఏది ఏమయినా పెండ్లికొడుకును చూసిన తక్షణమే తాను ముందుగా నిశ్చయం చేసుకున్నట్టు బావిలో దూకేస్తుంది.

తటాలున రేఖ కో విషయం స్ఫురించింది. తాను వ్రాసిన ఉత్తరాలు తల్లికి నిజంగా చేరలేదేమో! అవి పోస్టులో పడకుండా ఎవరయినా జాగ్రత్త తీసుకుంటున్నారేమో! ఎంత తియ్యగామాట్లాడినా యాదమ్మకూడా మంజరీదేవి ఉప్పు తినే నౌకరేకదా!

రేఖ నిస్సహాయురాలిలా మంచమ్మీద వాలిపోయింది. ఆమెకు ఎంత దుఃఖము వస్తున్నదో అంత కోపంగాకూడా ఉంది. ఒకరిమీద ఆధారపడిన పేదలబ్రతుకులు ఇంతేలే అనుకుంటుంది మధ్యమధ్య.

* * *

దుమ్ముపట్టిన కాళ్ళతో రేగిన తలవెంట్రుకలతో ఎర్రబడ్డ కళ్ళతో గేటు నెట్టుకుంటూ పరుగువంటి నడకతో గదిలోకి వచ్చిన మాణిక్యం కూతుర్ని కౌగలించుకుని బావురుమని ఏడ్చింది.

"అమ్మా! వచ్చేశావా? నేను ఎన్ని ఉత్తరాలు వ్రాశాను నీకు? ఒక్కదానికయినా జవాబివ్వలేదు నీవు. మనం ఇక్కడినుంచి వెళ్ళిపోదాం పదమ్మా, ఇంక ఒక్కక్షణమయినా ఉండొద్దు. ఈ ఇల్లు ఒక కత్తులబోనులా ఉంది. పోదాం పద" తల్లిని తొందరచేసింది రేఖ.

కూతుర్ని మళ్ళీ కౌగిట్లోకి తీసుకుని, "ఈ ఆపదనెట్లా దాటగలమమ్మా" అంటూ బిగ్గరగా ఏడ్చింది మాణిక్యం.

"రేఖా!" గడపలో నిలబడి నిప్పులు గ్రక్కుతూ కేకబెట్టింది మంజరీదేవి.

"మంజరీదేవిగారూ! నేను తీసుకువెళ్ళి పెళ్ళిచేస్తానంటే వద్దని ఇప్పుడు నా బిడ్డగొంతు ఇలా కోయాలని చూస్తున్నారా? మీకు చేతులెలా వస్తున్నాయి? ఎంత ధనవంతులయితే మాత్రం ఇంత స్వార్థమా?" అరుస్తూ మంజరీదేవి ఎదుట నిలబడ్డది మాణిక్యం.

"మాణిక్యం! నీవు ఉద్రేకపడకు. నేను రేఖకోసం ఖర్చుచేసిన ప్రతి పైసా నా స్వార్థాన్ని దృష్టిలో పెట్టుకునే చేశాను. నేను చేయదలచుకున్న పనిని ఇప్పుడెవ్వరూ ఆపలేరు. నన్నుతిట్టినా శపించినా ఆపని జరిగి తీరుతుంది. కన్నతల్లివి, కంటితో చూస్తావని రమ్మని వ్రాశాను. ఆవేశం తగ్గించుకో. నీ కూతురికి నేను అన్యాయం చెయ్యటంలేదు. సకలైశ్వర్యాలు గల ఈ ఇంటికి కోడలిని చేస్తున్నాను. రేఖను దీవించు."

పిడుగు మీద పడినట్లయింది మాణిక్యానికీ రేఖకూ. మాణిక్యానికి పిచ్చెక్కినట్లయింది. "మీరు కామేశ్వరీదేవిగారి చెల్లెలని గౌరవమిచ్చాను. నా బిడ్డను ఇంతకాలమూ పోషించారని మర్యాదగా మీ ఎదుట నిలబడ్డాను. నేను దిక్కులేని పేదరాలిని. మా జీవితాలతో ఆడుకోవటం న్యాయంకాదమ్మా! నా బిడ్డగొంతుకోసి నా కడుపులో చిచ్చుపెట్టకండమ్మా" మాణిక్యం ఏడుస్తూ మంజరీదేవి చేతులు పట్టుకుని ఆమె పాదాలమీదికి జారింది.

"ఛీ! నా పాదాలు ఒదులు. మీకెంత ఉపకారంచేసినా గ్రహించరు" కాళ్ళు వెనక్కు తీసుకుని ప్రక్కకు జరిగింది మంజరీదేవి. కోపంతో కళ్లూ ముఖమూ జేవురించాయి. పళ్ళు పటపట లాడించింది.

హారన్ మ్రోగిస్తూ లోపలికి దూసుకుంటూ వచ్చిన కారు ఆగిన శబ్దము విని తలెత్తి చూసింది.

ఎవరిదీ కారు? మళ్ళీ ఎవరు వచ్చారు? కళ్ళు చిట్లించుకుంటూ హాలులోకి వచ్చిన మంజరీదేవి కారుడ్రైవరూ నర్సిమ్లూ పట్టుకుని ఎవరినో లోపలికి తీసుకు రావటమూ, వాళ్ళ వెనుక కామేశ్వరీదేవి కొడుకు సురేష్ మెట్లు ఎక్కి లోపలికి రావటమూ కనబడ్డది.

నర్సిమ్లు ఆ మనిషిని సోఫాలో పడుకోబెట్టాడు. డ్రైవరు ఒంటిమీద బట్టలు సరిచేశాడు.

"ఆంటీ! అమ్మ కాళ్ళనొప్పులతో బాధపడుతోంది. తను రాలేకపోయింది. నేను మొన్ననే బొంబాయినుంచి వచ్చాను. నన్ను పంపించింది. నేను వస్తుంటే ఈ ఊరి పొలిమేరల్లో ఈ మనిషి పడిఉన్నాడు.దిగి చూశాను.ఒంటిమీద స్పృహ లేదు. నాడి కొట్టుకుంటోంది.లేవదీసి నేనూ డ్రైవరూ వెనకసీట్లో పడుకోబెట్టుకుని తీసుకువచ్చాము డాక్టర్ని పిలిపించు ఆంటీ. పాప మెవరోకాని ఒళ్ళుతెలియ కుండా పడిపోయాడు" సురేష్ జేబురుమాలతో ముఖమంతా అద్దుకొంటూ చెప్పాడు.

"మొదటినుంచీ నీదంతా ఉరుకుపరుగులు పన్లు నర్సిమ్లూ! రహ్మాన్‌వచ్చాడో లేదోచూడు.వస్తే డాక్టరుగారిని తీసుకురమ్మని చెప్పు.అయినా సురేష్! దారిలోనే హాస్పిటల్ ఉన్నదికదా! అక్కడ చేర్పించి రాకపోయినావా?" అంటూ లోపలికి వెళ్ళి అతడికి కాఫీటిఫిన్ల ఏర్పాటుచేసింది మంజరీదేవి.

కాఫీకప్పు అందుకుంటూ "ఆ మాట తోచలేదు, ఆంటీ! పోన్లే పాపం! డాక్టర్ని వచ్చి చూడనీ. అంతగా అయితే ఆయనే తీసుకువెళ్ళి చేర్పిస్తాడు.

ఆంటీ! . ఇంతకూ పెళ్ళెప్పుడు? అసలింతకూ ఈ పెళ్ళికి గిరిబాబు ఒప్పు కున్నాడా? అడిగిచూశావా? ఏమోగాని అమ్మ తనకంత ఇష్టమున్నట్టుగా చెప్ప లేదు."

"సురేష్! ఎవరికో ఇష్టంలేదని నేను చెయ్యదలచుకున్న పని ఆపేస్తాననుకున్నావా? వట్టిమాట! గిరిబాబు......" ఆమె మాట పూర్తిచెయ్యకముందే కారు దిగి డాక్టరు లోపలికి వచ్చాడు.

సురేష్ దిగ్గున లేచి డాక్టర్ని సోఫాదగ్గరికి తీసుకువెళ్ళి చూడమని చేతిసైగ చేశాడు.

బాగా పరీక్షచేసిన డాక్టరు తన పెట్టెతెరిచి ఒక ఇంజక్షను ఇచ్చాడు.

"ఏమయింది డాక్టరుగారూ! కారు చాలా స్పీడులో వస్తున్నది. ఆ డొంకల్లో ఈయన పడిఉంటే తీసుకవచ్చాము. కారుతగిలి పడిపోయాడేమో నను కున్నాను మొదట. డ్రైవరు కాదంటున్నాడు. గాయాలేమయినా ఉన్నాయా?" సురేష్ ఆందోళన పడుతున్నాడు.

"అటువంటిదేమీలేదు. శోషవచ్చి పడిపోయిఉంటాడు. వేడివేడి కాఫీగాని పాలుగాని ఇవ్వండి. కొంతసేపటికి స్పృహ వస్తుంది. మళ్ళీ నేను సాయంత్రం వచ్చి చూస్తాను," అంటూ పెట్టె సర్దుకున్నాడు.

గంటసేపటికి తెప్పరించుకుని మెల్లిగా కళ్ళుతెరిచాడు ఆయన. చుట్టూ ఉన్న వాళ్ళందరినీ ఒకసారి కలయజూశాడు ఒక్కకంటితో.

ఎదురుగుండా ఉన్న నర్సిమ్లు, "దొరా! దొరా! ఎక్కడినుంచి వస్తున్నారు? ఎక్కడ పడిపోయారు?" సంభ్రమంతో చేతులు నులుపుకుంటూ దగ్గరగా వచ్చాడు.

కొద్దిదూరంలో సోఫామీద కూర్చున్న మంజరీదేవి దిగ్గునలేచి వచ్చి ముఖంలో ముఖంపెట్టి చూసింది.

మందహాస రేఖ ఒకటి ఆయన పెదవులమీద నాట్యం చేసింది.

షాక్ తగిలినట్టుగా మంజరీదేవి వెనుక్కు అడుగులు వేసుకుంటూ వెళ్ళి సోఫాలో కూలబడిపోయింది.

విస్మయంతో చూస్తున్నాడు సురేష్‌బాబు.

గోపాలకృష్ణరాయడు తిరిగి వచ్చాడనీ దారిలో పడిపోతే సురేష్‌బాబుకారులో తీసుకువచ్చాడన్న వార్త క్షణంలో ఆ దేవిడీ అంతా ప్రాకిపోయింది. నౌకర్లంతా ఒక్కొక్కరే వచ్చి దణ్ణాలు పెట్టి పోతున్నారు.

ఏడ్చిఏడ్చి కళ్లు తుడుచుకుని యాదమ్మ చెప్పినవార్త నిజమవునా కాదా అని గదిలోనుంచి బయటికి వచ్చి చూశారు మాణిక్యం రేఖా.

మాణిక్యానికి ఒక ఆశారేఖ ద్యోతకమయింది. గోపాలకృష్ణరాయడికి తన గోడు వినిపిస్తే కొంతలాభం ఉండకపోదు. ఆయన ఇంత దారుణానికి ఒడిగట్ట డన్న నమ్మకం ఆమెకు కలిగింది. కాని ఆయనింకా తేరుకున్నట్టు లేరని గోడ కానుకుని నిలబడ్డది.

మధ్యాహ్నం ఒంటిగంట దాటింది అందరూ పేరుకు భోజనాలు చేశా మనిపించారు.

నర్సిమ్లు గోపాలకృష్ణరాయడికి దగ్గరగా క్రిందకూర్చుని తల వంచుకుని ఆలోచనలో పడ్డాడు. దాదాపు పాతికసంవత్సరాలు కావచ్చింది ఆయన గృహ త్యాగంచేసి. వృద్ధాప్యం బాగా కనుపిస్తోంది. ఎట్లా వెళ్ళాడో అట్లాగే వచ్చాడు అకస్మాత్తుగా. దొరసాని తలపెట్టిన పనులు ఎట్లా జరుగుతాయో చూడాలి. ఇద్దరిమధ్యా పరిస్థితులు ఎలా ఉంటాయోనని ఊహిస్తున్నాడు.

దొర ఉండటానికే వచ్చాడా? లేక పెళ్ళిసంగతి విని వచ్చాడా?

నర్సిమ్లు ఊహించలేకుండా ఉన్నాడు.

సాయంకాలం ఐదుగంటలకు డాక్టరు వచ్చేసరికి గోపాలకృష్ణరాయడు మెల్లగా లేచి కూర్చున్నాడు. స్నానం చేయించి నర్సిమ్లు తొడిగించిన ఇస్త్రీ బట్టలతో-తలదువ్వుకుని కళ్ళజోడు ధరించి రీవిగా కనబడుతున్నాడు.

నౌకర్లద్వారా తెలుసుకున్న డాక్టరు సవినయంగా ఆయనకు చేతులు జోడించి, "ఎలాఉంది మీకు? ప్రొద్దున చాలా నీరసంగా కనుపించారు. గ్లూకోసు వేసి గ్లాసెడు పళ్ళరసం తీసుకోండి. సెలవు" అంటూ వెళ్ళిపోయాడు డాక్టరు.

శ్రావణమేఘాలు గర్జించి గర్జించి కుండపోతగా వర్షించటం మొదలు పెట్టాయి. దేవిడీలో నిస్తబ్ధత ఆవరించుకున్నది,

సంధ్యవేళ ఉరుములతో పెళపెళలాడుతూ వచ్చింది వర్షం. ఆ ఊరిని నీటితో కడిగి తీసింది. మరోగంటకల్లా తెరిపిచ్చింది. జనం నీటిమడుగుల గుండా తిరుగుతున్నారు.

గోపాలకృష్ణరాయడు లేచి కూర్చోగానే మాణిక్యం ఆయన కెదురుగా వచ్చి చేతులు జోడిస్తూ, "బాబూ! మీరా! ముకుందం బాబూ! మీరెలా వచ్చారు? దారిలో పడిపోయారని అంతా అంటున్నారు ఎలా పడ్డారు? మీరేనా ఈ యింటి

యజమాని? నా గోడంతా రైల్లో విన్నారుకదా బాబూ!" పాదాలను తాకి కళ్ళ కద్దుకున్నది.

ఆయన చిరునవ్వుతో సమాధానమిచ్చాడు. తల పంకిస్తూ మంజరీదేవి వంక చూశాడు. ఆమె చేష్టలుడిగి చిత్తరువులోని బొమ్మలా మధ్యాహ్నంనుంచీ కూర్చున్నది కూర్చున్నట్లే ఉంది గ్లాసెడు మంచినీళ్ళయినా తీసుకోలేదు.

ఆయన అంతా గ్రహించినట్లే పెద్దగా నవ్వాడు.

"అయితే నీకో కొడుకు పుట్టి పెళ్ళికి ఎదిగాడన్నమాట!" మంజరీదేవి నుద్దేసించి అన్నాడు ఆ పెద్దహాలులో ఆయన కంఠధ్వని కంచుగంటలా మ్రోగింది.

మంజరీదేవి తలెత్తి ఒకసారి ఆయనవంకచూసి తలదించుకుంది మళ్ళీ.

"ఈ యింటికీ ఆస్తికి వాడేనన్న మాట వారసుడు!"

హాలంతా నిశ్శబ్దంగా ఉంది. ఎవరినోటంటా ఒక్కమాటయినా రాలేదు.

"ధనం దుర్వ్యయమయినా ఈ వంశీయుల రక్తానికే వారసత్వం లభిస్తుంది."

ఆయన సంధించి విడిచిన బాణాలు ఆమె హృదయాన్ని తూట్లుచేస్తున్నాయి.

"ఏం మాణిక్యమ్మా! డబ్బు కాసించి నీ కూతుర్ని ఈమె కోడలిగా చేస్తున్నావా? నేను ఉన్నంతవరకూ మీఅటువంటివాళ్ళ ఆటలు సాగవని తెలుసుకో."

"ఏం రేఖా! ఐశ్వర్యాన్నిచూసేకదూ ఈ పెళ్ళికి అంగీకరించావు?"

"ఛీ ఛీ! డబ్బు చూడగానే ఎంత విచక్షణాజ్ఞానం నశించిందీ మీ అందరిలో?"

"నా పీడ విరగడయిందనుకొని అందరూ తలావొక కుట్రా పన్నారన్న మాట!"

"తక్షణం మీరంతా నా దేవిడీలోనుంచి వెళ్ళిపోండి" చాలా గంభీరంగా ఉందాయన ముఖం. తాము నిరపరాధులని చెప్పుకోవటానికికూడా ఆయన వ్యవధి ఇవ్వటంలేదు మాణిక్యం చేతులు నులుపుకుంటూ గోడకంటుకు పోయింది.

వెక్కి వెక్కి ఏడుస్తున్నది మంజరీదేవి.

అప్పటినుంచీ చివరిమెట్టుమీదనుండి ఈ మాటలన్నీ ఆలకిస్తున్న గిరిబాబు చూసుకుంటూ వచ్చాడు వాళ్ళమధ్యకు.

అందరూ అతడినిచూసి చకితులయ్యారు.

"గోపాలకృష్ణరాయడుగారూ? ఇంతకాలంనుంచీ నాకు తెలియని విషయాలను మీ మాటలవల్ల గ్రహించాను. నా పరిస్థితులేమిటో తెలుసుకున్నాను. నాకు దురాశ లేదు. కాని—నాకు తెలియకుండానే మీ ధనం చాలా నా క్రింద వ్యయ మయింది. నా సంగతి నాకు ఇంత విపులంగా తెలిసిన తరువాత నే నొక్క-క్షణమయినా ఈ యింట్లో ఉండదలచలేదు." గిరిబాబు మంజరీదేవిని సమీపించి ఆమె పాదాలంటి, "అమ్మా! కడుపుతీపికొద్దీ దురాశపడినట్లున్నావు. నా పట్ల చూపించిన వాత్సల్యానికి ఋణపడి ఉన్నాను. కాని—ఈ యింట మరి ఉండ లేను." ఉద్రేకరహితంగా అందరికీ ఒకసారి చేతులు జోడించాడు. కాళ్ళ చెప్పులుకూడా హాల్లో దిగవిడిచి, ఒంటినున్న షర్టుతీసి కుర్చీలో పడేసి, మామూలు పైజమాతో బనియన్‌తో చరచరా హాలుదాటి మెట్లుదిగి—దేవిడీ ముందున్న తోటగుండా గేటుదాటాడు.

గోపాలకృష్ణరాయడు ఎదురుచూడని ఘట్టమన్నట్లుగా ఆయన ముఖం మరింత గంభీరముద్ర వహించింది.

మంజరీదేవి కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్నది.

దీని పర్యవసానమేమిటోనని అందరూ మౌనంగా చూస్తున్నారు.

గోపాలకృష్ణరాయడు అందరి ముఖాలనూ పరిశీలనగా చూస్తున్నాడు.

చటుక్కున గదిలోకి వెళ్ళి అలంకరాలన్నీ తీసివేసింది రేఖ. కట్టుకున్న చీరె విడిచి సామాన్యమైన చీరె కట్టుకుని గబగబా హాలుదాటి గేటుదాటి నూరు గజాలు అప్పుడే నడిచి వెళ్ళిన గిరిబాబును కలుసుకుని అతడి చేయందుకుని కళ్ళలోకి చూసింది.

"రేఖా! రేఖా!" అన్నమాటలు మాణిక్యానికి తెలియకుండానే సన్నగా ఆమె నోటివెంట వెలువడ్డాయి

అందరి ముఖాలనూ పరీక్షగా చూసిన గోపాలకృష్ణరాయడు హాలు మారు మ్రోగేటట్టుగా నవ్వాడు. ఆ నవ్వులో విజయగర్వం వెల్లివిరిసింది.

"నర్సిమ్లూ! కారు తీసుకెళ్ళి ఇప్పుడు వెళ్ళిపోయిన అమ్మాయినీ అబ్బాయినీ ఎక్కించుకురా" ఆజ్ఞాపించాడు గోపాలకృష్ణరాయడు.

"మంజరీ! నేను వచ్చి నీ పథకాలనన్నిటినీ తలక్రిందులు చేసినట్లున్నాను కాని—భయపడకు. నేనీ యింట్లో ఉండబోటంలేదు. రేపు సాయంత్రమే నా ప్రయాణం. అంతవరకూ నా ఉనికిని సహించగలవు కదూ? లే. ధైర్యం తెచ్చుకుని భోజనం చేసిరా—పగలంతా ఉపవాసం చేసినట్లున్నావు!"

అది హాస్యమో—ఎగతాళో—నిజమో తెలుసుకోలేని స్థితిలో ఉన్న మంజరీదేవి వాచి ఎర్రబారిన కళ్లెత్తి చూసింది.

గోపాలకృష్ణరాయడికి గేటుదగ్గరెవరో తచ్చాడుతున్నట్టు కనబడ్డది. లోపలికి తీసుకురమ్మని నౌకర్ని పంపాడు.

బిడియపడుతూ లోపలికి వచ్చి నిలబడ్డాడతడు.

"ఇలా కూర్చోండి. గేటుదగ్గరే నిలబడిపోయారేం?"

అతడు చిరునవ్వుతో నాలుగుప్రక్కలా కలియచూస్తున్నాడు.

"ఇక్కడెవరైనా మీకు తెలిసినవాళ్ళున్నారా? అన్నట్లు నిన్నటి రైలులో మేము కూర్చున్న కంపార్టుమెంటులో మీరూ ఉన్నట్టున్నారుకదూ పై బెర్తుమీద" గోపాలకృష్ణరాయడి నవ్వు మళ్ళీ అందరి చెవుల్లో గింగురుమన్నది.

కబుర్లు చెప్పుకుంటూ తారురోడ్డుమీద చకచక నడుస్తున్న రేఖా గిరిధర బాబులను నర్సిమ్లు కార్లో ఎక్కించుకుని ఇంటికి తీసుకువచ్చా డంతలో.

"వధూవరు లొచ్చారు. ఎర్రనీళ్ళు దిగతుడిచి లోపలికి తీసుకురండి." అన్నాడు హాల్లో నిలబడ్డవాళ్ళ నుద్దేశించి గోపాలకృష్ణరాయడు.

మాణిక్యం మంజరీదేవి ముఖంలోకి చూసింది. ఆమె వంచిన తల ఎత్తలేదు. కాని మాణిక్యం దృష్టి గోపాలకృష్ణరాయడి ప్రక్కన కూర్చున్న ప్రయాణీకుణ్ణి చూసినప్పటినుంచీ కలిగిన విస్మయాన్ని అణచుకోలేకపోతోంది. అతడు కుంటుతూ నడుస్తున్నాడు మూతి వంకరబోయింది. తలవెంట్రుకలన్నీ రాలిపోయి ఇంచుమించుగా బోడితలలా ఉందేకాని ముమ్మూర్తులా తన భర్త ప్రకాశరావులా ఉన్నాడు.

గోపాలకృష్ణరాయడు ఆయనను అడుగుతున్నాడు.

"ఏమిటండీ! ఈ జరుగుతున్న నాటకంలో మీకుకూడా సంబంధముందా?" కూర్చున్నచోటినుండి లేవటానికి ప్రయత్నిస్తున్న మాణిక్యాన్ని చూస్తూ ప్రశ్నిస్తున్నాడు.

అతడు వధూవరులను చూస్తూ తలతిప్పాడు జవాబుగా.

---




**చిం**పిరి దెయ్యంలా, అమావాస్య చీకటిలా ఉంది ఆ చింతచెట్టు. ఆ చెట్టు చాలాకాలంనుంచీ అక్కడే ఉంది. ఊరి మధ్యగా ఉన్న ఆ చింతచెట్టు తరతరాల మనుష్యులను చూసింది. విభిన్న మనస్తత్వాలుగల మనుష్యులనూ చూసింది. ఆ చెట్టు ఎన్నోసార్లు ఆకులు రాల్చింది, పూలు పూసింది, కాయలు కాసి ఊరి

కె లలితాచలం

వారికి ఇచ్చింది. మాటలు రాని ఆ చెట్టులో మార్పులు ఊరివారికి అందంగా కనుపించాయి. ఆ చింతచెట్టులో ఎన్ని మార్పు లొచ్చినా, ఆ ఊరివారిలో ఏ మార్పూ రాలేదు. ఆ ఊరిలోకూడా ఏ మార్పూ రాలేదు.

ఆ చింతచెట్టు నీడే ఆ ఊరి రచ్చబండగా మారింది. ఊళ్ళో జరిగే ప్రతి విషయం రచ్చబండ చేరాల్సిందే. ఆ రచ్చబండ ఆ ఊరికి న్యాయస్థానం. అది అన్యాయాన్ని న్యాయంగా మార్చి తీర్పుచెప్పే నేర్పు స్థానం. న్యాయాన్నీ, సత్యాన్నీ పచ్చిఅన్యాయంగా, అబద్ధంగా మార్చి, అక్రమంగా తీర్చి దిద్ది, అదే న్యాయమని కరాఖండిగా తీర్పు నిచ్చే మార్పు స్థానం. ఆ ఊరివారు ఇచ్చిందే తీర్పు. వారి నేర్పుకు తీర్పు లొంగి పోయింది.

చింతచెట్టు న్యాయాన్ని ఏనాడూ వినలేదు. కాని అన్యాయాల్ని మాత్రం చాలాసార్లు చెవులు బెరడు కట్టేటట్లు విన్నది. కాని తను చూచింది న్యాయమైనా, అన్యాయమైనా, ఏమీచెయ్యలేకపోయింది. చింత చావకపోయినా పులుపు చచ్చినదానిలా నోరు మూసుకుంది. న్యాయం చస్తున్నా, తను చావకుండా ఉండాలనుకుంది మనుష్యులందరిలా ఎప్పటికైనా తాను చచ్చినా న్యాయం బ్రతకా లనుకునేది పిచ్చిగా. ఏమిటో ఆ పిచ్చి కోరిక, పిచ్చి నమ్మకం, న్యాయం బ్రతుకుతుందని !

మనసులో కక్ష పేరుకుపోయింది, చింతచెట్టుకు. కాని అసమర్థులైన మనుష్యుల్లా ఏమీ చెయ్యలేక, శకుని మామ కౌరవులను ప్రేమించినట్లుగా, తన నీడన జూదగాళ్ళకు చోటిచ్చింది. అన్యాయవాదులకు చోటిచ్చింది. అందుకే ఆ చింతచెట్టంటే వాళ్ళందరికీ ఇష్టం. వాళ్ళందరూ కలసి ఆ చెట్టుచుట్టూ సిమెంటు చప్టా చేయించారు. దాని ముందర గాంధీబొమ్మకూడా పెడదామనుకున్నారు. కాని ఎందుకో పెట్టలేదు. అల్లూరి సీతారామరాజు బొమ్మ పెట్టారు. ఎప్పుడైనా ఆ సీతారామరాజు బొమ్మకు 'ప్రాణం వచ్చి, మనిషిగా మారితే బాగుండు' ననుకునేది చింతచెట్టు అనుక్షణం దాన్నే చూస్తూ.

చాలా ఎత్తుగా పెరిగిన చింతచెట్టుకు ఎన్నెన్నో కనిపిస్తాయి. రచ్చబండ మీద కూర్చునేవారికి కనపడనివి కూడా కనిపిస్తాయి. రచ్చబండ దగ్గరకు చేరేవారి మనోభావాలూ స్పష్టంగా తెలుస్తాయి.

దూరంగా పచ్చని పంటపొలాలు. పొలాల్లో, ఒళ్ళు వంచి పనిచేసే ఆడవాళ్ళు, వాళ్ళపైటలు తొలగి ఒళ్ళు కనబడుతుంది. రచ్చబండమీద కూర్చున్న వాళ్ళ లొట్టలు వినిపిస్తాయి. ఆ పొలాల ప్రక్కనే ఉంది చింతల చెరువు. పొద్దున్నే బిందెలు పట్టుకుని చెరువు గట్టంటపోయేకన్నెపిల్లలు, పిల్లలతల్లులు,

తల్లుల పిల్లలు కనిపిస్తారు. స్నాన మాడే తల్లుల ఒంటికి అతుక్కుపోయిన చీరల్లోనుంచి కొట్టొచ్చినట్లు కనబడే ఒళ్ళు, స్పష్టంగా కనబడుతుంది. రచ్చ బండమీదివారికి అదొక వింత. ఆ వింతలో గిలిగింత. గిలిగింతలో పుల కింత. ఆ కనుపించేది తల్లో చెల్లో తెలుసుకోకుండా, కామం నింపుకున్న కళ్ళతో, క్రైపెక్కిన వాళ్ళలాగా చూస్తారు. వెకిలి వేషా లేస్తారు. చొల్లు కారుస్తారు. బూతులు మాట్లాడుతూ, తమకు తామే ఆనందిస్తారు. వీలుచాలు చూసుకుని ఆ స్త్రీల శీలాన్ని నీళ్ళలో పాతేస్తారు. మరునాడు శవం తేలుతుంది. ఇలా ఎన్ని శవాలో ఎన్నెన్ని శవాలో చూసింది ఆ చెట్టు. చేతనైనన్ని వేడి నిట్టూర్పులు కూడా వదిలింది చింతిస్తూ. అందుకే అది చింత—చెట్టు.

ఆ చెరువుకు అల్లంతదూరంలో పాడు బడ్డ శివాలయం, దాని పక్కనే దయ్యాల మర్రి. పట్టపగలే రాత్రి ఆ శివాలయం దగ్గర. ఆలయం దగ్గరనుంచి ఎన్నెన్నో ఆర్తనాదాలు విన్నది చెట్టు. చింతపోయింది. కాని, చింత తీర్చలేక నిస్సహాయురాలిగా నిలచింది చింత చెట్టు ఆలయప్రాంగణం ఆర్తనాదాలకు నిలయం. శీలానికి బలిపీఠం. ఆ బలి పీఠంముందు, దళారిలా నిలచిన దెయ్యాలమర్రి విషాదం దాచుకుని విక టాట్టహాసం చేస్తుంది.

ఆ గుడికేసి ఎవ్వరూ పోరు. చచ్చిన దెయ్యాలంటే వాళ్ళకి చాలా భయం. పాపం ! చచ్చిన దెయ్యాల మంచితనం తెలుసుకోలేని అమాయకులు, పచ్చి నెత్తురు పీల్చే మనుషులనే పూజిస్తారు.

ఈ విషయాలన్నీ క్షుణ్ణంగా తెలి సినా, చింతచెట్టు చెప్పదు, చెప్పలేదు. చింతచెట్టుకు తమ విషయాలన్నీ తెలుసు ననుకున్నారో, లేక అదికూడా ఆడదే కదా అనుకున్నారో, దానిమీదకూడా కన్నేసారు, పగపట్టారు.

కాని, ఇప్పుడా చింతచెట్టును చూస్తేనే జనం ఉలికిపడతారు. వేడి నిట్టూర్పులు వదుల్తారు కొందరు. ఏమీ చెయ్యలేక కన్నీరు కారుస్తారు కొందరు. విరగబడి నవ్వుతారు మరికొందరు; అప్పుడే బలుస్తున్న బుర్రమీసాల మధ్యనుంచి పగలబడి నవ్వుతారు మరికొందరు. 'చూసో్క ! నా తఢాకా !' అన్నట్లుగా పోతుమీసాలు దువ్వుతారు. వాళ్ళ నవ్వులు చూసి, చింతచెట్టు తను కూడా నవ్వుతుంది విషాదంగా.

అదే చింత, అదే చెట్టు. అది ఇప్పుడు రచ్చబండ కాదు. న్యాయస్థానం అంత కంటే కాదు. చింతచెట్టు పేరు చెబితేనే కొందరికి మహాభయం, కొందరికి గర్వం. మీసాలు మెలేసేవారు కొందరు. మీసాల చాటున రోసాలు దాచేస్తారు మరి కొందరు.

నలుపు, కారునలుపు. చింతతోనే ఆ

చెట్టును చూస్తారు. నిట్టూరుస్తారు. కళ్ళ ముందు కదిలే భయంకర దృశ్యాన్ని, అప్పుడే జరుగుతున్నట్లుగా భావిస్తారు. పటపటా పళ్ళు కొరుకుతారు. తళతళ లాడేట్లు కత్తులు నూరా లనుకుంటారు. హత్యలమీద హత్యలు చెయ్యా లను కుంటారు.

కాని ఏమీచెయ్యలేక, అధికారం కాళ్ళ కింద న్యాయంలా, బండిచక్రాలకింద నల్లేరులా నలిగిపోతున్నారు. వారితలల్లో అన్నీ సందేహాలే. ఎలా? ఎప్పుడు? పగతీర్చుకునే మార్గమేది?

ఆ సందేహాలు వారి గుండెల్లో హాలా హలంలాగా మంటలు రేపుతుంటే, ఆ మంటలన్నిటిని పరమశివుడిలా అధికారం నోరు తెరిచి మింగేస్తోంది.

అదే దృశ్యం. మళ్ళీ అదే దృశ్యం. పదేళ్ళనాటి దృశ్యం. పదేళ్ళ కిందట సంగడు పాతికేళ్ళవాడు. పగ తెలియని వాడు. అమాయకుడు. మూగవాడు. పెడితే తినడంతప్ప, అడగడం ఎరు గనివాడు. ఆంజనేయులవారు రాముల వారిని కాపలా కాసినట్లుగా, యజ మానిని కాపాడటమే తన ధర్మంగా అనుకున్నవాడు. ఆడవాళ్ళంతా సీతమ్మ తల్లులని మొక్కేవాడు సంగడు. సంగడికి వారసత్వపు ఆస్తి బోలె డుంది. అదే తరతరాలుగా తరగకుండా పెరుగుతూ వస్తున్న వెట్టిచాకిరీ. అదే, ఖజానాలో మూలుగుతున్న బంగారంగా తలచుకుని మురిసిపోతూ ఇంటెడుచాకిరీ చేసేస్తాడు యజమానిభార్య పెట్టే పాసిపోయిన పట్టెడు కూడే పంచభక్ష్య పరమాన్న మనుకుని తృప్తిగా తినడం నేర్చుకున్నవాడు సంగడు. కుక్క కాపలా కాయడం సంగడికి తెలుసు. యజమాని చెంచయ్య నాయుడికి కాళ్ళు పడతాడు సంగడు. 'చాల'న్నట్లు గుర్తుగా చెంచయ్య ఒక తాపు తంతాడు కాళ్ళతో. సంగడు నవ్వుతూ వెళ్ళి పోతాడు. ఎవరైనా 'సంగడు విశ్వాస పాత్రుడు' అంటే, తను కూడా అందామనుకుంటాడు చెంచయ్య. కాని అనడు.

ఒక రోజున — ఊరు లేవలేదు. సూర్యుడు రాలేదు. చీకటి పోలేదు. సంగడ్ని ఇద్దరు చింతలేని మొద్దులు ఈడ్చుకొచ్చారు. నడివీధిలో కింద పడే శారు. కాళ్ళతో తన్నారు, కొట్టారు, తిట్టారు. కామందుల కుక్కలు మొర గాలి కామోసని మొరిగాయి. ఊరూ వాడా లేచింది. కళ్లు నులుముకుని చూసింది. మంచుతో కప్పడిపోయి, అవతల ఏం జరుగుతోందో కనుపించటం లేదు.

పొద్దెక్కింది. జనం మూగారు. కళ్లప్పగించి చూశారు. పెదవి విప్ప లేక పోయారు. 'ఏమిటి?' అని అడగలేక పోయారు. కాని కళ్లు, దానిని స్పష్టంగా




చూసాయి. చింతచెట్టు మొదలుకు సంగడి చేతులూ కాళ్ళూ విరిచి కట్టబడి ఉన్నాయి.

నోరులేని సంగడు ఏమేమో చెప్పుకోవాలని తాపత్రయపడుతున్నాడు చేతులుకట్టి ఉండకపోతే, సంజ్ఞలతో ఏదైనా చెప్పగలిగి ఉండేవాడేమో! కాని, వాడి నోరు భగవంతుడు కట్టేశాడు. తరతరాల వారసత్వం మూగది కదా; వీడికిమాత్రం నోరెందుకని కాబోలు, ఆ దేవుడు, సంగడిని మూగవాడ్ని చేశాడు.

దేముడు కనికరించి ఒక్క నోరు కడితే, చెంచయ్యనాయుడు, కాళ్ళూ, చేతులూ గూడా కట్టేశాడు

"వాడిని నిలువునా కాల్చండిరా! సజీవదహనంచెయ్యండి." ఆజ్ఞాపించాడు చెంచయ్యనాయుడు గుడ్లెర్రచేస్తూ. ఆ పని క్షణాల్లో జరిగిపోయింది సంగడి జ్ఞాతుల చేతుల్లో. సంగడు బూడిదై పోయాడు. భగభగ మంటలు లేస్తూ, తను దహించుకుపోతున్నా చింతచెట్టు ఏమీ చెయ్యలేకపోయింది. నోరులేని సంగడు, మాటలురాని చింతచెట్టు కలిసే కాలారు. సంగడి తల్లీ, చెల్లీ, తమ్ముడూ దూరంగా నిలబడి మూగగా మొత్తుకోవడం తప్ప ఏమీ చెయ్యలేకపోయారు.

"సంగడికి అలాగే జరగాలి" అన్నారు, సాటి పెద్దల మనుకునేవారు. "అలాటివాడికి, ఇలా చెయ్యడమే న్యాయం" అన్నారు, ఆ న్యాయ నిర్ణయం సబబే అన్నట్లుగా. చెంచయ్యనాయుడి మీసాలు మరింత ఉబ్బాయి

"చెంచయ్య కూతురు ఉరేసుకు చచ్చిపోయింది. దానికి సంగడే కారణంట. సంగడు చచ్చికూడా చెంచయ్యను సాధించా డన్నారు. అసలు రహస్యం ... సంగడు, అమాయకు రాలైన చెంచయ్య వెధవ కూతుర్ని చెరిచాడుట. వాళ్ళిద్దరూ అర్ధరాత్రప్పుడు మామిడి తోపులోనుంచి రావడం చెంచయ్య కళ్ళారా చూశాడుట.

శివాలయం దగ్గరనుంచి, ఒక ఆడ కూతురు శీలం అపహరింప చూసిన వాడికి, "అదే శిక్ష" అన్నారు. "పాపం ! అయినింటి ఆడబడుచు అవమానం భరించలేక ఉరేసుకు చచ్చింది" అన్నా రే కానీ, అర్ధ రాత్రప్పుడు శివాలయందగ్గర చెంచయ్య కేం పని అని అడిగిన వారొక్కరూ లేరు. ఇది గుసగుసలతో ప్రారంభమై ఊరిన పద్దవార్త. ఇది పాత కథగా మారిపోయింది. బహుశః ఆ కథ అందరూ మరిచిపోయికూడా ఉంటారు.

కాని, ఆ చెట్టు మరచిపోలేక పోతోంది. ఎత్తున నిలబడి నిజాన్ని కళ్ళారా చూసిన ఆ చెట్టు, సంగడికి జరిగిన అన్యాయాన్ని ఏటా తలుచు కుంటుంది. సంగడితోపాటు తనూ కాలి పోయినా, సంగడికి జరిగిన అన్యా యాన్నీ, ఊళ్లో జరిగే అక్రమాన్నీ ఎదిరించేవాళ్ళు పుట్టకపోతారా ! అని ఏటికొకసారి చిగురిస్తూనే ఉంది, చావని ఆశతో. కళ్ళు కాయలు కాచేలా కాస్తూనే ఉంది. ఆశ నిరాశై ఆకులు రాలుస్తూనే ఉంది. కనుచూపుమేరలో తన ఆశ చిగురించే అవకాశం లేదేమో నన్న చింతతో మోడుబారిపోయింది.

కాని, తాను చూచిన నిజం ఆరని నిప్పుకణంలా ఆ చెట్టు గుండెల్లో నిత్యం రగులుకుంటూనే ఉంది.

ఊరు మాటుమణిగాక, కటిక చీకట్లో, తనలో తనే మననం చేసుకుం టుంది ఆ చెట్టు. సంగడు ఆ రోజు రాత్రి ... కర్రతో అలికిడి చేస్తూ దెయ్యాలమర్రివైపు నడుస్తున్నాడు. తెల్లచీరకట్టుకుని కొంగు నిండా కప్పు కుని, చెంచయ్యనాయుడి వెధవ కూతురు సంగడి వెనక నడుస్తోంది. దెయ్యాలమర్రి దగ్గర మునసబు తమ్ము డిని కలుసుకుంది. "నాకు నెల తప్పింది. ఊరు వదిలి ఎక్కడికైనా పోయి పెళ్ళిచేసుకుందాం" అని బ్రతిమి లాడింది. ఇటువంటి దీనాలాపాలు ఎంతమందో చేశారు. విన్నాడు మున సబు తమ్ముడు. వాళ్ళ కిచ్చిన సమా ధానమే నాయుడి వెధవ కూతురికీ ఇచ్చాడు.

"నెల తప్పినదాన్నల్లా పెళ్ళిచేసు కుంటే, నా పెళ్ళాలతో ఊరే నిండి పోతుంది. నా నెలవే తప్పిపోతుంది" అని పెద్దగా విషపునవ్వు నవ్వాడు.

నీళ్ళు తాగరు ... ముందిక్కడనుంచి వెళ్ళిపో." ఆవేశంగా అరుస్తూన్న అతనికి దగ్గుతెర వచ్చింది.

రామానికి విపరీతమైన కోపం వచ్చింది. యేమైనా చేస్తాడు. కానీ శారద ముఖంలో దీనత్వంచూసి చల్లబడి వెనక్కి తిరిగిపోయాడు.

"నన్ను క్షమించు రామం. వారి మనః పరిస్థితి బాగులేదు. నీ సహాయంగూడా సరియైన సమయంలో పొందలేని నిర్భాగ్యులం. నావలన నీ కవమానం జరిగింది," అంటూ దీనంగా యేడ్చింది. రామానికిగూడా కన్నీళ్ళు తిరిగాయి. ఎన్నో బాల్యస్మృతులు ఇద్దర్నీ పెనవేసుకున్నాయి.

"శారదా, వ్యక్తిగత బంధం వేరు, సామాజికంగా నీ స్థానం వేరు. ఎలా చూసినా నేను యేమీ కాను మీకు... కానీ...కానీ...ఈ యింట్లో తిండీ, దాతృత్వం, కరుణ, దయ నా రక్తంలో ప్రతీ అణువును ఆక్రమించుకుని వుంది. నా కర్తవ్యాన్ని సమంగా నిర్వహించాలి" అన్నాడు.

"దేనికైనా అవకాశం రావాలి కదా. పరిస్థితుల కనుగుణమైన ఆలోచనే కర్తవ్యం అవుతుంది. లోకవృత్తాన్ని స్వభావ వైరుధ్యాల్ని, నీవు సమదృష్టితో చూడగలిగే శక్తి నీకుంది. మా కుటుంబం మా బాధలు మాట అలా వుంచు. త్వరలో నీవో యింటివాడివి కావాలని నా కోరిక."

రామం పేలవంగా నవ్వాడు.

"అవినీతి కానివి. ఆర్ద్రమైన కోరికల జాజిలతలే నా కాళ్ళకు అదృశ్య బంధాలు. అవి తెంపుకోలేను. వాటిని చిన్నప్పట్నించీ ఊహ అనే పన్నీరుతో పోసి పెంచుకున్నాను. నే నెక్కడ వున్నా వాటిని సంరక్షించుకోవటం నా విధి," అన్నాడు రామం. శారద నిట్టూర్చింది. స్ఫురద్రూపి, ఆజానుబాహువైన రామం కళ్ళలో నిశ్చలత్వం, పట్టుదలా చూసింది.

"నీ కెప్పుడు ఏ సహాయం కావాలన్నా, మా చెల్లెలు వాళ్ళింట్లో నా యెడ్రసు వుంది. తప్పకుండా రాయి. చేస్తాను" అంటూ మూలనున్న పల్లకీని ఒకసారి చూసి మెట్లుదిగి పోయాడు.

ఎదురుగా ఒక పెళ్ళి వూరేగింపు వస్తోంది అయితే పల్లకీ లేదు. కారులో వధూవరులు ఊరేగుతున్నారు. శారద వీధిద్వారం తలుపుల్ని మూసేసింది.

* * *

యథోదకం దుర్గే వృకష్టం.

పర్వతేషు విధావతి!

పర్వత శిఖరముపై బడిన వర్షపు నీరు కొండ నలుప్రక్కలా పాయలు పాయలుగా అనేక మార్గాల ప్రహహించి పోతుంది.

స్త్రీ జీవితానికి ప్రయాణ సాధనాలు, చిన్నప్పుడు తల్లిదండ్రులు, తర్వాత భర్త, తర్వాత బిడ్డలు. మొదటిదశలోనే




సరియైన న్యాయం జరిగింది. తర్వాత న్యాయం జరగలేదు. పండంటి శారద జీవితం నాశనం, నరకప్రాయంచేసి క్రిష్ణమూర్తి నరకయాతన అనుభవించి చనిపోయాడు. యెంతో కష్టపడి, యింట్లో ఉన్నవన్నీ అమ్మి, పిల్లల్ని చదివించి, పెండ్లిచేసి, వాళ్ళ నీడన సేద దీరుదామంటే, ఇద్దరు పిల్లలు భార్యల మాటవిని, ఇంట్లో వున్న పాత్ర సామాను అంతా పంచుకుని, "అమ్మా! మేం ఉద్యోగాలు చేసే ఊళ్ళలో నీ వుండలేవు. ప్రతీ నెల చెరొకరం పదోపాతికో పంపిస్తాం." అంటూ కప్పదాటువేసి పారిపోయారు.

ఇంకెవరున్నారు ఆ యింట్లో. యింకేమున్నాయి ఆ యింట్లో. "వృద్ధాస్తావత్ చింతాసక్తకి" శారద మిగిలిపోయింది. వయస్సుతెచ్చిన అనుభవాల రథచక్రాల కింద నలిగిపోయి గాయపడి వెలకట్టలేని కర్ర బీరువాలు, కుర్చీలు వున్నాయి. మూలన నేను మిగిలి పోయాను.

అగ్రహారంలో యెన్నో మార్పులు వచ్చాయి. రాజకీయాలు వచ్చాయి. మనుషుల మనస్సుల్లో నిస్వార్థం స్థానంలో స్వార్థం పెరిగింది. ఊళ్ళో చిన్న చిన్న వ్యాపారస్థులు, వందలు, వేలు పెట్టినా దొరకని కర్రవస్తువుల్ని చవగ్గా కొనేసేవారు, మేడలోవి ఎంత కాలం వస్తుంది ఆ డబ్బు. శారదమ్మకి ఉపవాసాలే శరణ్యమయ్యాయి.

అయినా యేనాడూ ఆ తలుపు తీసి యెరుగదు. ఒకరికి పెట్టుటయే కాని చెయ్యిజాపి యెరుగదు. ఆమె తల్లి దండ్రులు చేసిన వ్రతాలూ, దానాలూ, ఆమె పట్టిన నోములు, నిరతాన్న దానాలు, పూజలు, పునస్కారాలు యేమీ ఆమె జీవితానికి సరియైన న్యాయం చేకూర్చలేకపోయాయి.

అయినా ఆమె ఆ పూజామందిరం విడువ లేదు.

నాలుగు రోజుల క్రితం, ఒకనాటి సాయంకాలం పూజామందిరంలో వణుకు తున్న కంఠంతో—

"తళుకు చెక్కులముద్దు బెట్టి కౌసల్య
మునుతపమేమి జేసెనో తెలియ"

అని పాటపాడుతూ, కెవ్వుమని కేక వేసింది, గుండెనొప్పితో. అంతే! తర్వాత తెలివిలేదు.

ఆ రాత్రే వూళ్లో కొందరు పెద్దలు చందా వేసుకుని డాక్టరును తెప్పించారు. తర్వాత కొడుకులిద్దరికీ టెలిగ్రాము లిప్పించారు. ఇవాల్టికి నాలుగోరోజు, సాయంకాలం యెవ్వరూ రాలేదు.

నా పల్లకిలో ముగ్ధగా, వధువుగా, సర్వలక్షణ శోభితమైన ఆనాటి శారదమ్మ...అంతిమ యాత్రకు అయాస పడుతోంది. ఆమె చచ్చిపోతుందని ప్రకృతికి గూడా తెలుసు కాబోలు హఠాత్తుగా కన్నీరు మున్నీరుగా విలపిస్తోంది.

అదిగో ఆ వానలో ముత్యాల తలంబ్రాలు పోసుకుంటూ, శారదమ్మ ఆత్మ రామనామస్మరణ చేసుకుంటూ మీదకు ప్రయాణిస్తోంది. ఇంకేం మాట్లాడను నేను...అన్ని బంధాలు అనుబంధాలు తెగిపోయాయి. నా గొంతులో స్వరాలు తెగిపోయాయి.అబ్బా......అం......

* * *

అపుడే చాలా దేశాలు తిరిగి, యెంతో డబ్బు, ఖ్యాతి ఆర్జించి, శేషజీవితాన్ని సుఖంగా గడపాలని కారులో ఊళ్లోకి వస్తున్న రామం, మేడముందు జనాన్ని చూసి, కారాపి జనంమధ్యకు వెళ్ళాడు.

పై ఊరు వెళ్ళి వచ్చి వెదుళ్ల తేవ డానికి టైముచాలక వరండాలో పల్లకీ తీసి శుభ్రంగా కడిగి శారదమ్మ మృత దేహాన్ని కడిగి అందులోనే ఉంచారు.

"చచ్చిపోయినా కొడుకులిద్దరూ రాలేదు. తలకొరివి పెట్టడానికి. విశ్వాస ఘాతకులు" అంటున్నారెవరో.

పల్లకీ కదిలింది.

శారద అంతిమయాత్రకు ప్రయాణ సాధనమైంది. దాని జన్మ చరితార్థ మైంది. రామం యింటికి వెళ్ళి అక్కడ నుండి కదిలాడు, చెరువుగట్టు క్రింద వుండే శ్మశానానికి.

"యెన్నిసార్లు ఉత్తరం రాస్తానన్నా, తన బాధలు నీకు ఉత్తరం రాయొద్దని, తన మంగళసూత్రంమీద వొట్టుపెట్టింది. అందువలన ఈ పరిస్థితులు నీకు రాయ లేకపోయాను" అన్న చెల్లెలు మాటలు చెవిలో గింగురుమన్నాయి, రామానికి.

ఆకాశానికి చీకటి పులుముకుంటు న్నది. రామం మనస్సంతా చీకటి మయం. చీకటిలో ఎర్రని జీవాగ్ని మండుతోంది. రామం చీకటిహృద యంలో సన్నని సౌందర్యపు వెలుతురు శారద పల్లకిలో ప్రయాణిస్తోంది.

---



## గోవిందరాజు సీతాదేవి

# సింగరేణి సుందరి

హైదరాబాద్‌లో ఎగ్జిబిషన్ చూసేందుకు జనం విపరీతంగా వచ్చారు. రకరకాల షాపులూ, రకరకాల సామానులూ, ఒకటేమిటి పీచుమిఠాయి దగ్గర నించి పింగాణి సామానువరకూ అదీ యిదీ అన్న భేదంలేకుండా అన్నీ ఉన్నాయి అక్కడ.

ఈ రద్దీలో పచ్చిమిరపకాయ బజ్జీల దగ్గర వాసుమూర్తి మరో స్నేహితుడితో ఒజ్జీలు తింటూనే కబుర్లు చెప్తున్నాడు.

"అరె వాసూ ... ఈ ఊళ్లో ఉంటున్నావురా ?" సూటూ బూటూ ఉన్న యువకుడు వాసుదగ్గరగా వచ్చి భుజం మీద చెయ్యివేశాడు

వాసు క్షణం పరికించాడు. అంతే. ... "అరె లక్ష్మీకాంత్ ! యిప్పుడీ హైదరాబాద్‌లో ఉండటంలేదు కదూ ! యెప్పుడొచ్చావు ? ఎక్కడికి వచ్చావు?"

బాల్యమిత్రుడైన లక్ష్మీకాంత్‌ని ఆత్మీయంగా పలకరించి అతనికీ నాలుగు బజ్జీలు యివ్వబోతూంటే అతను పుచ్చుకోలేదు.

"బాబోయ్ కారం. యివి తినటం అలవాటు తప్పింది."

"అయితే పద మా యింటికి పోదాం. అన్నట్లు నా పెళ్ళికి నీకు శుభలేఖ పంపిద్దాం అంటే నీ యిప్పటి అడ్రస్ దొరకలేదురా."

"పోనివ్వుగానీ గృహస్తువి అయావన్నమాట."

"ఊఁ...నువ్వే ముందు అయావుగా. యింతకీ మీ శ్రీమతిని తీసుకురాలేదా!"

"లేదు."

"ఏం...ఉద్యోగంలో సెటిల్ అయిన తర్వాత కూడా ఆరేళ్ళు అమ్మాయిలు నచ్చలేదు అంటూ కాలక్షేపంచేసి ఆకరికి అందాలబొమ్మనే చేసుకున్నావుట కదూ !"

"ఊఁ...మరి నువ్వు ?"

"ఇంటికి పద చూపిస్తాను."

"యిప్పుడు కాదు. మరో ఫ్రెండ్‌కి వస్తానని మాటిచ్చాను. రేపు తప్పకుండా వస్తాను."

"తప్పక రావాలి. చూడూ సెలవు పెట్టి వెయిట్ చేస్తూంటాను. యిదిగో అడ్రస్."

వాసు అడ్రసు యిచ్చాడు. లక్ష్మీకాంత్ దాన్ని ఓసారి చూస్తూ "అరె... యిదివరకూ నే నీ ఊళ్ళో ఉన్నప్పుడు యీ ఏరియాలోనే ఉండేవాడిని. యీజీగా తెల్సుకుంటానులే." షర్టు జేబులో పెట్టుకుంటూ అన్నాడు.

స్నేహితులిద్దరూ అక్కడినించి అలా అలా తిరిగి యెన్నో కబుర్లు చెప్పకొని విడిపోయారు. "తప్పక రారా." మరోసారి స్నేహితుడిని హెచ్చరించి గబగబా తన బస్ స్టాప్‌దగ్గరికి వస్తూండగానే కదలబోతూన్న బస్‌ని చూసి పరుగున వచ్చి ఎలాగో బస్ యెక్కేసి అమ్మయ్య అనుకున్నాడు బస్‌లో జనాన్ని ఓసారి కలయజూస్తూ.

## 2

అన్నట్లుగానే వాసుమూర్తి సెలవు పెట్టి స్నేహితుడికోసం యెదురుచూస్తూన్నాడు. పదిగంటలు అవుతూండగానే లక్ష్మీకాంత్ రానే వచ్చాడు ఆటోలో. వాకిట్లోనే స్వాగతం యిచ్చి లోపలికి తీసుకువచ్చి కుర్చీ చూపించాడు.

"మంచినీళ్ళు కావాలా ?" అడిగాడు.

"ఊఁ." గదిని కలయచూస్తూ అన్నాడు.

"మాది చిన్నయిల్లు. నా జీతమూ చిన్నదే అనుకో. రెండుగదులూ, ఒక చిన్న వంటగదీ... యింతే. మా యిద్ద

రికి ప్రస్తుతం చాలు. దీనికే నూట యాభై అద్దె యిస్తున్నాం." వాసు లోపలికి వెళ్ళాడు.

లక్ష్మీకాంత్ గదిని మళ్ళీ పరీక్షించ సాగాడు. గది వాకిలికీ, కిటికీకీ గులాబి రంగున్న అద్దకంపూవుల కర్టెన్‌లు వేలాడుతున్నాయి. గది మధ్యగా చిన్న టీపాయ్, దానిచుట్టూ నాలుగు కుర్చీలు వేసి ఉన్నాయి. టీపాయ్‌మీద దిన పత్రికా, వారపత్రికలు రెండూ పెట్టి ఉన్నాయి. ఒక అల్మారా ఉంది. దానికి తలుపులు లేవు. పల్చని కర్టెన్ వేలాడు తోంది. లోపల ఇంగ్లీషూ, తెలుగు నవలలు వరసక్రమంలో సర్ది ఉన్నాయి. గోడకి ఒక్క కాలెండర్‌తప్ప మరె లాంటి ఫొటోలూ లేవు. ఓ మూలగా వేసి ఉన్న చిన్న స్టూలుమీద కొండపల్లి ఏనుగు అంబారీ బొమ్మ పెట్టి ఉంది. దానికి దగ్గరే రెండు డాన్సు బొమ్మలు కూడా ఉన్నాయి. యిదంతా చూస్తూ అనుకున్నాడు - వీడి శ్రీమతి చాలా ఓపికమంతురాలులా ఉందే అని.

"మంచినీళ్ళు తీసుకోరా." వాసు అందమైన పువ్వులున్న తెల్లటి గాజు గ్లాసు ఇచ్చాడు, "ఏమిటి యేదో ఆలో చిస్తూన్నావు" అంటూ.

"అబ్బే యేంలేదు." గ్లాసు అందు కుని నీళ్ళు తాగి యిచ్చేస్తూ.

"గ్లాసూ బాగుంది, అందులోని షరబత్‌కూడా బాగుంది యింతకీ యిప్పుడు యివెందుకు."

"మా శ్రీమతి ఎండలో వచ్చిన వాళ్ళకి కాఫీ చస్తే యివ్వదు."

"మంచి అలవాటే కదూ" లోపల గదివైపు చూస్తూ అన్నాడు.

"ఒరేయ్. నువ్వు రాక రాక వచ్చావు. మా శ్రీమతిని పరిచయం చేద్దాం అనుకున్నాను నీకోసం స్వీటూ, హాటూ వగైరా అంతా చేసింది. యింతలో మా పక్కింటిలోని ఆమెని డెలివరీకి హాస్పిటల్‌కి తీసుకువెళ్ళవల సిన అవసరం వచ్చింది. పాపం ఆమెకి యెవ్వరూ లేరు. అందుకే తప్పనిసరిగా వెళ్ళవలసి వచ్చింది. 'సారీ అని చెప్పండి' అని చెప్పి వెళ్ళింది."

"అరెరె..." నిరుత్సాహపడ్డాడు లక్ష్మీకాంత్.

"సాయంత్రంవరకూ ఏంచేస్తావు నువ్వు వచ్చెయ్యి అని చెప్పాను."

"సరే" తలఊపాడు లక్ష్మీకాంత్. యింక వాసు యెప్పుటెప్పటివో కబుర్లు మొదలెట్టి చెప్పుకుపోతూంటే లక్ష్మీ కాంత్ ఆశ్చర్యంగా వింటూ అను కున్నాడు—

వీ డిదివరకు మాటే మాట్లాడేవాడు కాదు. యిన్ని కబుర్లు యెక్కడ నేర్చు కున్నాడు. చాలా హుషారుగా ఉన్నాడు. బహుశా భార్య అనుకూలవతి అయి ఉంటుంది.

"లక్ష్మీకాంత్, వంట అంతా చల్లారి పోతుంది. భోజనంచేసి కబుర్లు చెప్పు

కుందాం. రా లోపలికి'' అంటూ లేచి లోపలికి నడిచాడు లక్ష్మీకాంత్ అతన్ని అనుసరించాడు. పడకగదిలా ఉంది. డబుల్ కాట్ ఉంది. దానిమీద హేండ్లూమ్ బెడ్ షీట్ పరిచి ఉంది. రెండు దిళ్ళు ఉన్నాయి. దోమతెర దించి ఉం . ఒక పక్కన రెండు పెట్టెలూ, ఎయిర్ బ్యాగూ ఉన్నాయి. హేంగర్స్ కి వాసువి కాబోలు పాంట్లూ, షర్టులూ వ్రేలాడుతూన్నాయి. రెండు చీరెలూ, రెండు జాకెట్లూ, రెండు బ్రాలూ, ఓ తువ్వాలూ రెండు లోపల వేసుకునే లంగాలూ మడతలుపెట్టి హేంగర్స్ కి వ్రేలాడుతూన్నాయి ఒక చిన్న బెంచీ మీద ఓ అద్దం, దువ్వెనా, పౌడరూ, కుంకుమా వగైరా ఉన్నాయి. అక్కడే కనకాంబరాలూ మరువం కలిపి కట్టిన మాల పెట్టి ఉంది ఇల్లాలు హడావుడిగా బయటికి వెళ్ళబోతూ మర్చిపోయి నట్లుంది. కొన్ని కూరలు వేటికవి ఓ ప్లాస్టిక్ ట్రేలాంటిదానిలో విడివిడిగా పెట్టి ఉన్నాయి.

లక్ష్మీకాంత్ అన్నింటినీ కుతూహలంగా చూస్తూ అనుకున్నాడు.

వీడికి జీతం చాలా తక్కువ కనుక వీడి శ్రీమతికి యింటి పనిభారం యెక్కువే ఉండి ఉంటుంది. పాపం యెలా అవస్థపడుతోందో యేమో ! అనుకుంటూ వంటగదిలోకి కాలు పెట్టాడు.

''అరేయ్ నీళ్ల చెంబులో ఉన్నాయి. కాళ్ళూ, చేతులూ కడుక్కో. వడ్డిం చేస్తాను.''

రెండు పీటలువేసి రెండు అరటాకులు పరిచి ఉన్నాయి. గ్లాసుల్లో నీళ్ళుపెట్టి వాటిమీద మూత కూడా పెట్టి ఉంది. యివేకాక వంట తయారుచేసిన గిన్నె లన్నీ కూడా అక్కడ పెట్టి ఉన్నాయి. అవి వడ్డించుకునేందుకు స్టీలు గరిటలూ, చెంచాలూ కూడా పెట్టి ఉన్నాయి. వాసు ఆకులమీద నీళ్ల చల్లి మరోసారి ఆకులు తుడిచి వడ్డించటం మొదలుపెట్టాడు. లక్ష్మీకాంత్ కాళ్ళు కడుక్కుని అక్కడే ఉన్న టవల్ తో తుడుచుకుని వచ్చి పీట మీద కూర్చున్నాడు.

రెండు కూరలూ, పప్పూ, కొబ్బరి చట్నీ, వడియాలూ, పులిహోరా పాయసం చాలా ఉన్నాయి పదార్థాలు. వాసు ఒక్కొకటీ వడ్డించి నెయ్యి దగ్గర పెట్టి-

''ఊఁ ... భోజనంచేసి చెప్పు. రుచి ఏది యెలా ఉందో !'' వాసు భోజనం చేస్తూనే మళ్ళీ కబుర్లు మొదలుపెట్టాడు. కానీ లక్ష్మీకాంత్ కి కబుర్లమీద లేదు మనస్సు వంటగదిలో యెక్కువ ఖరీదైన సామాను లేకున్నా సర్దుకున్న తీరు నచ్చింది. శాంతినిలయంలా ఉన్న యీ యింటి యిల్లాలిని చూసితీరాలి అని మనసు తహతహలాడుతోంది. అప్పుడే తన ఊహల్లో ఒక రూపం కదులుతోంది.

తన ఊహకి తనకే నవ్వు వస్తోంది. అంతలోనే తన యిల్లూ, యిల్లాలూ గుర్తుకి వచ్చింది. భార్య అనూరాధ అందమైన బొమ్మలా ఉంటుంది. అసలే అందమైనది, అలంకరణలో మరీ ఆ అందాన్ని పెంచుకుని యెదటివాళ్ళని యిట్టే ఆకర్షిస్తుంది.

ఆమెకి మేకప్ కావటానికి రెండు గంటలయినా టైము కావాలి. యే చీరె మీద యే జాకెట్ నప్పుతుందో ఆమెకి బాగా తెలుసు. హెయిర్‌స్టయిల్ కూడా రకరకాలుగా మారుస్తూ ఉంటుంది. పెళ్ళి అయిన కొత్తలో అనూని తీసుకుని యెక్కడికి వెళ్ళినా అందరి కళ్ళూ తన మీదే. అలాంటప్పుడు అనూ తన భార్య అని బోలెడంత గర్వంగా ఉండేది. అంతకి మించిన తృప్తిగానూ ఉండేది. కానీ ఆ సంతోషం యెన్నాళ్ళో నిలవలేదు.

యింట్లో ఏ పని చేసుకోవాలన్నా అనూరాధకి విసుగే, చికాకే, అసహనమే. ఏ పనీ నా చేతకాదు, నాకు అలవాటు లేదు అంటూ నిర్లక్ష్యంగా మాట్లాడే అనూని కొన్నాళ్లు విసుక్కోకుండా తనే అన్నీ చేసుకునేవాడు. యిలా యెన్నాళ్ళో చేయలేకపోయాడు. ఒకసారి అన్నాడు.

''నిన్ను చస్తే బయటికి తీసుకుపోను. అలంకరణకి వెచ్చించే టైముని యింటిని శుభ్రంగా వుంచుకోవటానికి వినియోగించు'' అని.

అనూరాధకి కోపం వచ్చేసింది. గయ్‌న లేచింది.

''నేను ఖర్మకాలి మీ పెళ్ళాన్ని అయాను. యీ వెధవ సంసారంలో మునిగిపోలేను. ప్రతిరోజూ అలా ప్రపంచం చూడకుండే బ్రతకలేను. నాకిలా అలవాటు లేదు, కాదు.'' అయిదు సార్లు పదోతరగతి తప్పి చదువుకి గుడ్‌బై చెప్పిన అనూరాధ యిలా అనేసరికి లక్ష్మీకాంత్‌కి మరీ కోపం వచ్చింది.

డిగ్రీలు తీసుకుని ఉద్యోగాలున్న అమ్మాయిలు యెందరో వచ్చినా అందంగా లేరు అన్న ఒక్క కారణంతో అందరినీ తోసేశాడు తను. అలా నిరాకరించబడిన అమ్మాయిలు అప్పుడప్పుడూ అక్కడక్కడా కన్పిస్తూనే వుంటారు. మనస్సుకి కాస్త బాధగానే ఉంటుంది. కానీ తనేం చేస్తాడు. తనకి అనాకారులంటే అసహ్యం. అందుకే యేరి కోరి అనూరాధని పెళ్ళాడాడు. అనూ అందే యిష్టమే. కానీ ఆమె మాటలూ, పనులూ, అలవాట్లూ, మనస్తత్వం అస్సలు నచ్చటంలేదు. దానిని మార్చాలని యెన్నోవిధాల ప్రయత్నించాడు ప్రయత్నిస్తూనే వున్నాడు. కానీ కాస్తకూడా లాభంలేకుండా వుంది. తన కొత్త కాపురం చూడాలని ఏ స్నేహితులున్నా

వస్తే 'భోజనానికి పిలుస్తాను' అంటే చాలు అనూకి చాలా కోపం వస్తుంది.

"ఎవరు చేస్తారు బాబూ! వంట మానేసి ఇవాళ్టికి నేనూ వాళ్ళతోబాటు హోటల్‌కి వస్తాను, హాయిగా," అంటుంది. మహాబద్ధకస్తురాలైన అనూకి ఒక్క విషయానికే ఓపిక వుండేది. అందంగా అలంకరించుకుని అది మాయ కుండా అందరూ చూడాలి అన్నట్లుగా తిరగాలి. ఒకప్పు డీ అందాన్నే చూసి మురిసి అనూని పెళ్ళాడినా యిప్పుడీ విషయానికే చాలా చికాకు వస్తోంది. అందమైన వాళ్ళందరూ చెడ్డవాళ్ళుకారని తనకి తెలుసు. కానీ అనూ మనస్తత్వం అంతుబట్టకుండా వుంది.

ఒకసారి తన స్వంత చెల్లెలు భర్తతో కలిసి అన్నయ్య కాపురం చూడాలి, 'వదిన అందాల సుందరి' అని పొంగి పోతూ వచ్చింది. అర్ధపూటకూడా వుండ లేక వెళ్ళిపోయింది. కారణం యేంలేదు. "ఆ అమ్మాయి నల్లగా వుంటుంది. ఆమెని చూస్తే నాకు భయం'' అంది అనూరాధ, తలుపుమూసుకుని గదిలో నించి బయటికి రాకుండానే.

చెల్లెలు అలా వెళ్ళిపోయినందుకు లక్ష్మీకాంత్‌కి మండిపోయింది. ఆడ బడుచు వెళ్ళిన తర్వాత హమ్మయ్య అనుకుంటూ బయటికి వచ్చిన అనూ రాధని చాచి చెంప పగలగొట్టాడు. అంతే మరో గంటకే అనూరాధ ఇంటినీ, భర్తనూ వదిలి పుట్టింటికి పోతూ "చస్తే మళ్ళీ నీ గడప తొక్కను. గాడిదకేం తెలుసు గంధంపొడి వాసన అని సామెత వుంది. నా విలువ నీలాంటి వాడికి యేంతెలుసు," అని వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోయింది. పోనీ ఆమె తలిదండ్రులకన్నా బుద్ధిలేదు మళ్ళీ తీసుకువచ్చి కూతురు కాపురం నిలబెట్టాలని.

యిలా జరిగిపోయింది. జరిగినదానికి యిద్దరూ పశ్చాత్తాపపడి సర్దుకుందామన్న ప్రయత్నమే లేదు. యివన్నీ గుర్తుకు వచ్చి మనస్సు అంతా అదోలా అయిపోయింది లక్ష్మీకాంత్‌కి. వాసు మాత్రం యిదేం గమనించకుండా గడ గడా కబుర్లు చెప్తూ మధ్య మధ్య కొసరి కొసరి వడ్డిస్తూన్నాడు. మధ్య మధ్య లక్ష్మీకాంత్ కాపురం గురించిన వివరాలు అడుగుతూన్నాడు.

"ఏం చెప్పను" నిర్లిప్తంగా నవ్వి లేచి చెయ్యి కడిగేసుకుని ముందు గది లోకి వచ్చాడు.

"కిల్లీ వేసుకోరా." యిచ్చాడు వాసు తనోటి వేసుకుంటూ.

"మామయ్యగారూ మరే మరే అత్త గారు ఫోన్‌చేశారు" అంటూ వచ్చాడు పదేళ్ళ కుర్రాడు.

"ఏమని?"

"అత్తగారికి సాయంత్రంవరకూ రావటానికి వీలుకాదని చెప్పమన్నారు."




"సరే." కుర్రాడు వెళ్ళిపోయాడు.

"వాసూ! మీ పెళ్ళి ఫొటో అయినా లేదేంరా యెక్కడా?"

"ఆల్బంలో వుంది, చూపిస్తాను" అల్మారాలోనించి ఆల్బం తెచ్చాడు వాసు.

"మీ అత్తవారి ఊరు యీ ఊరే కదూ?"

"ఊ..."

"మీ శ్రీమతి పేరేమిటి!"

"సుందరి."

"ఏ సుందరి. శ్యామసుందరా, అజంతా సుందరా, రూపసుందరా, అందాల సుందరా," నవ్వుతూ అడిగాడు. వాసు ఆల్బం పేజీలు తిప్పి ఫొటోల వివరాలు చెప్తూ చూపిస్తూన్నాడు.

"ఏ సుందరీ కాదు... వట్టి సుందరి ...యిదిగో నా సుందరి..."

పెళ్ళికూతురు అలంకరణలో పూవుల జడలో పీటలమీద తలవంచుకు కూర్చున్న సుందరిని చూసి లక్ష్మీకాంత్ ఉలిక్కిపడ్డాడు. ఆ ఫొటోని యింకా యింకా పరీక్షగా చూస్తూన్నాడు.

వాసు ఆ పేజీ తిప్పి మంగళ సూత్రం కడుతూన్నదీ, తలంబ్రాలు పోస్తూన్నదీ, పట్టుచీరెలో నిండుగా ముస్తాబు అయినదీ, సాయంత్రం స్నేహితుల మధ్య భర్తతో తీయించుకున్నదీ, ఒక్కొటీ చూపిస్తూన్నాడు ఆఖరున సుందరి గృహిణిగా యేదో పనిచేసుకుంటూ విరగబడి నవ్వుతూన్నట్లున్న ఫొటో చూపించాడు. దాన్ని తదేకంగా

చూస్తూన్న లక్ష్మీకాంత్ నోరు తడారి పోయింది.

సుందరి యెదురుగా నిల్చుని తనని చూసి విరగబడి నవ్వుతూన్నట్లుగా అన్పిస్తూంటే గుండె వేగ గా కొట్టు కుంటూ వుంటే అదిమి పట్టుకున్నాడు.

"లక్ష్మీకాంత్ యీ సుందరిని పెళ్ళి చూపులకంటూ వచ్చి చూసి చాలామందే పెదవి విరిచి వెళ్ళిపోయారుట. సుందరి కొన్నాళ్ళు ఉద్యోగం చేసిందిలే. సహఉద్యోగి వెధవ ఒకడు సినిమాలకీ, షికార్లకీ వస్తావా అంటూ పరిచయం పెంచుకోజూసి పెళ్ళి అనేసరికి సుందరిని పరిహసిస్తూ నిక్‌నేమ్ పెట్టి పారిపోయాడట. ఆ పేరేమిటో తెలుసు నాకు."

"సింగరేణి సుందరి. వెధవ రాస్కెల్, స్టుపిడ్ బ్రూట్. గృహిణిని యెంపిక చేసుకునేటప్పుడు అందం చూడటం అవసరమే కావచ్చు కానీ 'గుణం' లేని అందానికి ప్రాధాన్యత యివ్వటం బుద్ధిహీనుల పని. ఆడదానికి ఓర్పూ, నేర్పూ, ఆత్మీయతా, ఆదరణా వుంటే వెలకట్టలేని అందాన్ని ఆ గుణాలే తెస్తాయి. యివి తెలియక కేవలం శరీరపు రంగు నలుపుని చూసి 'సింగరేణి సుందరి' అన్న ప్రబుద్ధుడు నాక్కనిపిస్తే గూబ గుయ్ మనిపిస్తాను."

లక్ష్మీకాంత్ వళ్ళంతా చెమట పట్టేసి షర్టు అంతా తడిసిపోయింది. ఊపిరి ఆడనట్లు అయిపోతోంది. యిదేం పట్టించుకోని వాసు తన ధోరణిలో చెప్తూన్నాడు.

"ఆ సింగరేణి సుందరే నా యిల్లాలై యీ ఇంటిని ఆనంద నిలయంగా మార్చింది. ఆ వెధవ యెప్పుడైనా ఒక్క-సారి వచ్చి చూస్తే బాగుండు అన్పిస్తోంది," అంటూ ఆల్బం మూసి యిప్ప టికి స్నేహితుడిని చూశాడు.

"అరె ... ఏమైందిరా ... ఎందు కలా అయిపోతూన్నావు." గాభరాగా అడిగాడు.

"ఏంలేదు. ఏంలేదు. అర్జంట్‌గా వెళ్ళాలి. అదిగో ఆటో ... "చెప్పులు వేసుకుంటూన్న స్నేహితుడివైపు పిచ్చిగా చూస్తూ-

"మా సుందరిని చూడకుండానే వెళ్ళిపోతావురా."

"అర్జంట్‌గా వెళ్ళాలి ... చూడూ వెడుతూన్నాను" ఆటో అని అరిచి ఆపి అందులో కూలబడ్డాడు.

"అరేయ్ యిదేమిటిరా?" అంటూన్న వాసుతో-

"మీ సుందరిని నే నెరుగున్నాను. నన్ను క్షమించరా! ఆమెకి శుభాకాంక్షలు చెప్పు."

ఆటో వెళ్ళిపోయింది.

"మా సుందరిని వీడు యెరు గున్నాడా!" ఆశ్చర్యంగా అలా చూస్తూ నిల్చుండిపోయాడు వాసుమూర్తి.

---




(గత సంచిక తరువాయి)

**5**

శారద దినచర్యలో ఎక్కువ భాగం, అనసూయమ్మగారి తండ్రి అయిన చలపతిరావుగారి దగ్గరే గడిచిపోతుంది! ఆయన ఎంత రోగిష్టి మనిషో, అంత వాచాలుడు! ఎంతసేపూ తను వయసులో వుండగా, ఎంత దారుఢ్యంగా వుండేవాడో, తన జుట్టు నల్లగా ఎలా మిలమిలా మెరిసిపోయేదో, తన తెలివితేటలతో, సాటి బంధువుల కుటుంబాల్లో వచ్చిన కలతలు ఎలా చక్కదిద్దేవాడో, కథలూ, గాథలూగా వర్ణించి వర్ణించి, అభినయంచేసి మరీ చూపిస్తూ చెప్పేవాడు! శారదకి మొదట్లో, వారం రోజులపాటు, అవన్నీ ఎంతో కుతూహలంగా. వినాలని ఆతురత కలిగినట్టుగా అనిపించినా, క్రమేపీ ఆయన చెప్పే విషయాలు చర్విత చర్వణం కావటంతో, విసుగు రాసాగింది! శారదకి ఆయన స్థితి అర్థమైంది! వార్థక్యంతో, అనారోగ్యంతో మంచానపడి శరీరం జీర్ణించినా, మనసు మాత్రం చురుకుదనం కోల్పోలేదు. చాలామంది వయసుమీరిన వ్యక్తుల్లాగానే ఆయన కూడా, గతించిన జీవితం నెమరు వేసుకుంటూ, ఆ గతంలోనే తారట్లాడుతున్నాడు.

అనసూయమ్మగారు విదేశాలకు వెళ్ళి రెండువారాలు కూడా కాలేదు! ఆ ఇంట్లో వుండటం అనేది శారదకి దిన దిన గండంగా తయారైంది! కవిత, కల్పన యిద్దరూ తల్లి వెళ్ళినప్పటినుంచీ శారదపట్ల బద్ధశత్రువుల్లా ప్రవర్తించసాగారు. వాళ్ళెక్కడికి వెళ్ళిందీ, ఏం చేస్తున్నదీ శారద సి.ఐ.డీ లా ఒక కంట కనిపెడుతోందేమో నన్న అనుమానం

శారద అంటే తృణీకారభావం కలిగేట్లు చేసింది. కబ్బుకావాలని అడిగితే, శారద సవాలక్ష ఆరాలు తీస్తుంది. ప్రతిదీ లెక్క వ్రాయాలంటుంది. ఐదు గంటలు అవగానే వేణుగోపాల్‌ని తాతగారి దగ్గరకు పిలిపించి, ఆయనచేత, "యిక యీ పూటకి పనిలేదు. ఫోన్లు ఏవయినా వస్తే, శారద తీసుకుంటుందిలే, నువ్వు వెళ్ళు," అని చెప్పిస్తుంది. అతను ఏదో సాకుతో ఇంకో అరగంటవుంటే, "వెళ్ళమని చెప్పానుగా! ఇంకా యిక్కడ ఏంచేస్తున్నావు?" అని మళ్ళీ పిలిపించి అడిగిస్తుంది.

కవిత ఫ్రెండ్స్ ఎవరైనా వస్తే, ఒక్కసారే కాఫీ, టిఫిన్ యిస్తుంది. మళ్ళీ కాఫీ అడిగితే, పాలు లేవు అంటుంది.

అనసూయమ్మగారు చెప్పినవన్నీ అక్షరాలా అమలుపరుస్తూ తమ ప్రాణాలు తీస్తున్న శారదని చూస్తుంటే, అక్క చెల్లెళ్ళిద్దరికీ ఒళ్ళుమండిపోతోంది!

ఎప్పుడైనా ఏదయినా పనిలో వుండి, శారద కబుర్లు వినటానికి రాకపోతే, చలపతిరావుగారికి అలక వచ్చేస్తుంది! ఈ ఇంట్లో తన గోడు పట్టించుకునే వాళ్ళే లేరు అంటూ చిరాకుపడిపోతాడు! శారద చిన్నపిల్లల్ని మాటలతో మచ్చిక చేసుకున్నట్టు ఆయన్ని శాంత పరుస్తుంది. ఒక్కోసారి ఆయన తన వయసులో చేసిన ప్రతాపాలని గురించి ఉద్రేకంగా చెబుతూ వుంటాడు. శారద వింటున్నట్టు ఊకొడుతూ, తల కుర్చీ వెనక్కి వాల్చి, పరధ్యాసగా ఆలోచనల్లోకి జారిపోతూ వుంటుంది.

ఇప్పుడు కూడా శారద అలాగే కూర్చుని వుంది.

చలపతిరావుగారు ఎంతో ఉత్సాహంగా, "అప్పుడు ఏమయిందనుకున్నావు అమ్మాయి! నేను గనక మధ్యవర్తిగా నిలబడి ఇరువైపుల వాళ్ళకీ నచ్చచెప్పక పోయినట్టయితే, ఆ రోజున ఆ క్షణంలో, అక్కడ పది తలలైనా తెగి వుండేవి."

ఇంతలో కల్పన చరచరా అక్కడకు వచ్చింది.

"శారదా! తాళంచెవు లేవి?" అధికారికంగా అడిగింది.

శారద తలతిప్పి కల్పనవైపు చూసింది.

కల్పన కొత్తచీరె ధరించి, టిప్‌టాప్‌గా ముస్తాబు అయివుంది. చేతిలో బాగ్ పట్టుకుని, చెప్పులేసుకుని ఎక్కడికో వెళ్ళటానికి సిద్ధమైనట్టుగా వచ్చింది.

"నిన్నే! తాళంచెవులు ఇలా ఇవ్వు!"

"ఎందుకు?"

"ఇలాంటి బోడిప్రశ్నలు వేయవద్దని నీకు వందసార్లు చెప్పాను. ఎందు

కయితే నీ కెందుకు ? తాళంచెవులు ఇట్లా పడెయ్యి."

''బీరువాలో ఎక్కువ డబ్బులేదు."

"ఉన్న దెంతయినా చాలు.''

'ఆ వున్నది ఇలా వాడేస్తే మీ మామయ్య మందులకీ, తాతయ్య టానిక్కులకీ యిబ్బంది అవుతుంది."

''అవన్నీ నాకు తెలియదు. నాకు ఇప్పుడు 50 రూపాయలు కావాలి. ఒక ఫ్రెండ్‌ని డాన్స్ ప్రోగ్రాం చూడటానికి టికెట్ కొని వుంచమని చెప్పాను."

''అమ్మ ఊళ్లో లేదుకదా ! అంత ఖరీదుగల టికెట్ ఎందుకు కొనమన్నావే కల్పనా ?" చలపతిరావుగారు కల్పించుకున్నారు.

''నువ్వు నోరుమూసుకో తాతయ్యా? అనవసరంగా మధ్యలో మాట్లాడకు.'' కల్పన కసిరింది.

''తాళంచెవులు ఇమ్మంటుంటే నీక్కాదూ ?'' రెట్టిస్తూ బిగ్గరగా అంది.

ఇంతలో కవిత కూడా అక్కడికి వచ్చింది.

''ఏమిటే కల్పనా అరుస్తున్నావు ? ఏమైంది ?''

''చూడక్కా ! దీని మొండితనం ! డాన్స్ ప్రోగ్రాంకి వెళ్ళాలని డబ్బు ఇమ్మంటుంటే ఇవ్వటంలేదు." కల్పన ఫిర్యాదు చేసింది.

కవిత శారదవైపు తీవ్రంగా చూసింది.

తర్వాత దగ్గరకు వెళ్ళి, శారద నడుందగ్గరున్న తాళంచెవుల గుత్తి లాగి తీసుకుంది.

''కల్పనా ! రా ! ఎంత కావాలో చెప్పు. ఇస్తాను," అంటూ దోవ తీసింది.

కల్పన విజయగర్వంతో, శారద వైపు చూసి, అక్కగారి వెనక వెళ్ళింది.

అయిదు నిముషాల తర్వాత, కవిత తాళంచెవులు తెచ్చి శారద ముందు గిరాటుకొట్టింది.

''అమ్మ వెళుతూ అంత డబ్బు ఇచ్చి వెళ్ళింది కదా ! అదంతా ఏమైంది ! ఏంచేసావు ?" అంటూ నిగ్గతీసింది.

''ఏంచేస్తుంది ? మెల్లగా పోస్టలుకి చేరవేసి వుంటుంది." ఈసడింపుగా అంది కల్పన.

''మాట్లావేం ?" కవిత రెట్టించింది.

''ఖర్చుపెట్టిన ప్రతి రూపాయికీ లెక్క వుంది.'' రోషం అదిమిపెడుతూ అంది శారద.

''ఉన్నాయిలే బోడి లెక్కలు. అందులో ఎన్ని దొంగ లెక్కలో ! అక్కా మొన్న ఫస్టున రెండు కిలోల రవ్వ తెప్పించామా ! నిన్న నా ఫ్రెండ్ వస్తే, ఉప్మాకి రవ్వ లేదంది."

''అంతకు మునుపు కవిత ఫ్రెండ్స్ వస్తే, నాలుగుసార్లు చేసి పెట్టాను."

''శారదా ! నువ్వు వున్నదీ, మమ్మల్ని చూసిందీ చాలుకాని, ఇక దయచేయ్. మా చావేదో మేంపడతాం కానీ, నీ దారిన నువ్వెళ్లు" అంది కవిత.

''అసలు అమ్మ తెలివితక్కువతనం కాపోతే ఇంట్లో మనం యిద్దరం వుండగా, యింకో మనిషి ఎందుకు అక్కా ?"

''అమ్మ చేసేవన్నీ ఇలాటి తెలివి తక్కువ పనులే ! మనకి వేళకి తిండీ తిప్పలూ వుండవేమోననే భయంతో, యీ మనిషిని తెచ్చిపెట్టింది. ఈ దొర సాని, వచ్చినపని మానేసి, యిలా తాతయ్యదగ్గర చేరి కబుర్లతో కాలక్షేపం చేస్తుందని, పుస్తకాలు చదువుకుంటూ కుర్చొంటుందని, మనమీదనే అధికారం చెలాయిస్తుందని అమ్మ అనుకోలేదు."

''అవునక్కా ! అమ్మముందు నంగ నాచిలా ఎంతో బుద్ధిమంతురాలిలా నటిం చింది. అంతా దొంగవేషమే !"

శారద సహనం సడలిపోయింది.

''కవితా ! మీకు యిష్టంలేకపోతే, యీ క్షణంలోనే వెళ్ళిపోతాను. అనవ సరంగా మాటలుమాత్రం మీరకండి",

అంది.

''ఫో ! యిప్పుడే ఫో ! మాకు పీడ వదిలిపోతుంది." కల్పన అక్కడనుంచి వెళ్ళిపోతూ అంది.

''ఏం బెదిరిస్తున్నావా ?'' కవిత నిలదీసింది.

''నాక్కూడా అభిమానం అనేది వుంటుందని గుర్తుచేస్తున్నాను.''

''ఆహా ! అంత అభిమానం వున్న దానివైతే తక్షణం యిక్కడినుంచి వెళ్ళిపో ! నీ ఆటలు యిక మా దగ్గర సాగవు. నువ్వు వెళ్ళకపోతే మేమే మెడబట్టి గెంటుతాం !" కవిత తీవ్రంగా అనేసి అక్కడినుంచి వెళ్ళిపోయింది.

శారద పెదవి కొరుకుతూ నిలబడింది.

చలపతిరావుగారు మళ్ళీ కల్పించు కున్నారు.

''శారదా ! వాళ్లతోపాటు నువ్వు కూడా తొందరపడకు."

''తొందరపాటా తాతగారూ ! మీకు తెలియదండీ ! వాళ్ళిద్దరూ కలిసి నన్ను యీాబెల్లాటి మాటలు అంటు న్నారు. నేను దొంగదాన్నిట ! అన్నీ కాజేస్తున్నానుట ! పనిచేయటంలేదుట ! నేనిక వుండలేనండీ ! కనకమణిగారికి ఫోన్‌చేసి యిప్పుడే వెళ్ళిపోతాను," అంటూ గబగబా ఫోన్‌వున్న అవతల గదిలోకి వెళ్ళింది.

## 6

''మీకు తెలియదు కనకమణిగారూ ! కవిత, కల్పనలకి నేను ఇక్కడ వుండటం అస్సలు ఇష్టంలేదు ! నన్ను అనరాని మాటలన్నీ అంటున్నారు.

నేను హాస్టల్‌కి వచ్చేస్తాను." శారద కళ్ళనీళ్ళ పర్యంతంగా, ఫోన్‌లో కనక మణిని బ్రతిమిలాడుతోంది.

"శారదా! నీకేమైనా మతి పోయిందా? ఆవిడ నీమీద యిల్లు అప్ప చెప్పి వెళ్ళింది! ఆవిడకి యిచ్చినమాట మనం నిల్పుకోవద్దా! వాళ్లేమంటే నీ కెందుకు? నువ్వు మాట్లాడకుండా వూరుకో!"

"వాళ్ళు — వాళ్ళ దొంగతనాలు అంటగడుతూంటే చాలా బాధగా వుంది మేడమ్!"

"బాధా! బాధ దేనికి! ఆ మాటలకి నువ్వు పట్టించుకోవద్దు. నువ్వు అనసూయమ్మగారి మెప్పు సంపాయిస్తే, ఆవిడ మనకి విరాళం యిస్తుంది! అది మనకి లాభం! ఆ సంగతి మర్చిపోకు."

"కానీ మేడమ్—"

"నాకు యింకేం చెప్పకు. వాళ్ళు మొండిగా ప్రవర్తిస్తే, నువ్వు జగ మొండిగా మారు! వాళ్ళు ఏదయినా వాగితే నువ్వు మౌనంగా వుండిపో! తెలిసిందా? నువ్వు ఎంత కష్టమైనా సరే, ఆవిడ తిరిగి వచ్చేవరకూ ఆ ఇంట్లో వుండి తీరాలి! ఇక ముందెప్పుడు ఇలాటి పిచ్చి ఫోన్లు చెయ్యకు! ఆ ఇంట్లో ఆ పిల్లలతో కాస్త కష్టం అవుతుందనేగా నిన్ను పంపించింది. ఏమిటి? వినిపిస్తోందా?"

"వినిపిస్తోంది మేడమ్." శారద ముఖం దిగులుగా మారింది. కంఠం చిన్నగా అయింది.

"ఇట్లా వచ్చేస్తానని ఇంకెప్పుడూ అనకు. వాళ్ళేదయినా మాట తూలి అంటే, అవి నిన్నుకాదని, మన హోమ్ కోసం భరిస్తున్నానని అనుకో! తెలిసిందా?"

"తెలిసింది."

ఆవిడ ఫోన్ పెట్టేయటంతో, శారద కూడా మెల్లిగా పెట్టేసింది.

"అనసూయమ్మగారు ఇచ్చేవిరాళం కోసం నేను యీ నరకం అంతా భరించాలన్నమాట." దిగులుగా పైకి అనేసింది!

కనకమణిగారు ఇలా అంటుందని అనుకోలేదు. తన బాధ చెప్పగానే, ఆవిడకూడా ఆవేశపడి, వెంటనే వచ్చేయి అంటుందని ఆశపడింది.

"నువ్వు వెళ్ళకపోతే మేమే మెడబట్టి గెంటుతాం," అన్న కవిత మాటలు గుర్తుకువచ్చాయి.

ఏం జీవితం! ఎంత పాపిష్టి బ్రతుకు! పూర్తిగా పరాధీనం! కనక మణిగారు చెప్పినట్లు విని తీరాల్సిందే!

వెళ్ళిపోతానని అన్న తర్వాత, వెళ్ళకుండా వుంటే యింకేమైనా ఉందా? కవితా, కల్పనా తనని ఇంకా లోకువగా చూడరూ!

శారదకి ఏడుపు వచ్చేసింది! అక్క—

డెవరూ లేకపోవటంతో, నిగ్రహించుకోవాలని కూడా అనిపించలేదు.

టేబిల్‌మీదకి తలదించుకుని ఏడవసాగింది. ఏడుస్తున్న శారద, ఏదో పడిన శబ్దం అవటంతో, ఉలికిపాటుగా తలెత్తి ఆ శబ్దం వచ్చినవైపు చూసింది!

అక్కడ భవానీప్రసాద్ నిలబడి వున్నాడు! అతని చెయ్యి తగిలి కాబోలు, చిన్న పుస్తకాల బీరువామీద అందంగా అమర్చిన, ఇత్తడి ఫ్లవర్ వేజ్ క్రిందపడింది!

ఒక్కక్షణం శారద నిశ్చేష్టురాలయినట్టుగా చూసింది!

అతను పట్టుబడిన దొంగలా, చూపులు నేలమీదికి మరల్చుకున్నాడు.

"మీరు – ఇక్కడున్నారా ?" అప్రయత్నంగా లేస్తూ అంది.

"సారీ! నేను ఇక్కడ పుస్తకాలు తీసుకుంటుంటగా మీరు వచ్చి ఫోన్‌తో మాట్లాడారు. నాకు చెవుడు లేకపోవటం నా తప్పుకాదు!" అతను ఫ్లవర్‌వేజ్ సరిగ్గా తీసిపెట్టాడు.

శారద ఇంకా అతన్నే చూస్తోంది!

అతను పుస్తకాల దొంతర తీసుకుని వెళ్ళబోతూ ఆగాడు.

"మీకు ఇక్కడ ఉండటం ఇష్టం లేమకదూ ?"

శారద మాట్లాడలేదు.

"ఆవిడ బలవంతంగా ఉంచమంటున్నారు, అవునా ?"

ఇంతలో కవిత అక్కడికి రానే వచ్చింది.

శారదని ఎగాదిగా చూసింది.

"వెళ్తున్నానని అన్నావుగా! ఇంకా ఇక్కడ నిలబడ్డావెందుకు ?" అంది.

శారద నిస్సహాయంగా చూడటం మినహా ఇంకేమీ సమాధానం చెప్పలేకపోయింది.

"నువ్వు సిగ్గూ, అభిమానం వున్న దానివి అయితే, మేం వెళ్ళమన్న తర్వాత, ఇంకా ఇంతసేపు ఇక్కడ వుండనే వుండవు."

శారద పెదవి కొరుకుతూ నిలబడింది.

భవానీప్రసాద్ కల్పించుకున్నాడు. "కవితా! శారద వెళ్ళిపోవటానికే సిద్ధమైంది! నేనే వద్దన్నాను! వుండమని అన్నాను."

"నువ్వా!" కవిత ఆశ్చర్యంగా చూసింది.

"అవును, నేనే! నువ్వూ, కల్పనా కాలేజికి వెళ్ళిపోతే, నాన్నని ఎవరు చూస్తారు! నేనే ఆ అమ్మాయిని ఉండమన్నాను!"

అతను త్వరత్వరగా, ఎవరో తరుముకు వస్తున్నట్టుగా అక్కడినుంచి గబగబా వెళ్ళిపోయాడు!

కవిత మామయ్యవైపు ఆశ్చర్యంగా చూసింది.

శారదకు ఆ క్షణంలో భవానీప్రసాద్

పుణ్యమా అని, ఎంతో అవమానం తప్పినట్టుగా అనిపించింది!

కవిత చూపులు భరించలేనట్టుగా అక్కడినుంచి, ఇవతలికి వచ్చేసింది.

* * *

## 7

కల్పన, కవిత స్నేహితులతో కలిసి నాగార్జునసాగర్ వెళ్ళారు. తల్లికి జ్వరంగా వుందని వేణుగోపాల్ కూడా సెలవు పెట్టాడు.

అతను కూడా కల్పనా వాళ్ళతో వెళ్ళాడేమోనని శారదకి అనుమానం కలిగింది! కానీ తన అనుమానం పైకి వ్యక్తం చేయలేకపోయింది!

ఇంట్లో ముసలాయన వున్నా, ఆయన్ని కించిత్తు కూడా లక్ష్యపెట్టరు.

భవానీప్రసాద్ వుండి కూడా, లేనట్టే లెక్క. అతను ఎంతసేపూ తన పుస్తకాలు, తన మొక్కలు ఆ గొడవేదో తప్ప, ఇంకోటి పట్టించుకోడు. అనసూయమ్మగారు ఇంట్లో తనని కాపలాగా ఎందుకు పెట్టిందో, శారదకి ఇప్పుడిప్పుడు అర్థం అవుతోంది! ఆ కాపలా ఇంటికి కాదు! ఆవిడ కన్న కూతుళ్ళకే! కానీ తనేం చేయగలుగుతుంది! వాళ్ళని వారించటం తనకి అసాధ్యమైన పని! హెచ్చరించటం అంటే ఇంకా విరోధం కొనితెచ్చుకోవటమే! అనసూయమ్మగారు ఉత్తరాలు వ్రాస్తూనే వుంది! ప్రతి ఉత్తరంలో ఇంటిని గురించి, కూతుళ్ళ గురించి అప్పగింతలు ఉంటూనే ఉంటాయి. శారద యీ రోజు పడుకునేముందు, కూర్చుని ఆవిడకి ఉత్తరం వ్రాసింది. ఇంటి సంగతులన్నీ వివరంగా వ్రాసింది. కవిత, కల్పన నాగార్జున సాగర్ వెళ్ళారని, వేణుగోపాల్ సెలవు పెట్టాడని, వంటవాడు మానేసాడని, అట్లా గుర్తు వున్న ప్రతివిషయం వ్రాసింది.

శారద ఉత్తరం కవరులో పెట్టి అంటించి, దానిమీద అడ్రస్ వ్రాసి పక్కన పెట్టింది. చలపతిరావుగారి గదిలోకి వచ్చి చూసింది ఆయన నిద్ర పోతున్నాడు. శారద మెట్లెక్కి పైకి వెళ్ళింది. కవిత, కల్పనలు లేకపోవటంతో, శారద తను కూడా క్రింద భాగంలో చలపతిరావుగారి గదిలో పడుకోవటానికి పక్కవేసుకుంది.

తలుపులు అన్నీ వేసివున్నాయో లేదోనని చూడటానికి పైకి వచ్చింది!

కిటికీ తలుపులు తెరిచే వున్నాయి! శారద వాటిని ఒక్కొక్కటీ మూసింది. తలుపులు దగ్గరకి లాగి గడియపెట్టి, మెట్లవైపు రాబోతుంటే, భవానీ ప్రసాద్ గదిలోనుంచి ఏడుపు వినిపించసాగింది!

శారద ఒక్కక్షణం ఆగింది! చెవులు రిక్కించినట్లుగా తదేకంగా ఆలకించింది! సందేహంలేదు. అతనే!

ఏడుస్తున్నాడు. అస్పష్టంగా ఏదో అంటున్నాడు !

శారద క్షణంసేపు తటపటా యించింది !

తర్వాత ధైర్యం తెచ్చుకున్న దానిలా, అతని గదిలోకి మెల్లగా వెళ్ళింది.

బెడ్‌లైట్ కాంతిలో, బీభత్సంగా కన్పిస్తున్న ఆ గదిని చూసి నిశ్చేష్టు రాలయింది !

మంచంమీదనుంచి దుప్పట్లు లాగేసి వున్నాయి !

దిళ్ళు నేలమీద దూరంగా పడి వున్నాయి.

పుస్తకాలు చిందరవందరగా వున్నాయి !

అతను నేలమీద కూలబడినట్టుగా కూర్చుని, మంచంమీద తలదాచుకుని ఏడుస్తున్నాడు !

ఆ ఏడుపు అత్యంత విషాదంగా, నిస్సహాయంగా వుంది ! ఏడుస్తూనే అత నేదో అంటున్నాడు.

శారద నిశ్శబ్దంగా అల్మారావైపు మందుకోసం నడిచింది ! అల్మారా తలుపు తెరిచి సీసా చేతిలోకి తీసుకుంది! ఆ సీసా మూత తీసి అరచేతిలోకి ఒంపుకుంది ! కానీ అందులోనుంచి మాత్రలు పడలేదు !

ఇంకా తల తిప్పి భవానీప్రసాద్ వైపే చూస్తున్న శారద కళ్ళు సీసా వైపు తిరిగినాయి.

సీసా ఖాళీగా వుంది ! అందులో మందులేదు ! శారద ప్రాణం వుస్సు రంది ! ఈ మందు అయిపోవచ్చి నాలుగురోజులు అయింది ! తెప్పిద్దా మంటే ఇంట్లో డబ్బులేదు. కవితకి రెండుసార్లు గుర్తుచేసింది కూడా ! కానీ కవిత ఆ మాటే లక్ష్యపెట్టలేదు. భవానీ ప్రసాద్‌కి తనమీద ఏమాత్రం అను మానంగా అనిపించినా, వెంటనే ఆ మాత్రలు వేసుకుంటాడు !

శారద అల్మారా తలుపులు మూసేసింది!

ఆ శబ్దానికి అతను తలెత్తి చూసాడు !

అతి తక్కువగా వున్న బెడ్‌లైట్ కాంతిలో, క్రీనీడలో తెల్లటి చీరకట్టు కుని, అల్మారా దగ్గర నిలబడివున్న యువతి అతని కళ్ళకి కనిపించింది !

అతని కళ్ళలో ఆవేశం, ఆగ్రహం పదిరెట్లు పెరిగినాయి !

గుప్పిట్లు బిగించి, లేచి నిల బడ్డాడు !

"నువ్వు — నువ్వు — ఇక్కడికి వచ్చావా ? నా గదిలోకి ఎందుకు వచ్చావు ?" అతని కంఠంలో అంత వరకూ వున్న నిస్సహాయత్వం, ఏడుపు చిత్రంగా మాయమైనాయి !

"మాట్లాడవేం ?" గద్దించినట్టుగా అడిగాడు.

శారద బిత్తరపోయినట్టుగా నిలబడింది.

"ఈ రోజు నా చేతుల్లోనుంచి తప్పించుకోలేవు. నీ చావు మూడింది కాబట్టే ఇలా వచ్చావు." అతను ఒక్కొక్క అడుగే వేస్తున్నట్టుగా శారదకి దగ్గరగా వచ్చాడు.

అతని క్రూరమైన చూపులు, పిచ్చి వాలకం చూసి శారద హడిలిపోయింది ! భయంతో నోట మాట రాలేదు.

అల్మారాకి అంటుకుపోయినట్టుగా, వెనక్కి వెనక్కి జరిగి నిలబడింది.

అతని చేతులు శారద భుజాలమీద పడినాయి !

ఒక్క ఊపుతో ఇవతలకి లాగాడు !

శారద కెవ్వుమంది !

"నీ నటన నాకు తెలియదనుకున్నావా ! నలుగురిలో నన్ను ఒక చేతకాని వెధవని చేసి, నీ యిష్టం వచ్చినట్టు తిరుగుదామనుకున్నావా ! నేను పిచ్చివాడినా !

"నాకు పిచ్చి వుందని మి అమ్మకి, నాన్నకి చెబుతావా ? నీ స్నేహితులతో నవ్విస్తావా ! ఇందుకేనా మా అక్కకి, నాన్నకి ఎదురు తిరిగి నేను పెళ్ళి చేసుకుంది నిన్ను ? దీనికోసమేనా !"

శారదని అతను చెంపలమీద ఎడా పెడా కొడుతున్నాడు ! కంఠం నులిమి హింసిస్తున్నాడు ! దాదాపు చంపటానికి సిద్ధం అవుతున్నాడు. శారద వుక్కిరి బిక్కిరి అవుతోంది ! అతని చేతుల నుంచి విడిపించుకోవటానికి విశ్వ ప్రయత్నంచేస్తూ పెనుగులాడుతోంది ! అతనినుంచి ఎలాగో తప్పించుకుని, పరుగెత్తబోయింది ! అతను వెనక నుంచి అంతకంటే వేగంగా వచ్చి నడుం గట్టిగా పట్టుకున్నాడు ! శారద పెనుగులాటలో, అతను పట్టు దప్పి, నేలమీదపడ్డాడు ! శారద పులి నోటి నుండి తప్పించుకున్న మేకపిల్లలా బయటకి పరుగెత్తింది ! గది తలుపులు గళాల్ని దగ్గరకి లాగి, బయట గడియ వేసేసింది !

అతను లోపలనుంచి తలుపులు బాదుతున్నాడు !

'తలుపు తియ్,' అంటూ అరుస్తున్నాడు.

శారద తూలుతున్న మనిషిలా మెట్ల దగ్గరకి వచ్చింది. భయంతో కాళ్ళు ఇంకా గజగజలాడుతున్నాయి. ఆ మెట్లు దిగి వెళ్ళటానికి కూడా సాధ్యం కాని దానిలా, అక్కడే ఆ పైమెట్టుమీదనే కూలబడింది !

మరుక్షణంలో శారదకి ఉప్పెనలా దుఃఖం ముంచుకు వచ్చింది!

ఈ దెయ్యాల కొంపలో ఎన్నాళ్ళుండాలి తను ! అనిపించసాగింది !

## 8

మర్నాడు బాగా బారెడు పొద్దెక్కిం

తర్వాత, ముసలాయన 'శారదా, శారదా' అని కేకలు పెడుతుంటేగాని, శారదకి మెలకువ రాలేదు ! బద్ధకంగా కళ్ళు తెరవబోయిన శారదకి ఎడమ కన్ను నెప్పిగా, వాచినట్టుగా బరువుగా అనిపించింది ! ఒళ్ళు శారంగా, ఎంతో పనిచేసి అలిసిపోయినట్టుగా వుంది !

"శారదా ! ఏమిటమ్మా, ఈ రోజు ఇంత సేపు పడుకున్నావు. లే లే. కాఫీ నీళ్లు పోయి నాకు," అన్నాడు చలపతి గారు.

శారద లేచింది ! ఒళ్ళంతా విర క్కొట్టినట్టుగా, జ్వరం తగిలినట్టుగా వుంది !

శారద ముఖం కడుక్కుని, అద్దంలో బొట్టుపెట్టుకుంటానికి ముఖం చూసుకో గానే చకితురాలయింది ! ఎడమ కన్ను పైన వాచి కమిలిపోయి వుంది ! పరీ క్షగా చూస్తే, బుగ్గలమీద ఎర్రటి చేతి వేళ్ళ చారికలు కన్పిస్తున్నాయి ! మెడంతా కూడా నొప్పిగా వుంది !

శారద కాఫీ తయారుచేసి ముస లాయనకు తెచ్చి ఇచ్చింది !

రాత్రి నిద్రమాత్రలు మింగి పడు కున్న ఆయన ఉదయంవేళ అంత వుత్సాహంగా ఉండడు !

కాఫీ ఇస్తున్న శారదని "అదేమి టమ్మా కన్ను కేమైంది?" అని మాత్రం అడిగాడు.

"అల్మారా తలుపు తగిలిందండీ." ఎక్కువసేపు అక్కడ వుండకుండా వచ్చేసింది !

పనిమనిషి వచ్చింది.

"అబ్బాయిగారు ఇంకా లేవలేదండీ ! పిలిచినా పలకలేదు. ఆ గదిమాత్రం ఊడవలేదు నేను," అని వెళ్ళిపోయింది.

శారద స్నానం చేసింది. వంట చేసింది !

పదకొండు గంటలు దాటుతున్నా, భవానీప్రసాద్ గది దాటి ఇవతలకు రాలేదు.

శారదకి ఆదుర్దా కలిగింది.

చలపతిరావుగారికి భోజనం తిని పించింది! పన్నెండు గంటలు దాటింది.

అప్పటికి కూడా అతను లేచి రాలేదు.

శారద మెట్లెక్కి పైకి వెళ్ళింది !

లోపలనుంచి ఎలాటి శబ్దమూ రాలేదు. తలుపులు మెల్లగా తోసింది. అవి తీసే ఉండటంతో తెరుచు కున్నాయి.

శారద గదిలో భవానీప్రసాద్ కోసం ఆతురతగా వెతికింది. అతను కిటికీ దగ్గరున్న కుర్చీలో, వెనక్కి జారగిలబడి ముందున్న మంచం అంచుకి కాళ్ళు చాచి కూర్చుని వున్నాడు.

అతని నోట్లో సిగరెట్ వుంది ! అతను చాలా సిగరెట్లు కాల్చినట్టుగా, పక్కనే స్టూలుమీద వున్న అష్ట్రే బూడిదతో నిండి వుంది.

తలుపులు చప్పుడు అవటంతో, అతను తల తిప్పి చూసాడు. అతను మామూలుగానే వున్నాడు !

"మీరు - మీరు లేవలే దను కున్నాను. కాఫీ తీసుకురానా ?" మెల్లగా అడిగింది.

అతను శారదనే చూస్తున్నాడు ! అతని కళ్లు శారద చేతులమీదకి మళ్ళి నాయి ! అవి గాజులు లేకుండా బోసిగా ఉన్నాయి ! ఆ గాజులు మేం ఇక్కడ పగిలిపోయాం అని సాక్ష్యం చెబుతున్న ట్టుగా గదిలో నేలమీద ముక్కలుగా పడి వున్నాయి!

అతని కళ్లు, ఆ ఆకుపచ్చ గాజు ముక్కలమీదనే తదేకంగా నిల్చి పోయినాయి !

"పొద్దుట పనిమనిషి వచ్చి పిలవటం నాకు విన్పిస్తూనే వుంది. కానీ - ఇదంతా-" చిందరవందరగా ఉన్న ఆ గదిని చూపిస్తూ అర్ధోక్తిగా ఆగి పోయాడు. అతని గొంతు కేదో అడ్డు పడ్డట్టుగా వుంది.

శారద మాట్లాడలేదు. మౌనంగా వెళ్ళి క్రిందపడిన దిళ్లు మంచంమీద పెట్టింది ! చెదిరిపోయిన పక్కలు సర్దింది ! పుస్తకాలు తీసి టేబిల్ మీద పెట్టింది. గాజుముక్కలు ఏరి కిటికీలో నుంచి బయటకి పారేసింది.

శారద క్రిందకు వెళ్ళి కాఫీ తీసుకు వచ్చింది.

"ఆ గాజుముక్కల్నిబట్టి నా గది లోకి వచ్చిన దురదృష్టవంతురాలు కవితగాని, కల్పనగాని కాదని, మీరేనని అనుకున్నాను." అతను తలని చేతుల్లోకి దించుకున్నాడు.

"వాళ్ళిద్దరూ నాగార్జునసాగర్ నుంచి ఇంకా రాలేదు. తీసుకోండి. ఇదుగో," శారద కాఫీ ఇస్తూ అంది.

కాఫీ అందుకుంటున్న అతను శారద ముఖాన్ని పరీక్షగా చూసాడు.

శారద ఎర్రబడిన చెంపలు, దెబ్బ తగిలి కమిలిన కన్ను పైభాగం చూస్తున్నకొద్దీ, అతని ముఖం విషా దంగా మారింది.

"మీరు-మీరు – రాత్రి నా గదిలోకి ఎందుకు వచ్చారు ? నేను పగలే మనిషిని కాని, రాత్రివేళ రాక్షసుడినని, మృగాన్ని అని అక్క మీకు చెప్ప లేదా ? మిమ్మల్ని హెచ్చరించలేదా ?"

"చెప్పారు. ఆ సమయంలో మీ గురించి తీసుకోవాల్సిన జాగ్రత్తలు కూడా నాకు అప్పగించారు. ఇదివరకు ఒకటి రెండుసార్లు ఇలా జరిగింది ! కానీ, నేను మీకు మంచినీళ్ళతో కలిపి మందు తాగించాను. మీరు మత్తుతో నిద్రపోయారు."

అతను నివ్వెరపోయాడు

"మీకు ఆ స్థితి వస్తుందని ఏమాత్రం తెలిసినా, ఆ మందు మీ అంతట మీరే వేసుకుంటారని, ఒక్కో

సారి ఆ అవకాశం కూడా లేకుండా వచ్చేస్తుందని కూడా మీ అక్క చెప్పారు." అతను కాఫీ ప్రక్కన పెట్టి మళ్ళీ తలని చేతుల్లోకి దించుకున్నాడు.

శారద మెల్లగా ఇవతలికి వచ్చేసింది.

ఆ సాయంత్రం, శారద వంటపని పూర్తిచేసుకుని వచ్చి, గదిలో పుస్తకం చదువుతూ కూర్చుంది.

భవానీప్రసాద్ అక్కడకు వచ్చాడు. అతని చేతిలో ఒక కవరు వుంది.

అది శారద చేతికి అందించాడు.

"ఏమిటివి?" అడిగింది.

"తీసుకోండి మీకు అవసరమైనవి తెచ్చాను."

"నాకు అవసరమైనవా!" శారద ఆశ్చర్యంగా తీసి చూసింది. ఆ కవరులో రెండు వస్తువులు వున్నాయి ! ఒకటి అతని మందు బాటిల్ ! రెండోది ఆకు పచ్చ గాజులపొట్లం !

శారద సంభ్రమంగా చూసింది. భవానీప్రసాద్ ఇంటికి ఏదయినా తీసుకురాగా చూడటం ఇదే ప్రథమం !

శారద ఆశ్చర్యం గమనించిన అతను, మొహమాటంగా చూపులు పక్కకు తిప్పుకున్నాడు.

"గాజులు వేసుకుని, మందు జాగ్రత్తగా దాచండి ! ఇకనుంచి పొరపాటుగానైనా, రాత్రివేళ నా గదిలోకి ఎప్పుడూ రాకండి."

అతను వెళ్ళబోయి ఆగాడు. సాంతం శారదవైపు తిరగకుండానే, తగ్గుస్వరంలో అడిగాడు –

"ఉదయంనుంచీ నాకు మనశ్శాంతిగా లేదు. ఒక్కమాట అడుగుతాను. మీరేమీ అనుకోకండి "

"అడగండి." గాజులు ఎక్కించు కుంటూ అంది.

"రాత్రి – రాత్రి – నేను మీరు నోరు విప్పి చెప్పలేని అత్యాచారం ఏమైనా చేసానా ?"

గాజులు ఎక్కించుకుంటున్న శారద ఆగింది !

అతని మొహమాటం, బాధ అర్థమైనాయి !

"లేదు ! నన్ను మీరు చంపటానికి ప్రయత్నిస్తూ కొట్టారు. గొంతు నులిమారు. నేను పెనుగులాడాను. అంత కంటే ఇంకేం జరగలేదు." తగ్గు స్వరంతో చెప్పింది.

అతను నిట్టూర్చటం శారదకి విన్పిస్తూనే వుంది.

అతను అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

(సశేషం)

# రాజకీయ చైతన్యం

(గల్పిక)

సుబ్బారాయుడు చాలా కోపంగా ఉన్నాడు.

"ఈసారి కాంగ్రెసుకు ఓటువేస్తే చూడు," అన్నాడు.

"అదేం ?" అన్నాను.

"ఎమర్జెన్సీ అని నా మూడోతమ్ముణ్ణి గద్దలు తన్నుకుపోయినట్టు తన్నుకు పోయారు. వాణ్ణి ఎక్కడ పెట్టారో తెలుసుకోవటానికి నాకు మూణ్ణెల్లు పట్టింది," అన్నాడు.

"నీకింకా ఇద్దరు తమ్ముళ్లున్నారు. ఇద్దరు కొడుకులు జైల్లో పెట్టే ఈడు వాళ్ళు – వాసెక్టమీ చేసే ఈడువాళ్లు – ఉన్నారు. రేపు కాంగ్రెసు గెలిచిం దనుకో – ఎందుకు గెలవరు ? – వాళ్ల గతి ఆలోచించావా ?" అన్నాను.

"వాసెక్టమీ ఏమిటీ నీ తలకాయ ? పెద్దవాడికి పదిహేనోఏడు", అన్నాడు సుబ్బారాయుడు.

"నాకు తెలుసునయ్యా ! పదకొం డేళ్ళ వాళ్ళను కూడా స్టైరిలైజుచేసి పారేస్తున్నారు. కాంగ్రెసు దెబ్బ నీకింకా తెలీదా ?" అన్నాను.

సుబ్బరాయుడు బెదిరాడు. "ఇంత జరిగాక మళ్ళీ కాంగ్రెసు గెలుస్తుం దంటావా ?" అన్నాడు.

"నువ్వంటే రాజకీయ చైతన్యంగల వాడివి. మామూలు మనుషులు పట్టి గొర్రెలే గద ! నీ ఒక్క ఓటు కాంగ్రె సుకు తక్కువవుతుందా ? ప్రతిపక్షాలకు ఓటుచేశావంటే నిన్ను కాంగ్రెసు వెయ్యికళ్ళతో కనిబెట్టుతూ ఉంటుంది. అందులోనూ నువు అనుమానితుల జాబి తాలో వాడివి. ఇంకా నయం నిన్ను వోటర్ల లిస్టులో ఉండనిచ్చారు," అన్నాను.

సుబ్బారాయుడు కాంగ్రెసుకు ఓటు చేశాడు. నేను ఉదతాభక్తిగా ఒక ఓటు కాంగ్రెసుకు సంపాదించిపెట్టాను. చాలామంది సుబ్బారాయుళ్లు ఇదే విధంగా రాజకీయ చైతన్యం – రాజకీయాల నుంచి ఆత్మరక్షణ చేసుకోవటం – ప్రదర్శించి ఉంటారు.

***కొడవటిగంటి కుటుంబరావు***



# సుందరి

పుట్టినరోజు పండుగ ముగిసింది.

ఎనిమిదయ్యేసరికి అతిధులు జారుకున్నారు. పార్టీ గొప్పగా జరిగినందుకు సుందరి సంతోషించింది. తెల్లవారుఝామునుంచి అటు ఇటు తిరగడంవల్ల తలంటుకున్న చిరాకువల్ల సుందరికి అలసటగా ఉంది. మేడమీదికెళ్ళి కొత్త పట్టుచీర తీసి, ఇస్త్రీచీర కట్టుకోగానే బరువు దిగినట్లయింది. ఆయా తెచ్చిన బత్తాయి రసం త్రాగి కిందికి వచ్చింది. నౌకర్లు హాలు బాగుచేస్తున్నారు.

సుందరి పోర్టికోలో స్తంభానికి ఆనుకుని నిలబడింది. ఇంతలో ఓ రిక్షా వచ్చి ఆగింది. దాంట్లోంచి రాజు దిగాడు.

"ఇప్పుడా రావడం ?" సుందరి ముద్దుగా కోప్పడింది.

రాజు ఆమె దగ్గరగా వచ్చాడు "ఏం చెయ్యను డియర్. నేను బయలుదేరేసరికి మా జి.యం. వచ్చాడు. వాడ్ని వదిలించుకునేసరికి ఈ టైం అయ్యింది."

"నేను చాలా డిజప్పాయింట్ అయ్యాను "

రాజు తను తెచ్చిన శివపార్వతుల దంతం బొమ్మ కానుకగా ఇచ్చాడు.

"నో ప్లెజర్" సుందరి మందహాసం చేసింది.

రాజు లేటుగా వచ్చినందుకు ఏమీ బాధపడలేదు. అతడు కావాలనుకునే ఆలస్యంగా వచ్చాడు. పదిమందితో తాను వస్తే గొప్పేమిటి? సుందరి తనకోసం ఎదురు చూడాలి!

రిఫ్రెష్‌మెంటు తీసుకున్నాక యిద్దరూ తోటలో కూర్చున్నారు. ఆకాశంలో వెన్నెలరాజునవ్వుతున్నాడు. చల్లటిగాలిని చెట్లు సరఫరా చేస్తున్నాయి. వెన్నెల్లో పచ్చగడ్డిమీద ఏకాంతంలో యవ్వనం చేసే రొదలో యిద్దరూ చాలాసేపు మౌనంగా కూర్చున్నారు.

"ఏంచేశావు మన పెళ్ళి విషయం?" ఆమె కళ్ళల్లోకి చూస్తూ అడిగాడు.

దానికోసమే సుందరి ఎదురు చూస్తోంది, "సారీ రాజూ... ఎంతచెప్పినా మా డాడీ ఒప్పుకోవడంలేదు. నా పెళ్ళి మీద ఆయనకు కొన్ని ఆశయాలున్నాయి. తన అల్లుడు తనకంటే పొజిషన్‌లో ఉండాలని డాడీ కోరిక."

రాజు కసిగా చూశాడు. తనో గుమాస్తా అనేకదా సుందరి నాన్న అలా మాట్లాడాడు?

"సుందరీ...మీ నాన్నకు కావలసింది డబ్బు. నాకో ఆర్నెల్లు టైం ఇవ్వు, నిన్ను నా దాన్ని చేసుకుంటాను. అప్పుడు మీ డాడీ తనే పెళ్ళి చేస్తాడు, ముందుకువచ్చి."

సుందరి నవ్వింది. "తమిళనాడు బంపర్ కొన్నావా?"

"జోకు చెయ్యకు."

"నీ కోసం నిరీక్షిస్తూ ఉంటాను."

సుందరి చేతిని ముద్దుపెట్టుకుంటూ రాజు లేచాడు.

ఆర్నెల్లకి ఆరురోజుల ముందే రాజు అంబాసిడర్ దిగాడు. చూడగానే ఎవరయినా ఖరీదయిన మనిషని అనుకుంటారు. సుందరి అతణ్ని చూసి అవాక్కయిపోయింది.

"ఫ్యాన్సీ డ్రెస్ వేషం కాదుగా?" కాఫీ యిస్తూ చమత్కారం విసిరింది.

"ఫాలోమీ...సుందరిని కారెక్కించుకుని రాజు బయలుదేరాడు. యాభై మైళ్ళ ప్రయాణం చేశాక గులాబీరంగు మేడముందు ఆగింది.

"ఇదే మనయిల్లు" రాజు గర్వంగా కారు దిగేడు."

కొత్త డిజైన్‌లో ఆ భవనం పూల తోట మధ్య ఓ పెద్ద పూవులా ఉంది. అడుగడుగునా రూపాయలు చేసే నగిషీలు కనిపిస్తున్నాయి. రాజు ఇల్లంతా చూపించాడు.

"వీటన్నిటికీ నువ్వు వారసురాలివి." సుందరి మాట్లాడకుండా కళ్ళతో చూస్తోంది. రాజు ఎలా ఎదిగిపోయాడు.

"రా...నా ఛాంబర్‌లో కూర్చుం

దాము." రాజు ప్రక్కగా నున్న కాటే జికి దారితీశాడు. యు ఫోం సోఫామీద కూర్చుని 555 సిగరెట్ వెలిగించాడు.

"నీముందు మేం బీదవాళ్ళం రాజూ! ఏ గాంబ్లింగ్ అయినా కొట్టావా? లేక ఎవర్నయినా మోసం చేశావా?" ఉండ బట్టలేక అడిగింది సుందరి.

"అవేం కాదు. పెళ్ళయ్యాక చెబు తాను."

"రహస్యమా."

ఇంతలో భోజనానికి పిలుపు వచ్చింది. సుందరి, రాజు భోజనానికి కూర్చున్నారు. రాజు తన ఐశ్వర్యం గురించి చెబుతున్నాడు?

"అన్నట్లు నువ్వేం తినడంలేదేం?"

"నిన్ను చూడగానే కడుపు నిండి పోయింది రాజూ."

భోజనాలయ్యాక పాను నములుతూ రాజు ప్రయివేటు గదిలో కూర్చున్నారు. "ముహూర్తం పెట్టమను మీ నాన్నని." రాజు ఆమె తొడమీద తల ఆన్చి పడు కున్నాడు.

"అయ్యగారూ, శాంతమ్మగారు పిలు స్తున్నారు." బయటనుంచి నౌకరు కేక వేశాడు.

"ఇప్పుడే వస్తానుండు." రాజు బయ టికి నడిచాడు కంగారుగా.

సుందరి వెంటబడింది.

రాజు, శాంత సంభాషణల విన్నది. వెంటనే బయలుదేరి బస్సు ఎక్కింది. మర్నాడు రాజుకి టపాలో ఉత్తరం వచ్చింది.

"రాజూ! నిన్ను పెళ్ళి చేసుకోవా లని నాకు ఏనాడూ లేదు. నిన్ను వదులు కోవడానికి ప్లాను వేశాను. నాకోసం నువ్వు మూర్ఛరోగం వున్న శాంతని పెళ్ళిచేసుకుని అంతస్థు పెంచుకున్నావు. నాకోసం ఆమెను అన్యాయం చెయ్యకు. ఇవాళ శాంతని మోసంచేసినట్లే రేపు నన్ను చెయ్యవని గ్యారంటీ ఏమిటి? ఈ రహస్యం నాకు తెలిసిందని బాధ పడుతున్నావా? పూర్ రాజూ!

సుందరి"






బ్రాకెట్ తగిలినట్లు కల వచ్చి ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు కరణం వెంకటేశ్వర్లు బంగారు బిస్కెట్ల దండల్లా నెంబర్లు అతని కళ్లముందు మెరుస్తున్నాయి.

ఆదేం చిత్రమో వెంకటేశ్వర్లు బ్రాకెట్ కట్టనినాడు అతను అనుకున్న నెంబర్లు వచ్చి తీరతాయి. కట్టిననాడు అతని నెంబర్లు అటూ ఇటూ కావటమో, వెంట్రుకవాసిలో తప్పటమో జరుగుతుంది.

వ్యసనమే కాని, బ్రాకెట్ ఆడి డబ్బు సంపాదించాల్సిన అవసరం వెంకటేశ్వర్లుకు లేదు. అతను ఇల్లరికపు టల్లుడు. మామగారు ఊళ్ళో మోతుబర్లలో ఒకడు కరణీకం చేసి బాగానే సంపాయించాడు. అయినా అంతా కూతురు పేర రాసి పోయాడు.

పెళ్ళినాటికి వెంకటేశ్వర్లుకు పేకాట వ్యసనం మాత్రమే వుండేది. అప్పట్లో పేకముక్కలు అతని చేతిలో వుంటే అదృష్టం నెత్తికెక్కి కూర్చునేది. అతని పేకాట ప్రతిభచూచే, ఆస్తి, పాస్తులు, చదువు సంధ్యలు లేకపోయినా, బ్రతికే

తెలివి ఉందనుకొని పిల్లనిచ్చి ఇల్లరికం తెచ్చుకొన్నాడు మామ.

పెళ్ళయ్యాక పేకాటలో అదృష్టం అతన్ని వదిలేసింది. అయితే మామగారు డబ్బుగలవాడు, పలుకుబడి ఉన్నవాడు, కావటంచేత వెంకటేశ్వర్లుకు కొత్త వ్యసనాలు చాలా పట్టుబడ్డాయి.

తనే కరణం అయి, కుటుంబం పెరిగి, వయసు నెత్తినపడినా మూడు వ్యసనాలు మాత్రం ఈనాటికీ అతన్ని వదల్లేదు. అందులో బ్రాకెట్ ఆడటం, మొదటిది. రెండోది రిలీజ్ అయిన ప్రతి సినిమాను మొదటిరోజు మొదటి ఆటకు మొదటి టిక్కెట్టు కొని చూడటం. యీ వ్యసనాలను సంతృప్తిపరచుకోటానికి తన కరణీకాన్ని కాణీ, అర్ధణాలు సంపాదించటాని క్కూడా ఉపయోగించటం అన్నిటికన్న అసహ్యకరమైన వ్యసనం.

వారం రోజులుగా బ్రాకెట్ కట్టక పోవటానికి, సినిమా చూడకపోవటాని క్కారణం డబ్బు లేకపోవటమే.

~~'నన్నోడి తన్నోడెనా ? తన్నోడి~~ నన్నోడెనా ?' అని క్రాస్ పరీక్షచేసే ద్రౌపతి ముందు ధర్మరాజులా మొహం పెట్టి భార్యముందు నిలబడ్డాడు.

అతని భార్య మహాలక్ష్మి ఊళ్లో మహా సాధ్విగా పేరుపొందింది. చెయ్యి చచ్చినా విదిలించదు కాని, మాటలు మాత్రం తేనెలొలుకుతుంటాయి. అంచేతే తండ్రి యిచ్చిపోయిన ఆస్తిని కాస్తో కూస్తో పెంచగలిగింది. మరోవైపు మంచిది అన్న పేరు సంపాదించింది.

ఆమెకు సినిమాలంటే తగని పిచ్చి అయినా ఒంగోలుదాకా డబ్బు ఖర్చు పెట్టుకువెళ్ళి సినిమా చూడటం అంటే తగని చిరాకు. రేడియోలో ఏ స్టేషన్‌లో ఎప్పుడు సినిమా పాటలు వస్తాయో ఆమెకు కరతలామలకం. ఆ సమయానికి రేడియో పెట్టుకుని పాటలు వింటూంది.

భర్త మొహాన్ని చూడగానే అతని ఆంతర్యాన్ని గ్రహించి ఫైనాన్స్ మినిష్టరులా పరివర్తనం చెందిందామె. 'మీసా' చట్టాన్ని అమలు జరిపి స్మగ్లర్ల ఆట కట్టించినట్లు, ముందర కాళ్లకు బంధాలు వేసేలా మాట్లాడి అతని కోరికను, నోరును నొక్కి పారేసింది.

ఊళ్లో పెద్ద లిటిగెంటుగా, మోసగాడిగా, మాట నమ్మకంలేనిమనిషిగా పేరు పొందిన వెంకటేశ్వర్లు యింతవరకు ఎన్నడూ భార్యదగ్గర ఆ అస్త్రాలని ఉపయోగించలేకపోయాడు.

~~"అబ్బే ... పనేంలేదు~~ ... సినిమా పాటలు విందామని వచ్చాను." అని మెల్లగా బయటికి జారుకొంటున్న భర్తను చూచి తండ్రిని తల్చుకొని గర్వపడింది.

పావుగంట ప్రకటన సందేశాల తర్వాత సినిమా పాట వచ్చినప్పటిలా సంతోషించింది !

బజారున పడ్డాడన్న మాటేకాని



వెంకటేశ్వర్లుకు డబ్బు సంపాదించే మార్గం తోచలేదు. శిస్తు వసూళ్ళ సీజనయితే ఆయన అనుకొన్న క్షణంలో డబ్బు పుట్టించగలడు కాని ఇది నాట్ల సీజను. ఎరువులకని, పొగాకు నారుకని ఊళ్ళో జనం అప్పులకు ఎగబడే కాలం అందులోనూ 'డెట్ మారిటోరియం' అప్పుడే వచ్చిందేమో, అప్పులు చిక్కక జనం అవస్థలు పడుతున్నారు.

"ఏమయ్యోయ్ కరణం,—"

కాంగ్రెసు టిక్కెట్టుదొరికిన అభ్యర్థిలా సంతోషించాడు. కేకేసిన పెద్ద మనిషి వైపు ఇన్కంటేక్సు అధికారిలా చూచాడు పనుంటేకాని వూళ్లో ఎవరూ మనని పలకరించరని తెలుసు అతనికి!

"ఏం పుల్లయ్యా? ఎక్కడికో బయల్దేరినట్లున్నావ్ !"

"నీ దగ్గరికే. ఆ కొండయ్య చూశావా ఎంత అన్యాయానికి దిగాడో! నాకివ్వాల్సిన బాకీ ఎగెయ్యటానికి చూస్తున్నాడు. నోటు రాసింది నువ్వేకదా? ఇదేమన్నా న్యాయమా చెప్పు ?"

"ప్రభుత్వం అప్పులమీద మారటోరియం పెట్టింది కదయ్యా. మనం ఏంచెయ్యగలం చెప్పు."

"అయితే ఆ కొండయ్య అయిదెకరాలుకూడా లేని బీదవాడంటావా ఏమిటయ్యా నువ్వుకూడా ?"

కరణం మాట్లాడలేదు.

"నిన్న ఒంగోలు వెళ్ళి లాయరుతో మాట్లాడి వచ్చాను. కోర్టులో దావా పడేయమన్నాడు. కొండయ్యకు ఐదెకరాలకు పైన భూమి ఉందని నువ్వో కాగితం రాసివ్వాలి."

"కానీ..."డబ్బుకక్కుర్తికి ఆ పదం అతని సంకేతం.

"నీ లిటిగేషన్లు నా దగ్గర కాద య్యోయ్ కరణం. యిది నా ప్రిస్టేజి సమస్య. ఆ కొండయ్యగాడి దగ్గర డబ్బు వసూలు చేయకపోతే మీసాలు గొరిగించు కుంటానని గుళ్లో నిలబడి శపథం చేశా. యిదిగో ఈ పదీ తీసుకొని ఆ కాగితం రాసిపడెయ్యి.

యిలాంటి సమయాల్లో అటువంటి పదులు అయిదు సంపాయించవచ్చునని కరణానికి తెల్సు. కానీ ముందు అలాంటి అవకాశాలు ఎన్నో వస్తాయి. పైగా ఇవాళ ఈ పదికేదో ప్రత్యేకత వుంది.

జేబులో దోపుకున్న ఆ పదిరూపా యలనోటు పెరిగి పెద్దదై పిల్లలు పెట్టి న్నట్లు అనిపించింది వెంకటేశ్వర్లుకు.

* * *

ఎవరి డబ్బుతోనో కొత్త సినిమా చూడటానికి ఒంగోలు పోతున్నానని భార్య పర్మిషన్ తీసుకొని చెప్పుల్లో కాలు పెడుతూండగా పంతులూ అన్న కేక వినిపించింది. మీసాలు గర్వంగా దువ్వు కొన్నాడు వెంకటేశ్వర్లు!

"రా రా కొండయ్యా, కూర్చో, ఏమి టీ మధ్య బొత్తిగా నల్లపూస వయ్యావ్ ?"

కాని కొండయ్య యీ కుశలప్రశ్న లని పట్టించుకొనే స్థితిలోలేడు. కోపంతో ఊగిపోతున్నాడు. అతనికి కోపం వస్తే ఎంత దుష్టత్వానికైనా వెనుదీయడని వూళ్లో ప్రతీతి!

'పుల్లయ్యకు సర్టిఫికెట్ ఇచ్చావుట !'

యిచ్చి పావుగంట కాకముందే ఆ విషయం తాను చెప్పకుండానే కొండయ్యకు తెలిసేటట్లు చేసిన తన రాజకీయ చతురతను తానే అభినందించు కున్నాడు వెంకటేశ్వర్లు.

"అప్పుడే నీదాకా వచ్చిందీ ఆ వార్త. అసాధ్యుడివయ్యా నువ్వు ? ఆ–ఇచ్చాను. అది కరణంగా నా కర్తవ్యంకదా? ఇంతకీ నీకు యాభై ఎకరాలుందని రాయలేదే ! అయిదెకరాల పైనవుందనే రాశాను. నువ్వు లేదంటావా ఏమిటి ?"

"ఉంటే ? యిచ్చేస్తావా ఏమిటి సర్టి ఫికెట్టూ – బజారునపోయే ప్రతి వెధ వకూ !"

కరణంమాట్లాడలేదు–మామూలుగానే.

"పది రూపాయలకోసం కక్కుర్తి పడి ఆ సర్టిఫిక్కెట్టు ఇచ్చావు. సరే, యిదిగో నా పది, నాకు నాలుగు ఎకరాల పైన సెంటుభూమి లేదని సర్టిఫికెట్టు రాసియ్యి. ఆ పుల్లయ్యగాడి సంగతి నేను చూసుకొంటాను–ఆ పైన !"

"కానీ !"

"అబద్దాలు గిబద్దాలు అని కబుర్లు చెప్పకు. నీ వృత్తే అబద్ధమని అందరికీ తెల్సు. పది రూపాయలకు కక్కుర్తిపడి నాకు వందలు వదిలిస్తున్నావు."

"అదిగాదండీ–నా బాధ. నిజం రాసిన

దుకూ. అబద్ధం రాసినందుకూ వెల ఒక టేనా అని?"

పదిహేను రూపాయలు కరణం జేబు లోకి పోయాయి. కొండయ్య క్షణంలో నాలుగెకరాల బక్కరైతయ్యాడు

* * *

బెంచి క్లర్కు బుచ్చిరామయ్య ఆ రోజు 'కలెక్షన్' లెక్క చూచు కొన్నాడు పాతిక రూపాయలు!

నెలాఖరు రోజులు. అతనికా రాత్రికి ఏభై రూపాయలు అవసరం. ఆ దృష్టి తోనే పొద్దున కోర్టుకొచ్చాడు. ఆ టార్గెట్ సాధించటానికి పగలంతా ఎన్నో పాట్లు పడ్డాడు. సగమే ఫలించింది.

మిగతా సగం, ఎలా?

ప్రశ్నలు భూతాల్లా పెరుగుతున్న ధరల్లా, కళ్ళముందు తిరుగుతుంటే ఆ రోజే దాఖలైన కేసుల్ని తిరగేసేడు.

పిటీషన్! కౌంటర్ పిటీషన్!

రెంటిని పైకి లాగి పరిశీలించాక రెండొందలు జేబులో పడ్డంత సంబర పడ్డాడు!

కోర్టులో కొట్టుకట్టేసి బ్రాకెట్ కంపెనీ వైపు బయలుదేరాడు?

అదృష్టం అతనికి దారిలోనే ఎదుర యింది!

"ఏమండోయ్ కరణంగారూ? ఎక్క డికా పరుగు? బ్రాకెట్టు తగిలిందా ఏమిటి? బొత్తిగా కనిపించటంలేదు."

"మనకంత అదృష్టం కూడానా మహానుభావా. నిన్న పాతిక దొరికింది. యివాళ..."

"మీరలాగే అంటారు. ఏమిటి మీవూరి సంగతులు?"

"కోర్టువారు మీరే చెప్పాలి."

"ఈ కొత్త శాసనాలవల్ల మాకు కేసులు తగ్గిపోయాయండీ. కానీ యివాళ ఓ కేసు ఫైల్ అయింది బాకీ కేసు. బాకీవున్న ఆసామికి అయిదెకరాలు పైన వున్నదని పిటీషనర్ సర్టిఫికెట్ దాఖలు చేశాడు. బాకీవున్న ఆసామీకూడా తనకు నాలుగెకరాలకు పైన ఎక్కువ లేదని ఓ సర్టిఫికెట్ పడేశాడు జడ్జి గారు రెండు సర్టిఫికెట్లు చూచాడు. సర్టి ఫికెట్లు యిచ్చిన కరణంమీద క్రిమినల్ ఏక్షన్ తీసుకోమని రాశాడు.

"ఎందుకు?" కరణానికి అప్పటికే ముచ్చెమటలు పోసేయి.

"ఎందుకేమిటండీ? రెండు సర్టిఫి కెట్లు యిచ్చింది ఒకే కరణం."

కరణం నోరు పడిపోయింది. గుండె ఆగిపోయింది

"సరే, నేను వెళ్ళవస్తాను. అర్జంటుగా డబ్బు కావలసి వచ్చింది నీబోటివాళ్ళ నెవరినైనా ముట్టెత్తక తప్పదుగా?"

"బుచ్చిరామయ్యగారూ. .....బుచ్చి రామయ్యగారూ..."

తమిళనాడు ఎక్స్‌ప్రెస్‌లా నడు స్తున్న బుచ్చిరామయ్య వెంట జారు తున్న గోచీని – గుండెను పైకి లాక్కొంటూ పరుగుతీసేడు కరణం.

"ఇంతకీ ఆ కరణం పేరేమిటో చెప్పేరు కాదు."

"తెలీదు".

"పోనీ ఏ వూరో—"

"గుర్తులేదు."

కరణం అటూ ఇటూ చూచాడు. జేబులో చెయ్యి పెట్టేడు. కనకమ్మ ఏదో వస్తువులు తీసుకురమ్మని ఆజ్ఞాపించి యిచ్చిన యాభై రూపాయలు చేతికి తగిలేయి.

బయటికి తీయాలంటే భయమేసింది.

"కేసు పెత్తే కరణాని కేమవుతుం దంటారు ?"

"ఉద్యోగం ఊడుతుంది. ఆ తర్వాత బస జైలుకు మారుతుంది. అంతే."

యాభై రూపాయల్ని చటుక్కున బయటికి లాగి బుచ్చిరామయ్య చేతిలో పెట్టాడు.

"ఏమిటండీ యిది ?"

"అప్పుమాత్రం కాదు. ఏదో..."

బుచ్చిరామయ్య నిలబడి జేబులోంచి సిగరెట్టు తీసి వెలిగిస్తూ చిద్విలాసంగా నవ్వేడు. డబ్బునోసారి చూచి కనుబొమలు ముడిచేడు.

"నాకొక్కవల్సింది రెండువందలండి. ప్రస్తుతానికి యీ యాభైతో సర్దుబాటు అవుతుందనుకోండి. ఏమైనా అప్పుగా నయితేనే తీసుకొంటా. అన్నట్లు-ఆ కేసు మీవూరిదే ననుకుంటా. పుల్లయ్య, కొండయ్య లని ఎవరైనా వున్నారా మీ వూళ్లో?"

జడ్జిగారు ఉరిశిక్ష విధించినా అంత గిలగిల లాడడు కరణం. పాతికరూపాయలకు కక్కుర్తిపడితే అంతకు ఎనిమిదింతలు ఫైన్.

"సరే మిగతా డబ్బు రేపటికన్నా ముస్తెత్తాలిగా ?"

"మళ్ళీ మీరేం కష్టపడతారు? రేపు లంచివేళకు ఎలాగోలాగు నేనే వచ్చి సర్దుతాగా. కానీ అప్పుగా మాత్రంకాదు. ఏదో..."

"యిక మీరేం మాట్లాడక హాయిగా వెళ్ళి నిశ్చింతగా నిద్రపోండి."

బుచ్చిరామయ్య రిక్షా ఎక్కాడు.

కరణం కాళ్ళీడ్చుకుంటూ ముస్తెత్తటానికి మార్గాలాలోచించసాగేడు.



# ఫారిన్ కొలాబొరేషన్

(గల్పిక)

నిర్ఘాంతపోయాను. పాపారావు బంకు ఏమయింది. శ్రేష్ఠమైన లంక పొగాకు చుట్టలిచ్చే పాపారావును ఏదో పెద్ద చేప మింగింది! పాపారావు బంకు ఉండవలసినచోట అద్దాలషాపు వెలిసింది. నేను ప్రపంచాన్ని తిట్టుకుని, పాపారావుకోసం జాలిపడుతూండగా ఒక ఫాషనబుల్ మనిషి పెరిగిన జుట్టుతో, బెల్‌బాటమ్ పాంట్‌తో బయటికి వచ్చి, నన్ను చూసి చిన్న కేక పెట్టాడు.

పాపారావే! హౌ వండర్‌ఫుల్! చిన్నచేపను పెద్దచేప మింగలేదు; చిన్నచేప పెరిగి పెద్దదయింది. కాని ఈ మార్పు ఎలా సాధ్యమయింది? పాపారావుకు పెట్టుబడిలేదు, పెద్ద ఆర్జనాలేదు – రోజుకు నాలుగు రూపాయలు, అంతే!

పాపారావు నన్ను లోపలికి తీసుకుపోయాడు. కోకాకోలా తెచ్చి ముందు పెట్టాడు. షాపునిండా కోక్‌లే!

"ఏమిటిది? ఏమయింది? జీతం మీద ఇక్కడ ఉంటున్నావా?" అన్నాను.

"అమెరికన్ కొలాబొరేషన్, గురూగారూ! పీస్‌కోర్‌వాట్ట. డాలర్లు పెట్టుబడి చేస్తాననీ, వ్యాపారం పెంచమనీ అన్నాడు. ఇదంతా ఆడి చలవ. అమ్మకాలు రోజుకు రెండొందలు దాటతాయి. అయితే అంతా ఆడికే పోతుంది. పోదూ మరీ? ఇదంతా నిజానికి ఆడిదేగా? నాకు రోజుకు అయిదారు రూపాయలు మిగులుతాయి. చాలదా?" అన్నాడు.

పాపారావును అభినందించాను.

ఇది కిందటేడు. ఈ ఏడు అటుకేసి వెళితే "ఇండో-అమెరికన్ కోకాకోలా సెంటర్ ఉన్నదిగాని అందులో పాపారావు లేడు. ఇంకెవడో ఉన్నాడు

అమెరికావాడు ఇండియానుంచి ఉడాయిస్తూ షాపును మరెవడికో అమ్మాట్ట. పాపారావు ఏమయ్యాడో తెలీదు మళ్ళీ బంకు తెరుస్తాడా? తెరవడు. మళ్ళీ లంకపొగాకు చుట్టలు అమ్ముతాడా? అమ్మడు.

ఇంక పాపారావు నాకు కనిపించే అవకాశంలేదు.

***కొడవటిగంటి కుటుంబరావు***




వాయువ్యంగా మన 'చాంబ్'మీద పాకిస్తాన్, దక్షిణంగా వాళ్ళ 'సియాల్‌కోట్' మీద మనవాళ్ళూ కురిపిస్తున్న బాంబుల వర్షానికి జమ్మూలోని యిళ్ళన్నీ అదురుతున్నాయి. డిసెంబరు నెల చలి నరాల్ని కొరుక్కు-తింటోంది. నడినెత్తిన, నల్లటి ఆకాశంలో నక్షత్రాలు మెరుస్తున్నాయి. బాంబులు ప్రేలినప్పుడల్లా ఆకాశపు టంచులు రక్తవర్ణంతో మెరుస్తున్నాయి. గుండె లదిరేటట్లుగా గర్జిస్తున్నాయి. చిమ్మచీకటిగా ఉన్న నగరవీధుల్లో మిణుగురు పురుగులు, 'బ్లాకవుట్'ని ధిక్క-రిస్తున్నాయి.

తలుపులు మూసినగదిలో కొవ్వొత్తి భయం భయంగా వెలుగుతోంది. గ్లాసుల్లో ఉన్న మందు నెమ్మది నెమ్మదిగా మా గొంతుల్లోకి దిగుతోంది. ఆరోజుఉదయం జమ్మూ ఆకాశంలో జరిగిన విమాన యుద్ధానికి, మా నరాలు సడలిపోయాయి వచ్చిన నాలుగు శత్రువిమానాల్లోనూ, రెండుకూలిపోయినందుకు,మాహృదయాలానందంతో నాట్యంచేశాయి. ఒకపక్క-భయంతో, మరోపక్క-న ఉత్సాహంతో నలిగి చచ్చిపోతున్న మనస్సుల్లోంచి-భయాన్ని పారద్రోలడంకోసం మందేసుకొంటున్నాం.

తలుపుమీద దబదబా బాదినచప్పుడు వినిపించింది. చక్రపాణి లేచి వెళ్ళి తలుపుతీశాడు. చలిగాలితోపాటు లోప లికి ప్రవేశించాడు పద్మనాభం. చక్ర పాణి తలుపుమూసి ఓ గ్లాసులో విస్కీ పోసి, మంచంమీద కూర్చున్న పద్మ నాభం ఎదురుగా పెట్టాడు. తిరిగి తన కుర్చీలో కూర్చుంటూ, "నీకు నీళ్ళు కావలిస్తే వంటింట్లోకి పోయి తెచ్చుకో. స్టీలుగిన్నెలన్నీ మా ఆవిడ తాళం వేసుకుపోయింది! ఉన్న ఒక్క గాజు కూజా ముక్కలై పోయింది!" అన్నాడు నవ్వుతూ.

"నేను విస్కీకోసం రాలేదు. అక్కడ చాంప్‌లో మన జవాన్లు చాలామంది తీవ్రంగా గాయపడ్డారు. హాస్పిటల్లోనూ, రిసెర్చి లేబొరేటరీన్‌లోనూ రక్తం తీసుకొంటున్నారు. మనందరం వెళ్ళి రేపుదయం రక్తదానం చెయ్యాలి. నేను మా ఆఫీసు జీప్‌ని ఏర్పాటుచేశాను. మీరందరూ తొమ్మిదింటికల్లా సిద్ధంగా ఉండండి. ముందుగా వెడ్తే త్వరగా తిరిగిరావచ్చు. ఏమంటారు?" అన్నాడు పద్మనాభం, మా అందరివంకా చూస్తూ.

"నీ కిష్టమైతే నువ్విచ్చుకో! మా అందర్నీ అడగాపెట్టాకుండా, మా అనుమతిలేకుండా, నిన్ను జీప్ ఎవరేర్పాటు చెయ్యమన్నారు?" అన్నాడు, మోహన రావు విసురుగా, తాగిన నిషాలో. నాకు మనస్సు చివుక్కుమనిపించింది. మోహనరావు మీద ఎక్కడలేని కోపం ముంచుకొచ్చింది. చేతిలోఉన్న గ్లాసునిబల్ల మీద బాది పెడ్తూ "సిగ్గుండాలి, ఆ మాట నడానికి. నిజానికి పద్మనాభం ఎంతో మంచిపని చేశాడు. ఎవరిమాటెలాఉన్నా నేనుమట్టుకు సిద్ధం." అన్నాను.

రాజశేఖరం బెదురు బెదురుగా అన్నాడు, "నాకు రక్తాన్ని చూస్తే కళ్ళు తిరుగుతాయి. అటువంటప్పుడు రక్తా న్నెలా యిచ్చేది? చాలా నొప్పిగాకూడా ఉంటుందని విన్నాను. చాలా నీరసపడి పోతామనుకొంటాను!"

"ఎందుకంత భయం! ఇంజక్షన్ తీసుకొంటున్నప్పు డేమంత నొప్పి ఉంటుంది? ఇదీ అంతే. రక్తం తీసు కున్న తర్వాత వాళ్లు బిస్కెట్లూ, కాఫీ అవీ యిస్తారు." అన్నాడు పద్మనాభం చంటిపిల్లల్ని బెల్లిపించినట్లు. నాకూ, చక్రపాణికీ నవ్వొచ్చింది. "నేనుకూడా సిద్ధమే. రాజశేఖరం, మోహనరావూ గాజులు తొడుక్కుని కూర్చుంటారు!" అన్నాడు చక్రపాణి.

"మీకేకాదు- దేశభక్తి, దమ్ములూ ఉంట! నువ్వన్న టైమ్‌కి మా యింటికిరా" అన్నాడు, మోహనరావు గ్లాసు ఖాళీ చేస్తూ. మంచికి ముందడుగువేసేవారి నుండి వెనక్కు వెళ్ళిపోయే ధైర్యంలేని రాజశేఖరంకూడా 'సరే' అన్నాడు పద్మనాభం ఉత్సాహంగా గ్లాసందు కొన్నాడు. "నువ్వు విస్కీకోసం రాలే

దుగా," అన్నాడు హేళనగా మోహనరావు.

"నీలా పిరికితనం మరచిపోవడానికి కాదు. రేపు యివ్వబోయే నా రక్తాన్ని స్టెరిలైజ్ చెయ్యడంకోసం!" అంటూ పద్మనాభం, ఒక్క గుక్కలో విస్కీ పని పట్టించేశాడు.

'అందరికంటె ముందు' అన్నదానికి నిర్వచనం ఏనాడో మర్చిపోయాను. ముందస్తుగా వెళ్ళి టిక్కెట్లు తెచ్చుకోవాలనీ, రైల్వే రిజర్వేషన్ చేయించుకోవాలనీ,ఎన్నోమార్లు ప్రయత్నించాను. నేనెంత ముందరగా వెళ్ళినా, నాకంటె ముందుగా వచ్చినవాళ్లు చాలామంది ఉండేవారు. అయితే తొమ్మిదింటికీ వెళ్ళి ఎవడు కూర్చుంటాడు? అందులోనూ రక్తదానం చెయ్యడంకోసం!' అని ఆలస్యంగా లేద్దామనుకొన్న నాప్రయత్నాన్ని పద్మనాభం కొనసాగనివ్వలేదు. ఎనిమిదిన్నరకే వచ్చి లాక్కుపోయాడు. అందరికంటే ముందుగా నా దగ్గరకు వచ్చినందుకు నసుగుతూ, జీప్‌లో కూర్చున్నాను. మొత్తంమీద అందరమూ తొమ్మిదింటికల్లా హాస్పిటల్ చేరుకున్నాం. అప్పటికే నలభై మంది దాకా వరండాలో ఉన్న బెంచీలమీద కూర్చునిఉన్నారు! అలవాటయిన అనుభవమే కాబట్టి మేంకూడా వరస చూసుకొని కూర్చున్నాం.

రాజశేఖరం బెదురుగా ఉన్నాడు. మొహంలో ఆందోళన స్పష్టంగా కనబడ్తోంది. దాన్ని కప్పిపుచ్చుకోడానికి, వణికేచేతుల్తో సిగరెట్ వెలిగించాడు. "రక్తం యివ్వబోయేముందు, పొగ త్రాగడమెందుకు? రక్తాన్ని నికొటిన్‌తో కలుషితంచెయ్యడంతప్పు!" అన్నాడు చక్రపాణి ఆ మాటల్లో నిజమెంతో నాకు తెలియదుకాని అప్పటి కప్పుడు నాకా మాటలు సమంజసంగా తోచడంతో, రాజశేఖరం చేతిలోంచి సిగరెట్‌ని లాగి పారేశాను. పద్మనాభం ఏదో మాట్లాడుతున్నాడు. మోహనరావు మౌనంగా కూర్చున్నాడు. జనం గుంపులు గుంపులుగా రావడం మొదలుపెట్టారు. వరండాలు నిండిపోతున్నాయి. అంతలోనే 'ఎయిర్‌రైడ్ వార్నింగ్' సైరన్ భీకరంగా వినిపించింది. కూర్చున్న వారిలో చాలామంది బయటకు పరుగెత్తారు. విమానాల హోరుతోనూ,నరగం చుట్టూ ఉన్న 'యాంటీ ఎయిర్‌క్రాఫ్ట్ ఫిరంగుల'ధ్వనులతోనూ ఒక్కమారుగా ఊరంతా దద్దరిల్లిపోయింది. మరునిముషంలో నిశ్శబ్దం తాండవించింది. రాజశేఖరం మొహం పాలిపోయింది. లేవబోయేవాణ్ణి కూర్చోపెట్టాడు పద్మనాభం. "చూడు బ్రదర్! ఈ ఒక్క నిముషంలోనే యింతగా అదిరిపోయావ్!అక్కడ యుద్ధరంగంలో మన సైనికుల పరిస్థితి ఆలోచించు," అన్నాడు పద్మనాభం, రాజశేఖరం భుజం తట్టూ. రాజశేఖరం

పేలవంగా నవ్వుతూ అన్నాడు. "నువ్వు నన్ను అపార్థంచేసుకొన్నావు. నేను లేచింది, వెళ్ళడానికి కాదు. మన ముందు ఖాళీఅయిన స్థలాల్లో కూర్చునేందుకు!" రాజశేఖరం అన్నది అబద్ధమని మా కందరకూ తెలుసు. కాని అతని సమాధానం మాకు నచ్చింది. లేచి వెళ్ళి ఖాళీ అయిన ముందర బెంచీమీద కూర్చున్నాం. మరో అయిదు నిముషాల్లో మామూలు వాతావరణం వచ్చేసింది. వరండాలు మళ్ళీ జనంతో నిండిపోయాయి

తెల్లకోటు తొడుక్కొన్న ఓ వ్యక్తి వచ్చి మా పేరూ యితర వివరాలూ వ్రాసుకొన్నాడు. మా అందర్నీ చూస్తూ, "మీరందరూ వచ్చినందుకు చాలా సంతోషం. అయితే ఒక్క మనవి. పోయిన రెండురోజుల్లోనూ వందలాది మంది వచ్చి రక్తదానంచేశారు. అన్ని గ్రూప్‌లకీ చెందిన రక్తాల్ని సేకరించగలిగాం. ఈరోజున 'ఓ' గ్రూప్‌రక్తానికి ప్రాముఖ్యత నిస్తున్నాం ఈ రక్తాన్ని ఎవరికైనా యివ్వవచ్చును. ఎ.బి, ఎబి-గ్రూప్‌లకి చెందిన క్తం నిలవచెయ్యటానికి ఎక్కువ ఏర్పాట్లు కాని, అక్కడ యుద్ధరంగంలో గాయపడిన సైనికుల రక్తం గ్రూప్‌లని పరీక్షించి ఆ గ్రూప్‌కి చెందిన రక్తం యిచ్చేటంత వ్యవధీ లేవు! అందుకని మీ రక్తం గ్రూప్ నిర్ణయింపబడినతర్వాత, 'ఓ' గ్రూప్ వ్యక్తులనుంచే రక్తం తీసుకోవడం జరుగుతుంది. మిగిలిన గ్రూప్‌లవారీ ఎడ్రసులు మాదగ్గర ఉంటాయి కాబట్టి, అవసరమొచ్చినప్పుడు వారిని మేమే స్వయంగా పిలుస్తాము" అన్నాడు.

ఇద్దరిద్దరుగా, నెంబరువారీగా, రక్త పరీక్షచేసే గదిలోకి వెళ్ళాం. చక్కగా మాట్లాడుతూ యిద్దరు నర్సులు సూదులు పుచ్చుకొని వేలి మొనల్ని గుచ్చినప్పుడు మృదువైన చేతులస్పర్శకి ఆనందించాలో సూదిగుచ్చిన బాధకి ఏడ్వాలో తెలియక రక్తాన్ని గాజుపలకలకి రాసి, పక్కగదిలోకి పోయి కూర్చున్నాం. పదినిముషాల్లో మరోవ్యక్తి వచ్చి, మా పేర్లు వ్రాసి ఉన్న చిన్న కార్డు లందించాడు. నా రక్తం 'ఓ' గ్రూప్! సంతోషంతో ఎగిరి గంతేయాలనిపించింది. పద్మనాభానిది 'ఎ'. చక్రపాణీ, రాజశేఖరం—'బి' గ్రూప్. మోహనరావుది 'ఓ' గ్రూప్ నాలాగే. పద్మనాభం దిగాలుపడిపోయాడు. రాజశేఖరం మొహంలో లీలగా ఓ సంతోషరేఖ నేను గమనించక పోలేదు. చక్రపాణి నిర్వికారంగా ఉండిపోయాడు. మోహనరావు ఇబ్బందిగా మొహంపెట్టాడు.

ఓ డాక్టరువచ్చి నన్నూ, మోహనరావునీ పక్కనే ఉన్న గదిలోకి తీసుకుపోయాడు. జీప్‌దగ్గర మాకోసం ఎదురు చూస్తూ ఉంటామని చెప్పి మిగిలిన ముగ్గురూ వెళ్ళిపోయారు. ఆ గదిలో

మూడు 'బెడ్' లున్నాయి. ఓ బెడ్ మీద నేను పడుకొన్నాను. కర్టెన్ కవతలగా ఉన్న బెడ్‌మీద మోహనరావు పడుకొన్నాడు. పైకెంత బింకంగా ఉన్నా, రక్తదానం చెయ్యడం అదే మొదటిసారి కావడంవల్ల నాకు లోపల కొంత బెరుకుగానే ఉంది. ఎందుకో హఠాత్తుగా శోభనంరోజు జ్ఞాపకాని కొచ్చింది. నాలో నేనే నవ్వుకొన్నాను. కాని ఆ నవ్వు నాకు తెలియకుండా పెదవులమీద కన్పించింది కాబోలు, డాక్టరడిగాడు, "ఎందుకు నవ్వుతున్నారు?" అని.

"ఏంలేదు డాక్టర్! ఊరికే నవ్వొచ్చింది," అన్నాను తేలికగా.

"కాదు. ఏదో కారణముండితీరాలి," అన్నాడు డాక్టర్, నా బ్లడ్‌ప్రెషర్ చూస్తూ.

"నాలాంటి పిరికివాడి రక్తం తీసుకొన్న సైనికుడు మళ్ళీ ఈ జన్మలో యుద్ధం చెయ్యగలడా? అన్న ఓ పిచ్చి ఆలోచన వచ్చింది, డాక్టర్! అన్నాను" అనుకోకుండా అబద్ధం ఆడాను. కాని డాక్టర్ నా మాట నిజమని నమ్మాడు.

"మీరు నిజంగా పిరికివారే అయితే, ఇలా రక్తం ఇచ్చేటందుకు వచ్చేవారే కాదు. కాని మీ ఆలోచన ఒక మంచి జోక్! నేను జ్ఞాపకం ఉంచుకొంటాను" అన్నాడు డాక్టర్, సూదిని నా రక్తనాళంలోకి గుచ్చుతూ. కొంచెంగా అరవాలనిపించింది. కాని సభ్యత నోరు నొక్కడంతో, మౌనంగా ఉండిపోయాను. కిందఉన్న సీసాలోకి రక్తం నెమ్మదిగా దిగుతోంది. పక్కనే ఉన్న అసిస్టెంటుకి ఎంత రక్తం తీసుకోవల సిందీ ఆదేశించి, డాక్టరు మోహనరావు దగ్గరకు వెళ్ళాడు. నా పక్కనఉన్న అసిస్టెంటు మధ్యమధ్యలో కమలా తొనలు నోటికందిస్తూ, ఏవో కబుర్లు చెప్తున్నాడు. ఒక్కొక్క రక్తంబొట్టూ నాలోంచి దిగుతోంటే, ఒక్కొక్క సైనికుడికి ప్రాణదానం చేసినంత సంతోషం నన్ను మైమరపిస్తుంది. గర్వంతో నిండిపోయింది మనసంతా. మోహనరావు బెడ్‌వైపు తలతిప్పాను. తెర కవతల్నించి మాటలు వినిపిస్తున్నాయి.

"మీరేమిటో కలవరపడ్తున్నట్లున్నారు. ఏమీ భయంలేదు!" అంటున్నాడు డాక్టరు.

"అదికాదు!......" నసుగుతూ అన్నాడు మోహనరావు.

"ఏమీ సంకోచంలేకుండా చెప్పండి!"

"నాకు సుఖరోగాలున్నాయి! నా రక్తం మరొకరికి ప్రాణదానం చెయ్యక పోగా..." మోహనరావు నెమ్మదిగా అన్నాడు. మతిపోయినట్లయింది. అప్రయత్నంగా పిడికిలి విడింది. "ఏమండి సార్, మీరు గుప్పిడి విప్పకూడదు!"

నా పక్కన కూర్చున్న అసిస్టెంటు మందలించడంతో, మళ్ళీ పిడికిలి బిగించాను.

"మామూలు పరిస్థితుల్లో అయితే రక్తం అన్నివిధాలా యోగ్యమైనది అన్న నిర్ధారణ జరిగిన తర్వాతనే, మరొకరికి ఉపయోగిస్తారు. అక్కడ యుద్ధ రంగంలో ఉన్న తీవ్ర పరిస్థితివల్ల, అనాలోచితంగా కలుషితమైన రక్తాన్ని ఎక్కించే అవకాశాలు లేకపోలేదు. నిజాన్ని చెప్పిన మిమ్మల్నీ, మీ గుండె ధైర్యాన్నీ మెచ్చుకొంటున్నాను. మీ రక్తం తీసుకోను. కాని ఒక సందేహం! తీరుస్తారనుకొంటాను?" అన్నాడు డాక్టర్.

"అడగండి" మోహనరావు మాటలు పేలవంగా వినవచ్చాయి.

"మీ రక్తం ఆరోగ్యదాయకమైనది కాదని తెలిసికూడా, ఎందుకొచ్చినట్లు?"

"మీ రిప్పుడన్న గుండెధైర్యం లేక! నా స్నేహితులు నన్ను బలవంతపెట్టి నప్పుడు, వాళ్ళ దృష్టిలో పిరికివెధవ కింద జమకట్టబడ్తానన్న భయంతో వచ్చాను!" మోహనరావు సమాధానం విని, అతగాడిమీద నాకు ఒక్కసారిగా జాలికలిగింది.

"మీరు యుద్ధం ముగిసినతర్వాత నాదగ్గరకు రండి. పరీక్షలుచేసి వైద్యం చేస్తాను. గుడ్‌లక్!" అన్నాడు డాక్టరు, మోహనరావుని బయటకి పంపిస్తూ. మరో అయిదు నిముషాల్లో నేనూ గది బయట అడుగుపెట్టాను. మోహనరావు లోపలి వరండాలోనే, నాకోసం ఎదురు చూస్తున్నాడు మౌనంగా యిద్దరమూ బయటకు దారితీశాం, వాళ్ళిచ్చిన కాఫీ సేవించినతర్వాత.

పద్మనాభం ఎదురుగావచ్చి మమ్మల్ని ద్దర్నీ కౌగలించుకొన్నాడు. "మీరిద్దరూ నిజంగా అదృష్టవంతులురా! మన జవాన్లకి సేవచేసే భాగ్యం నాకు లేక పోయింది," అన్నాడు విచారంగా. మోహనరావు సిగ్గుతో మాట్లాడలేక పోయాడు. మోహనరావు భుజంమీద తడ్తూ పద్మనాభంతో అన్నాను, "పోనీ లేరా! వాళ్ళు తీసుకొన్నా తీసుకోక పోయినా రక్తదానం చెయ్యాలన్న కాంక్ష నీకుంది. అది చాలదా!" పద్మనాభం మాయిద్దరి చేతులూ పుచ్చుకొని, జీప్‌వైపు నడిచాడు. చక్రపాణీ, రాజశేఖరం ఎదురుచూస్తున్నారు.

మోహనరావు గొప్పతనాన్ని నలుగురికీ ఎలా చెప్పగలను?





# భస్మాసుర హస్తం

బులుసు-జీ-ప్రకాష్

"ఈ అర్జీల దాఖలా దరఖాస్తుదారు లెవరు వచ్చార్రా—బందులూ!"

"ఏరూ రాలా బాబుగారూ!"

"సరిగా చూసే చెబుతున్నావా లేక నిద్దరమత్తులోనే జవాబిస్తున్నావా?"

"సరిగ్గా చూసే చెబుతున్నా బాబుగారూ! ఒక్కగా నొక్క పిట్టమనిషి ఆఫీసు కివాళ నూతులి కోసరం రాలేదండీ!"

"వరండా అంతా చూశావన్న మాట?"

"కాంపౌండుకూడా గాలించి వచ్చానండి."

"అయినా కనబడలేదా?"

"అహఁ పిసరూ కనబడలేదండీ!"

"కాంపౌండు అవతల చూశావురా బందులూ!—అవతల."

"అవతలకూడా చూడాలా బాబుగారూ! అది మన ఆతా కాదే?"

"ఆతా ఏమిట్రా ఆతా! ఈ తాలూకా అంతా మన ఆతావే! అన్నిచోట్లూ గాలించి చూడాలి. చూడకపోతే మనకీ రోజు రాబడి వచ్చిదెలారా? పోయి కాంపౌండు అవతల వెతుకు. చెట్లకిందని ఎక్కడైనా నిద్రపోతున్నారేమో చూడు. పల్లెటూరి బైతులికిదో దురలవాటు. బ్రహ్మాండమైన పని పెట్టుకుని వస్తారు. ఇక్కడా, అక్కడా శుష్కంగా నిద్ర పోతుంటారు బొట్టూ కాటుకా పెట్టి, పిల్చుకొచ్చి పనిచెయ్యడానికి తాతగారి నౌకర్లెవరైనా వున్నారా ఏమిటిక్కడ?"

"నేనున్నానుగా బాబూ!"

"పోరా అవతలకి అట్టే పేలక!"

"అవతల లేకపోతే బస్సుస్టాండుకీ, రైల్వేస్టేషనుకీకూడా వెళ్ళమని శలవా?"

"ఎందుకూ? మళ్ళీ శెలవుపెట్టకుండా అత్తారింటి కుడాయించేద్దామనా?"

"కాదండీ బాబుగారూ! దరఖాస్తుదారు లెవరైనా బళ్ళు దిగుతున్నారేమో చూసి పట్టుకు తీసుకురావడానికి. అక్కడే పట్టుకుంటే అనవసరంగా మరెక్కడికీ వెళ్ళరు."

"రైతో. అలానే కానీ."

బందులు కచేరీ కాంపౌండు అవతల చెట్ల మొదళ్ళన్నీ దుర్భిణీవేసి చూశాడు. ఎవరూ కనబడకపోతే స్టాండుమీదుగా స్టేషనుకి బయలుదేరి వెళ్ళాడు.

హెడ్‌గుమస్తా కోపంతో పిటీషన్లు డ్రాయర్లో కుక్కిపారేశాడు. ససేమిరా చదవలేదు. లక్ష్మీ సాక్షాత్కారం జరిగితేనే చదువుతాడు. చేతిలో గలగలా ధనం రాలగానే యంత్రంలా పనిచేస్తుంది చెయ్యి. స్వంతపనిలాగ చకచకా పని జరిగిపోతుంది.

నూతులమీద అధికారి తానుతెప్పించు కున్న మధ్యాహ్న ఫలహారం తిని, తాజాగా హెడ్‌గుమస్తాని దగ్గరికి పిలి పించుకున్నాడు.

"ఎన్ని దరఖాస్తులు మంజూరు చెయ్యాలో తేల్చేరా పంకజాక్షంగారూ!"

"అబ్బే ఎలా తేల్చడమండీ!" అన్నాడు పంకజాక్షం.

"తేల్చడానికేమైనా అడ్డున్నాయా?"

"ఒక్కటే ఒక బ్రహ్మాండమైన అడ్డు. పార్టీ లెవరూ ఇంకా రాలేదు. పోయి తీసుకురమ్మని బందుల్ని పంపిర చాను. వాడూ ఇంకా పత్తా లేదు. రాగానే తేలిపోతుంది లెండి, ఎన్ని మంజూరు చెయ్యాలో ఎన్ని చెయ్యఖ్ఖ ర్లేదో!"

"పార్టీలెవరూ రాకపోతే ఏదీ మంజూరు చెయ్యకండి. అసలా పిటిషన్ల వంక చూడనే చూడకండి చేతిలో కాస్తో కూస్తో పడేదాకా కిక్కురు మనకండి. విరాళాలు చవకనుకున్నారు చవటపీను గులు!" ఆజ్ఞాపించాడు అధికారి.

"చిత్తం సార్!" అని ఒక్క సలాము కొట్టేడు హెడ్‌గుమస్తా.

* * *

"సుభాషిణీ!" అని అరిచాడు హెడ్‌గుమస్తా

"ఏం బాబూ!" అని బందులు హాజరయ్యేడు.

"నువ్వా ఏమిట్రా సుభాషిణివి? ఫూల్!—ఎవర్రా బందులూ ఈ సుభా షిణి? మనిషి కనబడదేం? తమాషా అనుకుందా ఏమిటీ? పెద్దదొరసానిలా దరఖాస్తులు పెట్టేయడం, మరి ఆఫీసరు గార్ని కలియడానికి రాకపోవడమూను. ఇవాళో దరఖాస్తు, నిన్ననో దరఖాస్తు, మొన్ననో దరఖాస్తు! కొంపేం ములి గింది ఆఫీసరుగార్కి వచ్చి మొహం చూపిస్తే?'' పంకజాక్షం సుభాషిణి సంతకం చూసి డ్రాయర్లో కూరేశాడు.

"పిల్చుకు రమ్మన్నారా యేమిటి బాబూ?"

"పోరా వెధవా! ఎక్కడ వెదుకు తావ్? ఇంత మహాపట్టణంలో ఎవరని కనుక్కుంటావ్?" కసిరేడు పంకజాక్షం

"అదీ నాకు చెప్పాలా బాబూ! రోజూలాగే, అవతల చెట్టుకిందా, బస్టాండూ, స్టేషన్ దగ్గరానూ!" బందులు తన మామూలు ధోరణి వెలిగించాడు.

"ఆ స్థలాల్లో వందలాది జనం వుంటా్రరా వెర్రివెధవాయ్! ఇంతమంది లోనూ ఈ సుభాషిణెవరో నీకేం తెల్సు?"

"ఎందుకు బాబయ్యా! ప్రతిద్వారం దగ్గరికీ వెళ్ళి—సుభాషిణీ! సుభాషిణీ! అని అరుస్తాను. ఎవరు పలికితే వాళ్లే సుభాషిణి—"

"ఒకవేళ వచ్చిందనే అనుకో. వస్తే సుభాషిణీ అని నువ్వు పిలవగానే, ఎవ్రరా 'నువ్వు రాస్కెల్!' అని దవడపళ్ళు రాలగొట్టేట్టుంది. ఘరానా కుటుంబానికి చెందిన ఆడదేమోచూడు!"

"అలా అయితే ఆఫీసు గుమ్మంలో మళ్ళీ అడుగుపెడుతుందా? జుత్తుపట్టు కుని గడగడా ఈడ్చిపారేయనూ!"

"ఎలాగో వెళ్ళి తగలడు. సుభాషి ణిని మాత్రం తీసుకురా!"

బందులు గబగబా ఆఫీసుప్రాంగణం దాటాడు. అలవాటు ప్రకారం చెట్టు కిందకి మొదట వెళ్లేడు.

"సుభాషిణీ! సుభాషిణీ!"

బందులు గబగబా బస్సుస్టాండుకి దౌడు తీశాడు.

"సుభాషిణీ!సుభాషిణీ!"-అరే ఎవరూ లేరే!

మద్రాసు మెయిల్ అప్పుడే స్టేష న్‌లో ఆగింది. బందులు గేటుయివతల నించుని- "సుభాషిణీ! సుభాషిణీ!"అని అరిచి నిష్ఫలుడయేడు.

"ఏదిరా సుభాషిణీ!"

"రాలేదు బాబూ!"

"నే చెప్పేనా వెళ్లొద్దని, చెప్తే విన్నావా వెధవ్వి!"

"రేపొస్తుందేమోనండీ!"

"ఆఁ వస్తుంది. వచ్చినా నువ్వెళ్ళకు. అవసరం ఉన్నప్పుడు అదే వస్తుంది. అసలు నువ్వెళ్ళడం నీదీ పొరపాటు!?"

* * *

"టెలిగ్రామ్ సార్! చేతి కందిం చాడు బందులు.

ఆఫీసరు, టెలిగ్రాం ఎక్కణ్నుంచి వచ్చిందోనని విప్పకుండానే పరిశీలిం చాడు. ఊహ కందలేదు. విప్పి చది వాడు గాభరా ఎత్తిపోయాడు. మళ్ళీ చదివాడు. చేతులు వణికాయి. ఇంకా చదివాడు. కళ్లెర్రబడ్డాయ్!

ఆఫీసర్ని చూస్తున్న బందులు భయ పడిపోయాడు.

"బందులూ!" వెర్రికేక వేశాడు అధికారి.




"ఏంబాబూ!" ఒణికిపోయాడు బందులు.

"రాస్కెల్! ఎక్కడున్నా వింత సేపూ?"

"ఇక్కడే! తమ దగ్గిరే బాబూ!"

"హెడ్‌గుమస్తాని రమ్మను!" ఉక్రోషంతో అన్నాడధికారి.

పంకజాక్షం హాజరయ్యాడు అధికారి ముందు.

"సుభాషిణి అనే పేరుతో ఏమైనా టపాలొచ్చేయా?"

"వచ్చేయి సార్?"

"నా యెదుట ఎందుకు పెట్టలేదు?"

"పార్టీ లెవరూ రాకపోతే చూడొద్దన్నారు కదండీ!"

"పిడుక్కీ బియ్యానికీ ఒక్కటే మంత్రమా? వెళ్ళి పట్టుకురా!

పంకజాక్షం తేవడానికి వెళ్ళేడు. వెళ్తూ, కొంపదీసి సుభాషిణి హెడ్డాఫీసుకి కంప్లెయింట్ చేసిందేమోనని భయపడుతూ, డ్రాయర్‌లోని టపాతీసి ఇక రక్షించేభారం నీదేనన్నట్లు, భక్తి వినయపూర్వకంగా అధికారి చేతికందించాడు.

అధికారి ఆమూలాగ్రం చదువుకుని ఆపాదమస్తకం కంపించిపోయాడు.

"చంపేశావ్! ఈ టెలిగ్రామ్ చూడు!" పంకజాక్షం చేతికందిస్తూ కుర్చీలో చేరబడిపోయాడు.

పంకజాక్షం వొణుకుతూ చదివేడు.

"మూడుత్తరాలు. ఎప్పటికీ మీరు రాలే—జబ్బుతో బేబీ మనల్ని విడిపోయింది—సుభాషిణి."

"క్షమించండి సార్!!"

# ప్రేమ పూజారి

(గత సంచిక తరువాయి)

'ఈ పరిసరాలకు దూరంగా, ఈ నిరాదరణకు, ఈ అవహేళనలకు దూరంగా నేనే పారిపోతున్నాను. ఇక్కడ నీకోసం పుణ్యకార్యాలు చేస్తూ ఎవరు కూర్చోబోయారు ?' రాజీవ్ ఉదాసీనంగా ఆ కాగితాలు విసిరేశాడు ఓ ప్రక్కకు.

మండుతూన్న మంటలమధ్య చిక్కబడినట్టుగా ఉంది అతడి హృదయం. ఎప్పుడో తన జన్మరహస్యం బయట పడకుండా ఉండదు. అది బయటపడితే అమ్మ బ్రతకదు. అందుకే, ఏ దుర్ఘటనా తన కళ్ళబడకముందే తన జీవితం ఆహుతి చేసుకోవాలనుకొన్నాడు. జన్మ రహస్యం బయటపడింది గాని తను తండ్రి అన్నవాడిని చంపి, తను చచ్చే అవకాశం లేకుండా పోయింది. తన పుట్టుపూర్వోత్తరాలు కోర్టులో చెప్పేసి అతడు జైల్లో కూర్చున్నాడు.

ఇప్పుడు బ్రతుకు దుర్భరమే అయినా చచ్చిపోలేడు. ఇప్పుడు చచ్చిపోవడం పిరికితనంగా కనిపిస్తూంది.

ఇక్కడినుండి పారిపోతేతప్ప బ్రతక లేడు !

రాజీవ్ కణతలు నొక్కుకుంటూ ఆస్ప్రోబిళ్ళ, టీ తెమ్మని క్రిందికి కబురు పంపాడు.

పదినిమిషాల తరువాత టీ కప్పుతో, తలనొప్పిమాత్రతో వచ్చింది శ్యామ. అతడి ముఖం చూస్తూనే "ఒంట్లో బాగా లేదా ?" అని అడిగింది గాబరాగా.

"ఒంట్లో బాగానే ఉంది. మనసులోనే బాగా లేదు."

శ్యామ దృష్టి స్టాండుమీద చిత్రింప బడిన చిత్రంమీద పడింది.

ఏదో అడవి. గుట్టల వరుస. సూర్యుడు అస్తమించగా ఎర్రటి ఎరుపు కాంతి అల్లుకుపోయింది. చిన్న కాలిబాట మీద వెనక్కి చేతులు కట్టుకొని బాట సారి ఒకడు నడిచిపోతున్నాడు.

ఆ చిత్రం చూస్తుంటే మనిషిని ఏదో వంటరితనం ఆవరించుకొంటున్నట్టుగా అనుభూతి కలుగుతోంది ! ఆ ఏకాంతానికీ, నిశ్శబ్దానికి గుండెలు బరువెక్కుతున్నాయి.

"బాబూ !" విచలితంగా పిలిచింది శ్యామ. "ఇంత నిస్పృహ ఎందుకు ! తప్పుచేసినవాడిలా మీలో మీరే ఎందుకు కుమిలిపోతున్నారు ? ఈ వంటరి

పోల్కంపల్లి శాంతాదేవి

తనాన్ని ఎందుకు కోరి తెచ్చు కొంటున్నారు ?"

"వంటరివాడిని కాక నా కెవ రున్నారు, శ్యామా ?" శుష్కంగా నవ్వాడు రాజీవ్.

"ఇదివరకు ఉన్నవాళ్ళంతా ఇప్పుడూ ఉన్నారు మీకు !"

"ఎవరూ లేరు అమ్మ అన్న మనిషి లోనే నాపట్ల నిరాదరణ చోటుచేసు కొంది. నే నొక వేశ్య కొడుకు నన్న సంగతి ఆవిడ మరిచిపోలేకపోతోంది. ఇక ప్రపంచం నన్ను ఎలా చూస్తుందో నువ్వే ఊహించు !"

"మీ తల్లి వేశ్య అయితే, మీ తండ్రి దొంగ అయితే మీ తప్పేమీ లేదు, బాబూ ! వాళ్ళ పాపాలతో మీకేం సంబంధం లేదు. అదొక కథలా చెప్పు కొంటారేగాని, మీకున్న గౌరవం ఎక్కడా పోలేదు పోదు."

రాజీవ్ బాధగా, "మరి, అమ్మ అలా ఎందుకు మారిపోయింది ?" అన్నాడు.

"ఆవిడ మారిపోలేదు. ఆవిడింకా ఆ షాక్‌నుండి కోలుకోలేదు. మీరంటే ఉన్న ప్రేమ అంత హఠాత్తుగా ఎలా పోతుంది, బాబూ ? మీ కేదైనా అయితే ఇప్పుడు మాత్రం ఆమె సహించగలదా ? మీరు ఎవరికో పుట్టినవారని వీధిలోకి వెళ్ళిపొమ్మనడం లేదుకదా ?"

"వాళ్ళు వెళ్ళిపొమ్మనకముందే నేనే వెళ్ళిపోతున్నాను." రాజీవ్ ముఖం అభిమానంతో ఎర్రబడగా అన్నాడు.

"వెళ్ళిపోతున్నారా ? ఎక్కడికి ?"

"నాలాంటివాళ్ళకు ఎక్కడికని ఏముంటుంది ? కాళ్ళు ఎటు నడిస్తే అటు."

"ఆ వృద్ధులను అలా వదిలిపెట్టేసి మీ దారిన మీరు వెళ్ళిపోతారన్న మాట ?" శ్యామ ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసి అంది. "ఇన్నాళ్ళ బంధం ఇంత హఠాత్తుగా మిథ్య అయిపోయిందా మీకు ?"

"ఆ బంధం మిథ్య అని అమ్మే అనుకొంటూంది !"

"ఆ మాట బాబుగారు కూడా అను కోవడం లేదుగా ?"

"ఈ ప్రపంచంలో మనిషికి తల్లి తరువాతే అందరూ, శ్యామా ! ఆ అమ్మే పరాయిదిగా ప్రవర్తించడం ఏ కొడుకు సహిస్తాడు ?" రాజీవ్ బాధతో ముఖం ప్రక్కకు త్రిప్పుకొన్నాడు. "అందుకే... అమ్మలో మార్పు వచ్చే వరకైనా నేను దూరంగా వెళ్ళిపోక తప్పదు !"

"అందుకని అందరినీ వదిలిపెట్టి వెళ్ళిపోతారన్నమాట ?"

'అందరినీ' అన్నపదంలో ఏదో శ్లేష వినిపించింది రాజీవ్‌కు. అతడి ముఖంలో ఏదో ఆశ, ఉద్వేగం చోటు చేసుకోగా, "నాతో వస్తావా, శ్యామా ?

నువ్వు నాతో ఉంటే ఈ ప్రపంచంలో నేను ఒంటరివాడిని ఎప్పుడూ కాను" అన్నాడు.

"ఇద్దరం కలిసి ఎక్కడికైనా లేచి పోదామంటారా, బాబూ ?" శ్యామ స్నిగ్ధంగా నవ్విన నవ్వు అతడి గుండెల్లోకి దూసుకుపోగా వివశుడై పోయాడు. చప్పున లేచి శ్యామ చెయ్యి అందుకొన్నాడు ఒకవిధమైన ఆవేశంతో తనవైపు తిప్పుకొన్నాడు ఆమెను. "కలిసి బ్రతుకుదాం, బ్రతకలేకపోతే కలిసి చద్దాం. అంతేకాని, నువ్వు రోహిణి కానక్కరలేదు, శ్యామ సుందరీ !"

"నే నామెను దృష్టిలో పెట్టుకొని అనలేదు ఆ మాట !" శ్యామ తడబడింది

"నువ్వు ఏ దృష్టితో అన్నా, నేను నిన్ను అన్యాయం చెయ్యను. వస్తావా, నాతో ? నా చేతిలో నీ చెయ్యి యిలా ఉంటే చాలు, నే నెంత దూరమైనా ప్రయాణించగలను !"

శ్యామ మాట్లాడలేదు.

"నమ్మలేవా నన్ను ?" అతడు ఆవేశంతో ఆమె భుజాలు కదిపాడు

వివశయై శ్యామ అతడి గుండెలమీద వాలిపోయింది. "మిమ్మల్ని నమ్మకపోతే ఇంకెవరిని నమ్ముతాను, బాబూ ?"

స్వర్గపు టంచులు తాకినట్టుగా పరవశం చెందాడు రాజీవ్. తన చేతుల్ని మరింత బలంగా బిగించాడు ఆమె చుట్టూ. 'దేవతా ?" అన్నాడు ఆమె చెవిలో గుసగుసగా.

తమ మొదటి పరిచయ ఘట్టం గుర్తు రాగా శ్యామ మనోహరంగా నవ్వింది. అతడి వక్షంమీద చేయి ఆన్చి వెనక్కి నిలబెట్టి, "ఏమ్, పిచ్చిబాబూ ! మళ్ళీ ఆడవాతా నాటకం ?" అంది కోపం అభినయిస్తూ

రాజీవ్ మనసారా నవ్వేస్తూ, "నా నాటకం రెండు లాభాల్ని తెచ్చిపెట్టింది తెలుసా ?" అన్నాడు.

"ఏమిటవి ?"

"ఒకటి హంతకుల్ని పట్టుకొని పోలీసులకి అప్పగించి దోషులకు శిక్ష పడేలా చేశాను రెండు లోకమంతా ఈర్ష్యపడేంత చక్కని నమ్మాయిని సంపాదించాను."

"కాని, మీ నాటకం నాకెంత నష్టం తెచ్చిపెట్టిందో తెలుసా?"

"ఏమిటది ?" రాజీవ్ గొంతులో కొంటెతనం తొంగిచూసింది.

"పుట్టింట్లో నాకు చోటులేకుండా చేసింది. నలుగురిలో నన్ను..."

రాజీవ్ చప్పున ఆమె పెదవులమీద వేలుంచాడు. "ఆ నష్టం నేను తీరుస్తాను, శ్యామా ! నువ్వెంత విలువైన దానివో నేను ప్రపంచానికి చాటుతాను ! లోకం నీకు పులిమిన కళంకాన్ని నేను కడిగివేస్తాను !"

## 34

''బాబుగారు ఇవాళ ఉదయం పోయారు.'' ఊరినుండి మనిషి ఆనంద రావు చావు కబురు మోసుకువచ్చాడు.

పిడుగుపడ్డట్టుగా నిశ్చేష్టులయ్యారు రావుగారు.

వరలక్ష్మికి దుఃఖం కట్టలు త్రెంచుకొంది.

ఆ మనిషి చెప్పిన వివరా లివి :

నిన్న రత్నకు పువ్వులు, పళ్లు పెట్టి నిశ్చయ తాంబూలాలు తీసుకోడానికి పెళ్ళివారు వచ్చారు. మొదట పెళ్ళికి అంగీకరించిన రత్న ఆ రోజు గదిలో తలుపులు బిడాయించుకు కూర్చొని తను పెళ్ళిచేసుకోనని మొండికేసింది. తండ్రి బ్రతిమిలాడినా, కోప్పడ్డా లాభంలేక పోయింది. పెళ్ళివాళ్ళముందు తల తీసేసినట్టుగా బాధపడ్డాడు ఆనందరావు. పెళ్ళివాళ్ళు మౌనంగా నిష్క్రమించారు. ప్రొద్దున టీ తీసుకొంటూ సోఫాలోనే ఒరిగిపోయాడు ఆనందరావు. లేపి సరిగా పడుకోబెట్టేసరికి ఆయన శరీరం నిర్జీవమైపోయింది.

ఉన్నపళంగా వరలక్ష్మి పెళ్ళి కారులో కూర్చొంది.

శ్యామసుందరి రాజీవ్ గదిలోకి గబగబా వచ్చింది.

''మీరు వెళ్ళరా, బాబూ ?''

''నేనా? ఉహుం. ఏం సంబంధమని, ఎవరినని వెడతాను ?''

''ఇలాంటి సమయంలోనా మీరు అభిమానం పెట్టుకు కూర్చొనేది? రత్న ఒంటరిదై ఏడుస్తూంటుంది. సురేష్ బాబు కూడా దగ్గర లేడు. ఈ సమయంలో మీరు ఓదార్చకపోతే...''

''ఓదార్చడానికి వాళ్ళ మేనత్త ఉంది. నా అవసరం వాళ్ళకు లేదులే, శ్యామా !''

''ఇదేంమాట, రాజీవ్‌బాబూ ?''

''వాళ్ళిప్పుడు నా ముఖం చూడడానికే అసహ్యపడుతున్నారు.''

''ఇదంతా మీ భ్రమ. ఏదో జరిగిందని ఇవాళ హఠాత్తుగా మీరు పరాయివారైపోరు. మీ మధ్య అనుబంధం అంత సులభంగా మాసిపోదు ?''

''ఉహుం నేను వెళ్ళలేను, శ్యామా !''

''మీరు వెళ్ళకపోతే నేను వెడతాను.''

''నువ్వా ?! నువ్వెందుకు ?''

''అయ్యో ! వాళ్ళెంత దుఃఖంతో ఉంటారు. నాలాంటిదాని అవసరం ఎంతైనా ఉంటుంది. బాబుగారి ఆరోగ్యం అంత బాగుండలేదు. ఆయన్ని ఓ కంట కనిపెట్టడం అవసరం.''

''నా కిష్టంలేదు అక్కడ వాళ్ళు నిన్ను అవమానిస్తారు !''

''ఫర్వాలేదు. ఈ జన్మ ఎన్నో అవమానాల్ని ఎదుర్కొంది. ఈమాత్రానికి ఏమీ అయిపోను !''

* * *

కర్మ ముగిశాక రావుదంపతులు మాత్రం తిరిగి వచ్చారు.

"శ్యామసుందరి రాలేదా?" రాజీవ్ తల్లిని అడిగాడు.

"కొద్దిరోజులు ఉండి వస్తానంది."

"ఎందుకు ?"

"తండ్రిపోయిన దుఃఖంలో ఉన్నారు ఆ పిల్లలు. వాళ్ళకి తోడుగా ఎవరో ఒకరు లేకపోతే ఎలాగని..."

"తనవంటే కావలసిన వాళ్ళెంత మందో ఉండగా తనెందుకు ఉండి పోవడం ? ఆమె వాళ్ళకి ఏంకావాలి?" రాజీవ్ తన విసుగునూ, చిరాకునూ దాచుకోలేకపోయాడు.

"శ్యామసుందరి రాకపోతే ఎంత కష్టముండేదో చెప్పలేనుగాని ఆమె రావడం చాలా మంచిదైంది, బాబూ ! అన్ని పనులు ఆమే అయి తిరిగింది చన్నీళ్ళస్నానంతో నాకు జలుబు, జ్వరం పట్టుకొని ప్రక్క వదలలేదు. గంటగంటకూ వచ్చి నన్ను చూసు కోవడం, వేళకు అన్నాచెల్లెళ్ళను బల వంతపెట్టి అన్నాలు తినిపించడం, బ్రాహ్మలకు ఏ లోటూ జరుగకుండా అన్నీ గుర్తుచేసి వాళ్ళకు ఇవ్వాల్సినవి ఇప్పించడం — ఎన్నేమిటి ? అందరి నాలుకలమీద శ్యామసుందరి పేరే ఆడింది. శ్యామసుందరిమీద నా కిప్పుడు కోపంలేదు, బాబూ ! చాలా మంచి పిల్ల." ప్రసన్నవదనంతో చెప్పింది వరలక్ష్మి.

"మంచిపిల్లని గుర్తించడాని ఇంతాలస్యం జరిగిందా ?"

"దేనికైనా సమయం రావా కదా ?"

వారం రోజులు గడిచిపోయాయి.

శ్యామ రాకకోసం క్షణ మొక యుగంలా ఎదిరి చూస్తున్నాడు రాజీవ్. శ్యామ రాలేదు సరికదా, అక్కడ ఆవిడ ఏం రాచకార్యాలు చేస్తూందో తెలియ రాలేదు. శ్యామ అక్కడికి వెళ్ళడమే ఇష్టంలేదు రాజీవ్‌కు. వెళ్ళి ఇన్నిరోజులు ఉండిపోవడం అసలిష్టంలేదు !

శ్యామ తనదనుకొన్నాక రాజీవ్‌కు ఈ ప్రపంచాన్ని జయించినంత ధైర్యం, గర్వం నిండిపోయాయి హృదయంలో. ఆమె తోడుంటే చాలు, ఎటువంటి కష్టాలు వచ్చినా ఎదుర్కోగలనన్న ధీమా కలిగింది.

రాజీవ్‌కు ఆమె వియోగం ఇక భరించలేనట్టుగా అనిపించింది. డ్రైవర్‌కి కారు తీసి ఇవతల పెట్టమని చెప్పి డ్రెస్ చేసుకోసాగాడు. తీరా తయారయ్యాక వెళ్ళలేననుకొన్నాడు. డ్రెస్ మార్చి నీరసంగా మంచంమీద వాలిపోయాడు. చిరాకుగా మళ్ళీ లేచాడు. పాడ్ తీసుకొని సురేష్‌కు ఉత్తరం రాయసాగాడు, శ్యామసుందరిని తక్షణం పంపించమని, అతి త్వరలోనే ఈ పరిసరాలకు గుడ్‌బై చెప్పి తామిద్దరు ఇక్కడినుండి బయల్దేర బోతున్నామని !

## 35

సురేష్ గదిలో కూర్చొని కిటికీ అవతల చెట్లలోకి చూస్తున్నాడు. అక్కడ పాదులు సరిచేస్తున్న తోట మాలి దగ్గర నిలబడి మాట్లాడుతున్నది శ్యామ.

సురేష్ చేతిలో రాజీవ్ రాసిన ఉత్తరం వుంది.

రెండు నిముషాల తరువాత శ్యామ కిటికీలోంచి కనిపించడం మానేసింది.

సురేష్ పరధ్యాసంగా చేతిలో ఉత్తరాన్ని నలిపివేయసాగాడు. ఎక్కడో మినుకుమినుకుమంటూన్న ఆశ తను ఢిల్లీ వెళ్ళిపోయాక రాజీవ్‌నుండి వచ్చిన ఉత్తరంతో ఆరిపోయింది ! శ్యామ సుందరి మనసు గెలుచుకొన్నది ఎవరో కాదు. తన రాజా ! ఇక కొద్దిరోజుల్లో వాళ్ళిద్దరూ కలిసి జీవించబోతున్నారు ! ...జీవితంలో అన్నీ పోగొట్టుకొన్నంత శూన్యం నిండిపోయింది సురేష్ హృదయంలో.

అంతలో శ్యామసుందరి గదిలోకి వచ్చింది.

"ఇవాళ కాదు రేపంటూ రోజూ నా ప్రయాణం వాయిదా వేస్తున్నారు ! ఇక రేపు తప్పకుండా వెళ్ళిపోతాను ! మీ తోట చాలా బాగుందన్నారు. ఇవాళ తీసికెళ్ళరూ ? మళ్ళీ మళ్ళీ వస్తానా ఏమిటి ?" అంది.

"రావాలంటే రాకూడదా ఏమిటి ?" సురేష్ కంఠం ఉదాసీనంగా వుంది.

శ్యామ నవ్వి, "ఎందుకు రాకూడదు గాని, ఈ రోజు తీసికెళ్ళరూ ?" అంది.

"రత్నని పిలువు "

"ఊహుఁ. రానంది."

"సరే. పదినిముషాల్లో తయారై వస్తాను !" సురేష్ టవల్ భుజంమీద వేసుకొని, పెరట్లోకి దారితీశాడు.

ఈ లోగా మరోసారి రత్నని పిలిచింది శ్యామ.

తలనొప్పిగా ఉందని, రానని చెప్పింది రత్న.

పదినిముషాల తరువాత భుజంమీద కండువాతో, లాల్చీ పంచెకట్టుతో గది ఇవతలికి వచ్చాడు సురేష్.

"మీరు పంచె కట్టుకొంటే చాలా బాగుంటారు !"

శ్యామ మెచ్చుకోలుతో సురేష్ ముఖం అప్రయత్నంగా ఎర్రబడింది. కాని, సమాధాన మేదీ చెప్పకుండానే ముందుకు నడిచాడు.

తోట కొంచెం దూరం వుండగానే కారు ఆపి దిగాడు సురేష్ అక్కడి నుండి దారి సరిగాలేదు.

అతడితోపాటు శ్యామ కూడా దిగింది

సురేష్ చెయ్యెత్తి చూపెడుతూ, "ఇక్కడినుండి అక్కడిదాకా మా

పొలాలు. ఆ కనిపించేది తోట" అని చెప్పాడు.

ఆ తరువాత ఇద్దరూ నిశ్శబ్దంగా నడవసాగారు.

నీరెండ పచ్చని పొలాలమీద అందంగా పరుచుకొంది. సాయంకాలపు గాలులు ఆహ్లాదంగా వీస్తున్నాయి.

తోట సమీపించారు.

శ్యామ ఎన్నడూ చూడని చెట్లు ఎన్నో ఉన్నాయి. పెంచిన పద్ధతి ఎంతో ఆకర్షణీయంగా వుంది. శ్యామ ఎప్పుడూ చూడని రకరకాల పక్షులు చెట్లలో సందడి చేస్తున్నాయి. వడ్రంగి పిట్ట ఒకటి చెట్టుకొమ్మమీద కూర్చొని తన పొడుగాటి ముక్కుతో టిక్కు టిక్కున పొడుస్తూంది కొమ్మను !

తోట మధ్యగా రెండంతస్తులుగా వున్న చిన్న ఇల్లు. పై అంతస్తు పిట్ట గోడమీద అడవి పావురాలు బారులు తీరి కూర్చొని వున్నాయి

ఆ పరిసరాల సౌందర్యానికి ముగ్ధురాలై పోయింది శ్యామ.

ఇంట్లోంచి రెండు కుర్చీలు తెప్పించి బయట వేయించాడు సురేష్. "కూర్చో, శ్యామసుందరీ !"

"కూర్చోవడానికి వచ్చానా ? ఎంత చూసినా తనివి తీరడంలేదు మీ తోట ! ఇదంతా మీ నాన్నగారి..."

"ఆయన అభిరుచికి రూపకల్పన ఈ తోట ! ఆయన ఎన్నో వ్యయ ప్రయాసల కోర్చి ఎంతో దూరంనుంచి తెప్పించి వేశారు చెట్లు. కాస్సేపు కూర్చో. కాళ్ళు లాగడంలేదూ ?"

"కూర్చొందే ప్రొద్దెక్కుతుంది ? కాస్త తిరిగి చూడనీయండి," అంటూనే కూర్చొంది.

నౌకరు కొబ్బరి బొండాలు కొట్టి తెచ్చాడు. అవి త్రాగేసి తిరిగి లేచింది.

పంటకాలువ ప్రక్కన నడుస్తూన్న శ్యామను అనుసరించాడు సురేష్. నీరెండలో పోతపోసిన బంగారు విగ్రహంలా మెరిసిపోతున్నది శ్యామ. సిగలోంచి విడిన వెంట్రుకలు చెంపల మీద అందంగా కదులుతున్నాయి. సురేష్ బలవంతంగా ఒక నిట్టూర్పు అణచుకొన్నాడు. ఈ రూపాన్ని ప్రేమించి తనెంత దుఃఖానికి లోను గావలసి వచ్చింది.

ఏదో అడగాలని వెనక్కి తిరిగిన శ్యామ, అతడు తనకు చాలా దూరంలో కూర్చుండిపోయి, అన్యమనస్కంగా కాలవలోకి చిన్న చిన్న రాళ్ళు విసురుతూండడం చూసింది

సురేష్‌లో వ్యక్తమౌతూన్న ఉదాసీనత శ్యామ దృష్టిలో పడకపోలేదు. ఏదో ఒక మాట విసిరి కవ్వించే అతడు ఈసారి ఎంత మర్యాద నేర్చుకొన్నాడు ! గంభీరంగా, మౌనంగ ఉండిపోతున్నాడు !

శ్యామ వెనక్కి తిరిగి అతడి దగ్గరికి వచ్చింది.

అతడికి కొంచెం దూరంగా శ్యామ తనూ కూర్చుండిపోయి, కాలువనీళ్లలో పాదాలు ముంచుతూ, అంది. "రేపు నేను వెళ్ళిపోతున్నాను. మనసు విప్పి మాట్లాడండి, సురేష్ బాబూ! ఈ మౌనం మీకు తగినట్టుగా లేదు!"

"నువ్వున్నందుకు ఎంత నిశ్చింతగా ఉంది నాకు! నౌకర్లకు పనులు ఎవరు పురమాయిస్తున్నారో, వేళకు టేబిల్ మీదికి నా కిష్టమైన పదార్థాలు ఎలా వస్తున్నాయో ఆలోచించే అవసరమే కలుగలేదు! రేపటినుండి నేను ఇవన్నీ చూచుకోవాలి కాబోలు!"

"వంటవాళ్ళున్నారు. పనివాళ్ళున్నారు. చెప్పి చేయించడానికి రత్న ఉంటుంది!"

"రత్న ఎన్నాళ్లుంటుంది? ఆమెను త్వరలో ఒక ఇంటిదాన్ని చేసే ప్రయత్నంలో ఉన్నాను!"

"త్వరలో మీరూ ఓ ఇంటివారు కండి. ఆవిడే అన్నీ చూచుకొంటుంది." శ్యామ నవ్వింది.

"ఇంత హఠాత్తుగా నాకు పిల్లనెవరిస్తారు?" సురేష్ హాస్యంగా ఒక నిట్టూర్పు విడిచాడు.

"మీరు కో అనాలి కాని కోటి మంది!"

"ఆ కోటిమందిలో ఏ ఒక్కరూ నిన్ను పోరు. శ్యామా!" అతడు వ్యథగా చూశాడు. "సారీ! నేనిలా మాట్లాడకూడదు. రాజా దెబ్బలాటకు వస్తాడు. ఇదివరలో నీమీదే నాకేదో హక్కు ఉన్నట్టు జులుం చెలాయించే వాడిని. హద్దులు మరిచి మాట్లాడేవాడిని. ఇప్పుడు ఏంమాట్లాడాలన్నా రాజా కళ్ళ ముందు నిలుస్తాడు! వెళ్ళు, శ్యామా! నిన్ను ఉండమని చెప్పడానికి నేనెవరిని? రాజా నీకోసం చూస్తూంటాడు. ప్రేమ చెయి పట్టుకొని రక్షణ ఎప్పుడూ ఉంటుంది. అదెంతో తీయనిదీ, గుండెల్ని కోసేదీ. ఆ బాధ ఎటువంటిదో నాకు తెలుసు. నిన్నిక్కడ కొన్నాళ్లు ఉంచుకొని రాజాని బాధ పెట్టడం నా కిష్టంలేదు. ఈ రోజు అతడి నుండి ఉత్తరం కూడా వచ్చింది నిన్ను వెంటనే పంపించమని!" సురేష్ కంఠం చిత్రంగా ధ్వనించసాగింది.

"నేను మీ రాజా సొమ్మునైనట్టే మాట్లాడేస్తున్నారే!"

"ఇవాళ కాకపోయినా రేపు అవుతావు! మీ పెళ్ళికి నేను రానా? వద్దా?"

"ఆహ్వానించడానికీ, వద్దనడానికీ నేనెవరిని? మీ ఇష్టం అది"

"నువ్వు రమ్మంటే వస్తాను!"

"మీరిలా మాట్లాడితే మీ రాజా దెబ్బలాటకు వస్తాడేమో!" ఇంచుక అలుకతో అని తిరిగి మందస్వరంతో,

"కాని, సురేష్‌బాబూ ! ఈ జీవితంమీద మీ రాజాకంటే మీకే ఎక్కువ అధికార ముంది. శాసించి ఏది పొందడానికైనా హక్కు హోటల్ మధిరాలో మీకు ఇవ్వబడింది !" అంది.

"ప్రేమ అనేది హక్కులతో, అధికారాలతో పొందేది కాదని నాకు తెలుసు, శ్యామా !" నిస్పృహగా అన్నాడు.

"ఇంత మంచితనం మంచిదికాదు. అది మిమ్మల్ని చాలా దుఃఖపెడుతుంది !"

"దుష్టత్వంతో సుఖాన్ని పొందే కన్నా మంచితనంతో దుఃఖాన్ని ఆశ్రయించడమే మంచిది !"

"ఇంత సాత్వికు లెప్పుడైపోయారు ? నాకు పాము, ముని గుర్తు వస్తున్నారు."

సురేష్ ఎందుకో గాఢంగా నిట్టూర్పు విడిచాడు. "వీలైనంత త్వరలో నేను ఈ దేశం విడిచి వెళ్ళిపోవా లనుకొంటున్నాను, శ్యామా ! నాన్నగారు పోకుంటే నేను ఫారిన్‌లో ఉండేవాడిని ఈ సమయంలో ఆయన పోవడం నాకు ఊపిరాడనట్టుగా చేసింది. ఓ ప్రక్క ఆయన రాజకీయాల్లో మునిగి తేలుతూనే ఇంటినీ, బంధుమర్యాదల్నీ, వ్యవసాయాన్ని, వ్యాపారాన్ని లక్ష వ్యాపకాలను దక్షతతో నిర్వహించే ఆయన పోయాడు ! ఆయన సమర్థత నాకు లేదు ! ఈ తోటను, పొలాల్ని బేరం పెట్టేసి, ఇక్కడ సంబంధాలన్నీ పూర్తిగా తెంపుకొని మళ్ళీ రాకుండా వెళ్ళిపోవా లనుకొంటున్నాను !"

"హృదయంలో వ్యధ దాచుకొని ఎక్కడికి పారిపోయినా ఏముంది లాభం ?"

"నిజమే. మరి, నాకు ఉపాయం చెప్పు, శ్యామా ! అగాధంలాంటి ఈ చీకటిలోంచి, గుండెల్ని కోసే ఈ విషాదంలోంచి, చిత్రహింసపెట్టే ఈ ఒంటరితనంలోంచి నాకు విముక్తి కలిగే ఉపాయం చెప్పి పో !" దూరంగా ఉండడం చేతకానట్టుగా నెమ్మదిగా జరిగి ఆమె చెయి పట్టుకొన్నాడు, సురేష్.

చాలాసేపు స్తబ్దంగా కూర్చుండి పోయిన శ్యామ అతడి చేతిలోంచి చెయి విడిపించుకొనే ప్రయత్నం చేయలేదు. చివరికి మెల్లగా, "ఉపాయం చెబుతాను, సురేష్‌బాబూ ! కాని ఇప్పుడు కాదు" అంది.

సురేష్ ఆమె చెయ్యి వదిలిపెట్టి లేచాడు.

చీకటి చిక్కన కాసాగింది.

## 36

సురేష్ ఇంటికి వస్తూనే సరాసరి రత్న గదిలోకి దారితీశాడు.

"రత్నా !"

"ఉఁ." చీకటిలోంచి రత్న గొంతు వినిపించింది.

"లైటు వేసుకోకుండా చీకటిలో ఉండిపోయా వేమిటి చెల్లాయ్ ?" సురేష్ లైటువేశాడు. రత్న మంచంమీద పడుకొని ఉంది. సురేష్ ఉపోద్ఘాతం లేకుండా సూటిగా ప్రారంభించాడు. అక్కడున్న కుర్చీ ఒకటి లాక్కొని కూర్చొని, "వారం పదిహేనురోజుల్లో నేను వెళ్ళిపోవాలి, రత్నా ! నిన్నెక్కడ ఉంచాలో నాకు తోచడంలేదు. అత్తయ్య దగ్గరికి వెడతావా ?"

"ఉహుం."

"తల్లీ తండ్రీ, అన్నీ తనే అయి మనల్ని పెంచిన నాన్నగారు పోయారు, రత్నా ! నాన్న ఏ ఆరాటంతో కళ్లు మూశాడో – అది వీలైనంత త్వరలో దాటిస్తే ఆయన ఆత్మకు శాంతి కలుగ జేస్తుంది. ఈ డాక్టరు సంబంధం కాకపోతే మరొకటి. చెప్పు, చూడ మంటావా ?"

"ఉహుం."

"అన్నిటికీ ఉహు అంటే ఎలా చెప్పు ? నీ మనసులో ఉద్దేశ్యం నాకెలా తెలుస్తుంది ?"

"నేను పెళ్ళి చేసుకోను."

"చేసుకోక ఏంచేస్తావు ?" ఆశ్చ ర్యంగా అడిగాడు సురేష్. "ఇదివరకు ఈ అభిప్రాయం ఉండేది కాదుగా ?"

"ఉండేది కాదు. ఇప్పుడుంది."

"కారణం తెలుసుకోవచ్చా ?"

"చేసుకోవా లనిపించడం లేదంతే."

"ఎందుకు ?"

"రాజాతో ఊహించుకొన్న జీవి తాన్ని మరొకరితో పంచుకోలేను, అన్నయ్యా ! ఈ జన్మ ఇలా గడిచి పోవాల్సిందే."

"జీవితమంతా ఒంటరిగా..."

"ఒంటరిని ఏంకాను నువ్వు పెళ్ళి చేసుకో. నీ దగ్గరుంటాను. వదిన తోడుంటుంది."

"పిచ్చి ఆలోచన, రత్నా ! ఏ వది ననో తోడు చేసుకోవాల్సిన వయసా నీది ? త్వరగా నిన్నో ఇంటిదాన్ని చేస్తే తప్ప నా బాధ్యత తీరదమ్మా ! త్వరగా నీ మనస్సు మార్చుకొంటే నా బరువు తగ్గించిన దానివౌతావు."

"అప్పుడే నీ కంత బరువై పోయానా ?" రత్న దుఃఖస్వరంతో అడిగింది.

సురేష్ చలించిపోయాడు. "ఇది బరువుకాదమ్మా ! బాధ్యత" అన్నాడు ఆర్ద్రస్వరాన.

ఉదయం సురేష్‌కు టీ తీసుకు వచ్చిన శ్యామ, "ఇవాళ నాతో రత్నను తీసుకువెడతాను," అంది.

"ఎందుకు ?"

"రెండురోజులు వాళ్ళ మేనత్తదగ్గ రుండి వస్తుంది."

"అది రాదు. మొన్న అత్త పిలిచినా రానని చెప్పింది."

"రత్నను ఒప్పించి నాతో

తీసుకువెడతాను. మీ అభ్యంతరం ఉండదుగా ?"

"అదెందుకు నీతో ? మీ అనురాగ సరాగాలు చూచి భోరుమని ఏడవ డానికా ? ఆ కుళ్ళి చచ్చే దేదో ఇక్కడే చావనీ !"

"అబ్బ ! ఎంత కోపం నామీద మీకు ?" నవ్వుతూనే అక్కడినుండి వెళ్ళిపోయింది."

* * *

"ఒంటరిగా ఉండి నీ దుఃఖం రెట్టింపు చేసుకోవడమేగా ? నాలుగు రోజు లుండి వచ్చేద్దువుగాని ప్రయాణం కా, రత్నా !"

"నాకూ, ఆ ఇంటికీ ఋణం తీరి పోయింది.

"అదెలా తీరిపోయింది ?"

"ఆ ముఖం చూడాలంటే నా కసహ్యం ! పుట్టుకలో వస్తాయి బుద్ధులు-అన్న మాట నిజం చేశాడు."

"ఆ ముఖం చూడడానికి నీ కసహ్యమేమోగాని అదే సదా నీ హృదయంలో నాట్యమాడుతున్నదన్న సంగతి నాకు తెలుసు. కంసుడు కృష్ణుణ్ణి ద్వేషిస్తూనే నిద్రలో, మెలుకువలో స్మరిస్తూ ఆ పరమాత్మలో ఐక్యమయ్యాడట. నిన్ను చూస్తుంటే నాకు కంసుడు గుర్తు వస్తున్నాడు."

"బాగా గుర్తు వచ్చాడుగాని నన్ను విసిగించక వెళ్ళు."

"ఊహుఁ. నిన్ను నాతో తీసుకు వెళ్ళందే వదలను !"

"ఇంకా నన్నే డిపించడానికా ? జరిగింది చాలదా ?"

"ఊహుఁ. మరిచిపోయిన నవ్వును తిరిగి నీకు నేర్పడానికి ! నువ్విలా మూగబోవడం నాకు బాగుండదు !"

"నేనెలా ఏడిస్తే నీ కెందుకు ! నువ్వా రాజాతో ఊరేగుతుంటే నే నడ్డు వచ్చే హీనురాలిని కాను తెలుసా ?"

ఆ ఎత్తిపొడుపుకు శ్యామ ముఖం చిన్నబోయింది. అయినా పెదవులమీద చిరునవ్వు చెదరకుండా, "నేను కూడా అంత హీనురాలిని కానమ్మా రత్నా ! అన్యాయంగా ఎవరికో చెందవలసిన స్థానాన్ని ఆక్రమించుకొని నేనేం సుఖ పడతాను ? ఆ చోటు ఇంకా ఖాళీగానే వుంది. అది నీ కోసమేగాని, మరెవరి కోసమూకాదు !"

"ఛీ ఛీ ! ఇంకెక్కడి స్థలం ? అదెప్పుడో కలుషితమైపోయింది. మన సులో చోటు మరొకరి దయ్యాక జీవితంలో చోటు ఎవరికి కావాలి ? అసలు అతడి నెవరు పెళ్ళిచేసుకొంటారు ? లేచిపోయిన దాని కొడుకు. విధవ కొడుకు వేశ్య కొడుకు. ఏది పడితే అది అందుకొనే గతి పట్టదులే నాకు. అతడు నీ బోటివాళ్ళకే సరిపోతాడు !"

"ఇన్ని మాటలూ నువ్వు మన స్ఫూర్తిగానే అంటున్నావా, రత్నా ?"

"ఆఁ."

"ఈమాటలన్నీ మీ బావకళ్ళలోకి చూస్తూ అను. అప్పుడు నమ్ముతాను!"

"అతడు నాకు బావెలా అవుతాడు? అతడి మరదళ్లు ఎక్కడో వుంటారు!"

"అతడిని మనసారా ప్రేమిస్తున్న వారే ఇంత నీచంగా చిత్రించడం నాకు బాధగా వుంది. ఇదే న్యూనతతో అతడు కుమిలిపోతున్నాడు. అతడి న్యూనతను పోగొట్టి తమలో పూర్వంలా కలుపుకో వలసినవాళ్లే అతడిని దూరంగా నిలబెట్టి అతడంటే అసహ్యాన్ని పెంచుకోవడం చూస్తుంటే..."

"అసహ్యాన్ని పెంచుకొంటే తప్ప నే నతడిని మరిచిపోలేను. మరిచిపోక పోతే బ్రతకలేను. నిజంగా నాకు అసహ్యం ఎందుకు కలగడం లేదో ఆశ్చర్యంగా వుంది. నన్నతడు కోరడం లేదని తెలిసీ అతడినే నా మనసు ఎందుకు కోరుతుందో తెలియడంలేదు. నా అభిమానం ఎక్కడ చచ్చిపోయిందో తెలియడంలేదు! ఇదంతా నా స్వభా వానికి వ్యతిరేకం. ఇటువంటి బలహీన తకు నా మనసు ఎప్పుడూ లొంగి పోయింది కాదు!" ఆవేశంతో, దుఃఖంతో అంది రత్న.

"ఇది బలహీనత కాదు! ప్రేమలో వుండే మహాత్మ్యం! నువ్వు ఎంత లోకువగా చూడాలన్నా చూడలేవు! మరిచిపోవా లనుకొంటే మరిచిపోలేవు. రత్నా, ఇటు చూడు! నేను నువ్వను కొన్నంత చెడ్డదాన్నికాదు! ఏ విధంగా కూడా ఒకరికి చెందవలసినదాన్ని దోచుకొనే మనిషిని కాను. నువ్వు ప్రేమించినవాణ్ణి, ప్రేమిస్తున్నవాణ్ణి నావాణ్ణి చేసుకోను!" దృఢస్వరంతో అంది శ్యామ.

"ఎలాగూ నా కతడు ప్రాప్తం లేదు.. నువ్వెందుకు వదులుకోవడం?"

"నీకోసం!"

"నేను నీ కేమౌతాను?"

"సాటి ఆడదాని వౌతావు."

"నువ్వతడిని పెళ్ళిచేసుకోకపోతే నాకు ఒరిగేదేమిటి?"

"బాబు నిన్ను పెళ్ళిచేసుకొనేలా ఒప్పిస్తాను."

"నువ్వు చెబితే వింటాడా?"

"అతడి ప్రేమకు పరీక్ష! అతడు నిజంగా నన్ను ప్రేమిస్తుంటే నా మాట కాదనడు!"

"మాటకోసం పెళ్ళిచేసుకొనేవాడితో నేనేం సుఖపడతాను?"

"బాబు ఒకరిని బాధపెట్టే మనిషి కాదు, రత్నా! ఎంత బాధనైనా తనే భరిస్తాడు. అది ఏ పరిస్థితిలోనూ మరొకరికి పంచడు. ముఖ్యంగా తాళి కట్టిన అర్ధాంగికి!"

"చిన్నప్పటినుండి అతడి భార్యగా పేరు పెట్టబడినదాన్ని నేను. చిన్నప్పటి నుండి అతడితో నా జీవితాన్ని ఊహించు

కొన్నదాన్ని నేను. కాని, అతడి మనసు గెలుచుకొన్నది నువ్వు! ఇవాళ నామీద జాలిపడి గొప్పమనసుతో అతడిని నాకు దానం చేస్తానంటున్నావు! చేతులు చాచడం సిగ్గుగా వుంది. బాధగా వుంది. కాని, చాచకుండా ఉండనూలేను. అతడి మీద వ్యామోహాన్ని చంపుకోలేను! ఇవ్వు. దానం ఇవ్వు! నా రాజాను నా కివ్వు!" రత్న పిచ్చిదానిలా చేతులు ముందుకు చాచింది.

శ్యామ ఆ చేతుల్ని ఆప్యాయంగా అందుకొంది. "నీ వస్తువును నీ కిస్తు న్నాను. ఇది దానం ఎప్పటికీ కాదు. రత్నా!"

శ్యామతో రత్న వెడుతున్నదని తెలిసి విస్మయం చెందాడు సురేష్. వాళ్ళిద్దరు ఏంమాట్లాడుకొన్నారో తెలియ దతడికి.

సురేష్‌తో వీడ్కోలు తీసుకొని కారెక్కిన శ్యామ కారు కదులుతోంటే అతడివంక చూసింది.

సురేష్ స్తబ్ధంగా, తనకి ప్రియమైన దాన్ని శాశ్వతంగా పోగొట్టుకొంటున్న వాడిలా నిలబడ్డాడు.

ముఖం త్రిప్పేసుకొన్న శ్యామ కళ్ళలో నీళ్ళు మెరువసాగాయి.

## 37

ఇంటిముందు శ్యామతోపాటు కారు దిగుతున్న రత్నను చూచిన రాజీవ్ గతుక్కుమన్నాడు.

'రత్న ఎందుకు వచ్చినట్టు? ఏదైనా గొడవ చేయదుకదా?'

శ్యామకోసం ఊపిరి బిగబట్టుకొని ఎదిరి చూడసాగాడు రాజీవ్. తనే క్రిందికి వెడదామంటే రత్నకి ఎదురు పడడం ఇష్టంలేదు!

గదిలో అస్థిమితంగా పచార్లు చేస్తున్న రాజీవ్ వెనుక అడుగుల చప్పుడు విని చివ్వున వెనుదిరిగాడు. వెంటనే అతడి ముఖం విప్పారింది. చేతులు చాచి "శ్యామా!" అన్నాడు మధురకంఠంతో. "ఇన్నిరోజులా ఈ వియోగం? ఇంకెప్పుడూ ఇలా వదిలి పెట్టి వెళ్ళనివ్వను. తెలిసిందా?" అన్నాడు. గుండెలమీద వాలిపోయే శ్యామకు ఎన్నో కబుర్లు చెప్పాలని తహతహలాడుతున్న దతడి మనసు. ఈ వియోగం తన నెంత చిత్రహింస పెట్టిందో చెప్పాలనిపించింది. కాని, అతడు ఊహించినట్టుగా శ్యామ పరుగున వచ్చి అతడి చేతుల్లో ఇమిడిపోలేదు.

దూరంగా ఆగిపోయిన శ్యామ కన్నులు అతడి ప్రయత్నాన్ని వారిస్తు న్నట్టుగా చూశాయి. "బాబూ!" నెమ్మ దిగా పిలిచింది.

"ఏమిటి, శ్యామా?"

శ్యామ మెల్లగా అతడిని సమీపిం చింది. కుడిచెయ్యి అతడి ముందుకు చాచింది ఆమె అరచేతిలో మూతతీసిన కుంకుమభరిణె ఉంది.

రాజీవ్ అర్థంకానట్టుగా చూశాడు.

"నా నుదుట మీ చేతుల్తో కుంకుమ పెట్టండి బాబూ !"

రాజీవ్ ఉత్సాహంగా కుంకుమభరిణె అందుకొన్నాడు. వ్రేలితో కుంకుమ తీసి ఆమె కనుబొమలమధ్య ఉంచాడు.

కుంకుమ శోభితమైన శ్యామ ముఖాన్ని చూస్తుంటే రాజీవ్ హృదయంలో తృప్తి నిండిపోయింది. గొంతు నిండుగా అనురాగం నింపుకొని "శ్యామా !" అన్నాడు.

"ఈ క్షణంనుండి మీరు నాకేమౌతారో చెప్పనా, బాబూ ?"

"చెప్పు !"

"అన్నయ్య !"

"శ్యామసుందరీ !" పిడుగుపాటు తిన్నవాడిలా అరిచాడు.

"నేను మీ జీవితంలో అర్ధాంగిగా అడుగుపెడితే మరొకరి జీవితం శూన్యమౌతుంది !"

"ఎవరిది ?"

"రత్నది "

"మా మధ్య అనుబంధం ఎప్పుడో తెగిపోయింది. ఇప్పుడామె ప్రసక్తి అనవసరం !" రాజీవ్ అసహనంగా అన్నాడు.

"కాని, బాబూ ! మిమ్మల్ని అసహ్యించుకొంటున్నట్టుగా కనిపించే రత్న అనుక్షణం మిమ్మల్నే ఆరాధిస్తూంది ! వేళకు అన్నం తినదు. వేళకు నిద్ర పోదు. మీ స్మరణతోనే బల్లిలా పాలిపోయింది! ఆమె పరిస్థితి చూస్తే మనసు కరిగి నీరవుతుంది !"

"అయితే నన్నేం చేయమంటావు ?"

"మీరు ఇంత స్వార్థపరులు ఎప్పుడైపోయారు ?"

"నువ్వింత త్యాగమూర్తివి ఎప్పుడయ్యావు ?" వెటకారంగా ఎదురు ప్రశ్నించాడు.

శ్యామ పేలవంగా నవ్వింది. "త్యాగమూర్తినా ? ఉహుఁ. తనదైనదాన్ని వదులుకొంటేనో, ఎవరికైనా ఇచ్చివేస్తేనో త్యాగమౌతుంది. నాదంటూ ఏముంది ఇక్కడ ?"

"ఏమీ లేదూ ?" రాజీవ్ చురుగ్గా చూశాడు.

"ఉహుఁ."

"నేను...నేను నీకేమీకానూ ?"

"ఎందుకు కారు ? ఇంతకుముందే కదా అన్నయ్యవని చెప్పింది ?"

"శ్యామా !" సహించలేనట్టుగా, హృదయం ముక్కలౌతున్నట్టుగా పిలిచాడు. "మన మధ్య అవాంతరాలేమీ లేవనుకొన్నాను. ఇప్పుడీ విపరీతం ఏమిటి ?"

"నిజమే. నేను మిమ్మల్ని మనసారా ప్రేమించాను. మీతో కలిసి అడుగు వేయడానికికూడా నిశ్చయించుకొన్నాను. సురేష్‌బాబువాళ్ళ ఊరికి వెళ్ళాక అదెంత అసంభవమైనదో తెలిసింది.

నేను త్యాగం చేస్తున్నది మిమ్మల్ని కాదు, బాబూ ! నా ప్రేమను. మీ రెప్పుడో రత్నకు వాగ్దత్తమైపోయారు. ఆ అనుబంధాన్ని మీరు తెంచుకొన్నంత సులభంగా రత్న త్రెంపుకోలేక పోయింది పాపం ? ఆమె వస్తువుని నేను ప్రేమించడానికిగాని, నాదిగా చేసుకోడానికిగాని నాకు మనస్కరించడంలేదు."

''నేనేం వస్తువును కాను. మనిషిని. మనసున్న మనిషిని.''

"అదేకదా నా నమ్మకం ? రత్నపట్ల మీరు మనసున్న మనిషిగా ప్రవర్తిస్తారనే నా నమ్మకం. మనసున్న మనిషి చేసేపని ఏమిటంటే ఆనందం అవతలి వాళ్ళకి పంచి దుఃఖాన్ని తను స్వీకరిస్తాడు. మీరు రత్నని అన్యాయం చెయ్యకండి, బాబూ !"

''రత్నని పెళ్ళిచేసుకొంటే చాలు - ఆమెకు న్యాయం చేసినట్టు అవుతుందని అనుకోను. ఎందుకంటే నా మనసు ఆమెను కోరడంలేదు. పోతే, రేపో మాపో దేశదిమ్మరినై వెళ్ళిపోతున్నాను. నాతో ఆమె కష్టాలు పడలేదు."

"మీరు దేశదిమ్మరులు కాకూడదనే నా కోరిక. మీ రెక్కడికీ వెళ్ళవలసిన పనిలేదు. ఇక్కడే ఉండండి ! కొద్ది రోజులుమాత్రం మీ గురించి ప్రజలు కథలుగా చెప్పుకొంటారు. తరువాత వాళ్ళలో మామూలుగా కలిసిపోతారు. ఈ వృద్ధాప్యంలో మిమ్మల్ని పెంచిన వాళ్ళని వదిలేసి వెళ్ళడం మీకు ధర్మం కాదు. రత్నని చేసుకొంటే మీరు వాళ్ళలో తొందరగా కలిసిపోతారు !''

"ఎవరూ లేకపోయినా సరే, నువ్వుంటే నాకు చాలు, శ్యామా !"

''తప్పు ! చెల్లెల్ని కోరకూడదు." శ్యామ వారించింది.

రాజీవ్ కంపరంగా, "ఎక్కడి వరుస కలిపావు, శ్యామా ? నువ్వు నాకు చెల్లెలి వెలా అవుతావు ? నోటితో అనగానే సరిపోయిందా ? మనసులో ఆ భావం కలగొద్దా ?" అన్నాడు.

దానికి జవాబు చెప్పలేనట్టుగా నిస్సహాయంగా చూసింది శ్యామ.

"నా సంగతి వదిలెయ్యి. నీ సంగతి ఏమిటి ? నీ భవిష్యత్తు ఆలోచించుకొన్నావా ?''

''నాకేం ఫర్వాలేదు, బాబూ ! ఈ ప్రపంచంలో నేను ఒంటరిదాన్నని మీరు బాధపడకండి. నాకోసం ప్రాణమైనా ఇచ్చేంత గాఢంగా నన్ను ఇద్దరు యువకులు ప్రేమిస్తున్నారు. ఒకరు మీరు. మరొకరు సురేష్‌బాబు. మీరిద్దరు ఉండగా నా జీవితం ఏమౌతుందన్న ఆలోచన, బెంగ నాకవసరంలేదు !"

మౌనంగా, నిశ్శబ్దంగా కొద్దిక్షణాలు గడిచిపోయాయి ఇద్దరి మధ్య. చివరికి ఏదో నిశ్చయించుకొన్నవాడిలా అక్కడి నుండి కదిలి సూట్‌కేస్ తెరిచాడు.

మీకు మీరే రుజువు చేసుకోండి

# సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు మరే యితర డిటర్జంట్ బిళ్ల లేదా బార్‌కన్నా తెలుపు










"పోల్చి చూడగలిగిన ఉతికే పరీక్ష" చేసి చూడండి.

- ఒకే రకంగా మురికి పట్టిన రెండు బట్టల్ని తీసుకోండి.
- ఒకదాన్ని ఏదైనా డిటర్జంట్ బిళ్ళతోనో లేదా బార్‌తోనో ఉతకండి.
- ఇప్పుడు మరో మురికి బట్టని సూపర్ రిన్‌తో ఉతకండి.
- ఫలితాన్ని పోల్చి చూడండి.

మీరు ప్రత్యక్షంగా చూసేది యిది— సూపర్ రిన్ మరింత తెల్లని తెలుపు వచ్చేలాగ మీ బట్టల్ని ఉతుకుతుంది. మరే యితర డిటర్జంట్ బిళ్ళ లేదా బార్‌కన్న మరింత తెల్లగా... కారణం, సూపర్ రిన్‌లో మిగతా వాటికన్న తెలుపు చేసే పదార్థాలు ఎక్కువగా ఉన్నాయి గనక.

**మరే యితర డిటర్జంట్ బిళ్ళ లేదా బార్‌కన్నా మరింత తెలుపు చేసే శక్తి**

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి    లింటాస్-RIN.23-172 TL

గబగబా చేతికందిన వస్తువులు, బట్టలు తీసి అందులో పడేసి పెద్దచప్పుడుతో మూశాడు.

"ఎక్కడికి ?"

"నా చావేదో నేను చావడానికి "

శ్యామ చలించలేదు. చిరునవ్వు నవ్వింది. "నా మాటకాదని వెళ్ళగలిగే శక్తి మీకుంటే వెళ్లండి, బాబూ !"

''శ్యామా ! శ్యామా ! నా మనసు ముక్కలు చేస్తున్నావు నీ మాటలతో." రాజీవ్ అరచేతుల్లో ముఖం దాచుకొన్నాడు

శ్యామ నిశ్శబ్దంగా కొద్దిక్షణాలు నిలబడి తరువాత అక్కడినుండి వెళ్ళిపోయింది.

## 38

ఆ తరువాత కొద్దిరోజుల్లోనే రత్నకూ, రాజీవ్‌కూ వివాహం జరిగింది.

వివాహం ముక్తసరిగా జరగాలని రాజీవ్ కోరాడు.

"ముక్తసరిగా ఎందుకు జరగాలి ? మనకేం తక్కువని ? మనమేం తప్పు చేస్తున్నామని ?" అంటూ సురేష్ అట్టహాసంగా చెల్లెలి పెళ్ళి ఏర్పాట్లు చేశాడు.

పట్టుచీర రెపరెపలాడుతుండగా పెళ్ళిలో ఎక్కడ చూసినా శ్యామే తిరుగుతోంది. పెళ్ళికివచ్చినవాళ్ళ కళ్ళన్నీ శ్యామమీదే ఉన్నాయి. 'ఎవరీ అపురూప సౌందర్యవతి ?' అందరిలో ఇదే జిజ్ఞాస - ఒకరిద్దరు యువకులు తమ కుతూహలాన్ని చంపుకోలేక ఆమె వివరాలు సేకరించారు ఎక్కడో దిక్కూ మొక్కూలేని విధవ రావుగారింట్లో వంటకు కుదిరి, వీళ్ళ ఆదరాభిమానాలు చూరగొని వీళ్ళలో ఒకతెగా కలిసిపోయిందని తెలిసి ఆమె ఇష్టపడితే ఆమెను పెళ్ళిచేసుకొంటామని రావుగారి దగ్గరికి రాయబారం పంపారు.

"విన్నావా, శ్యామా ? ఏంచెప్పాలి వాళ్ళకు ?" అంటూ అడిగారు రావుగారు.

"సంబంధం కుదిరిందని చెప్పండి, బాబాయ్ ?''

ఆనందం పట్టలేకపోయారు రావుగారు. "నిజమా, శ్యామసుందరీ ? నా ఊహ సరిఅయినది అయితే సురేష్ కావాలి ఆ వరుడు.''

సిగ్గుతో శ్యామ ముఖం అరవిందం కాగా అక్కడినుండి పారిపోయింది.

చెల్లాచెదురు కాబోతున్న సంసారం కుదుటపడ్డట్టుగా తృప్తిపడ్డారు రావుగారు.

నరలక్ష్మి కూడా తన విచారాన్ని చాలామట్టుకు మరిచిపోయినట్టుగానే ప్రవర్తించింది. ఆమె శ్యామను అడగంది ఒక్కపనీ చేయడంలేదు !

ఆడపిల్ల లాంఛనాలు సురేష్‌తో పోట్లాడి మరీ ఇప్పించుకొంది శ్యామ.

(సశేషం)

**Printed and Published by A. Chandra Sekar Rao at 5-9-88, Public Garden Road Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001. Editor : A. SUDHAKARA RAO**



**బహుమతి : రూ. 116**

ఈ క్విజ్‌లో మొదటి అయిదింటికి నాలుగేసి సమాధానాలు ఇచ్చాము. అందులో సరైన సమాధానాన్ని మీరు ఎంచుకొని క్విజ్‌ను పూర్తి చేయాలి. మిగతా అయిదింటికి పాఠకులే సమాధానాలు 6 నుంచి 10 వరకూ ఇచ్చిన "డాష్" లలో వ్రాయాలి.

## 'క్విజ్' లో పాల్గొనేవారు పాటించవలసిన నిబంధనలు

1. సమాధానాలు 'యువ' కూపన్‌మీద మాత్రమే వ్రాసి పంపాలి. కవరు మీద 'క్విజ్' అని స్పష్టంగా వ్రాయాలి. అందులో క్విజ్ కూపన్ తప్ప మరేమీ ఉండరాదు. కూపన్‌లో ఎటువంటి దిద్దుళ్ళు ఉండరాదు.
2. ఒకరికంటె ఎక్కువమంది ఆల్‌కరెక్టు సమాధానాల్ని పంపితే, వారికి బహుమతి సొమ్మును పంచడం జరుగుతుంది. సంఖ్య మరీ ఎక్కువైతే లాటరీ పద్ధతిని అమలుపరుస్తాం.
3. సమాధానాలు సీలువేసిన కీ సొల్యూషన్‌తో సరిపోవాలి.
4. దీనికి సబంధించిన విషయాలలో 'యువ' సంపాదకునిదే తుది నిర్ణయం. క్విజ్ సమాధానాలను జూలై సంచికలో ప్రకటిస్తాము. ఎట్లాంటి ఉత్తర ప్రత్యుత్తరాలకు అవకాశం లేదు.
5. మాకు కూపన్లు చేరవలసిన ఆఖరు తేదీ జూన్ 3. ఆ పైన వచ్చినవాటిని పరిశీలించడం జరగదు.

## జూన్ నెల క్విజ్

1. మన దేశంలో మొదటగా ప్రింటింగ్ ప్రెస్‌ను ప్రవేశపెట్టినది
   (ఎ) జేమ్స్‌హిక్ (బి) కాక్స్‌టన్ (సి) హో (డి) స్టైఫెన్సన్
2. నదిలోకంటే సముద్రంలో ఈదటం సులభము. ఎందుకంటే
   (ఎ) సముద్రము అతి విశాలమయినది (బి) సముద్రంలో అలలు ఎక్కువ (సి) సముద్రపునీటి సాంద్రత హెచ్చు (డి) సముద్రపు లోతు ఎక్కువ.
3. "సగం చీకట్లో సగం వెలుతురు
   మొత్తం చీకట్లో పూర్తి వెలుతురు"— ఈ వచన కవితను వ్రాసింది

(ఎ) డి బాలగంగాధర తిలక్ (బి) సి. నారాయణరెడ్డి
(సి) దాశరథి (డి) ఆరుద్ర

4. మనదేశంలో తొలి టాకీ ఫిలిం నిర్మాత
(ఎ) దాదా సాహెబ్ ఫాల్కే (బి) హెచ్. ఎం. రెడ్డి
(సి) ఆర్దేషిర్ ఇరాని (డి) వాసన్

5. ఒలింపిక్ పందేలలో ఎన్ని ఆటలు ఆడుతారు
(ఎ) 21 (బి) 19 (సి) 22 (డి) 23

6. 'టిల్లూ' అనే పాత్ర యద్దనపూడి సులోచనరాణిగారి —— నవలకు సంబంధించినది.

7. ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించిన తొలి మహిళ——

8. ప్రపంచంలో వెడల్పయిన జలపాతం——

9. ఇండియన్ నెపోలియన్‌గా ఖ్యాతి గడించినది——

10. క్రికెట్‌లో వెస్ట్ ఇండీస్‌మీద డబుల్ సెంచరీ సాధించిన తొలి భారతీయుడు——

# యువ
## క్విజ్ కూపన్ - జూన్ '77
## సమాధానాలు

1- ☐ 2- ☐ 3- ☐ 4- ☐ 5- ☐

6 .................. 7 .................. 8 ..................

9 .................. 10 ..................

పేరు : ____________________

అడ్రసు: ____________________

____________________

____________________